# 'ఆక్రందన'పై ఓ రైతు పెద్ద అభిప్రాయం

'చతుర సెప్టెంబరు '94లో శ్రీ మొలకలపల్లి కోటేశ్వరరావుగారి 'ఆక్రందన' నవల ప్రచురించినందుకు అభినందిస్తున్నాను. పట్టణవాసులకు, ప్రత్తిగాక ఇతర పంటలు పండించేవారికి, ప్రత్యేకించి మాగాణిప్రాంత ప్రజలకు ఈ నవలాంశం క్రొత్తదికావచ్చును. మెట్టవాణిజ్య పంటలు పండించేవారికి అందునా ప్రత్తిరైతులకు జరిగిన ఘోర అన్యాయానికి ఇది ఒక డాక్యుమెంటులాంటిది.

'రాజుగా మనమెంచి రైతును కొలవకుంటె
సాగునా లోకాలు, నిలచునా జీవాలు...'

- అనే పాటలు స్వాతంత్ర్యానికి ముందు వినబడుతూవుండేవి. వాటితో పొంగిపోయిన రైతులోకం స్వతంత్ర భారతదేశంలో స్వరమే తప్ప వేరొకటి లేదనుకునేవారు. కాని నాలుగు దశాబ్దాల స్వాతంత్ర్య పాలనానంతరం రైతుకుటుంబాలు పడిన బాధలు, ఫలితంగా జరిగిన ఆత్మార్పణలు నేటి కుటిల రాజకీయనీతికి దర్పణం.

వ్యవసాయరంగంలో ప్రత్తి బహుపంటలలో ఒక శాఖమాత్రమే. ఇది వాణిజ్యపంట. కోస్తాప్రాంతంలో గుంటూరు, ప్రకాశం జిల్లాలలో నూతనంగా ప్రవేశించినది. పొగాకు పంట ఒడిదుడుకులకు విసిగి వేసారిన రైతులోకానికి 65-75 మధ్యలో ఆశాజనకంగా వుంది. యం.సి.యు-5 వచ్చినప్పుడు, పరదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్న పొడుగు పింజ పత్తిని తలదన్నే రకమును తెలుగురైతు పండిస్తున్నాడని ప్రశంసించబడింది. అంతేకాదు 1973కల్లా 250 కోట్ల విలువగల పొడుగు పింజ పత్తి దిగుమతి అవసరంలేకుండా పోయింది. మరుసంవత్సరం ఉత్పాదన అధికమై ఎగుమతులుసైతం చేయవలసి వచ్చింది. మూలబడ్డ కోయంబత్తూరు టెక్స్టైల్ మిల్సు పుంజుకొని డివిడెండ్లు పంచినాయి. కొత్త మిల్లులు వెలిసినాయి. గుంటూరు నుండి పేటవరకు గల రహదారికిరువైపుల 'లాంక్షైర్'లాంటి జౌళిపట్టణం వెలిసింది. అదేసమయంలో వరలక్ష్మి అనే సంకరజాతి పత్తి రావడంతో ఒకేఒక్క సంవత్సరంలోనే నాగార్జునసాగర్ ప్రాజెక్టు విలువనంతా ఒక్క గుంటూరురైతులవలననే రికవరీ అయిందని మెచ్చుకున్నారు. సున్నితమైన సువిన్‌పత్తి పండిస్తే ప్రపంచంలో ఏ రైతూ చేయలేని పనిని గుంటూరు రైతు సాధించాడని, పరాధీనత ఇక లేదని కొనియాడారు.

'ఆక్రందన'లోని రాజమ్మ, అంజయ్యలు రెండోదశకంలో ప్రత్తి వ్యవసాయానికి ఆశతో వచ్చిన రైతుకుటుంబం. అంతకుపూర్వం 'బెండ, వంగ, పెసర, జొన్నలాంటి పంటలు పండించేవారికి మొదటిసారిగా వాటికంటే ప్రత్తి మేలనిపించింది. ప్రత్తిపంటను చూసి తెల్ల బంగారమని మురిసిపోయారు. శ్రమైకజీవుల పంటల మెరుపుతో లాభించిన టెక్స్టైల్ మిల్లులవారు, పారిశ్రామికవేత్తలు, బ్యూరోక్రాట్సు రైతులమీద స్వీయస్వార్థపు దృష్టి సారించారు.

ఈ దశకంలోనే ప్రకాశం జిల్లా ఇంకొల్లు, అమ్మనబ్రోలుప్రాంత రైతాంగం విజృంభించి తమ గ్రామాలలోనే కాకుండా దూరప్రాంతాలలో కూడా బీడులు, చౌడులు దున్ని పత్తిని సేద్యంలోకి తెచ్చారు. భౌతికశ్రమతోపాటు ఒకదశకంపాటు పొదుపుచేసుకున్న సంపదనంతా కుమ్మరించి తెల్లబంగారాన్ని వృద్ధిచేయటానికి ఉరకలేశారు. అదేసమయంలో ఈ బంగారంనుండి బలం పుంజుకున్న వ్యాపార వర్గాలన్నీ తమ స్వార్థంతో ప్రత్తిరైతులకు శత్రువులుగా మారారు.

'ఆక్రందన' అంజయ్య, రాజమ్మలదిమాత్రమేకాదు, వ్యవసాయ రంగంలో తెల్లబంగారాన్ని సృష్టించిన యావత్ ఆంధ్రరైతులోకానిది. అందుకు కారకులెవరు? అదే గ్రామానికి చెంది, తమ గూటిలోనివారై వుండి, వ్యవసా

యోత్పత్తినుండి బయటపడ్డవారేనా? బరిగొడ్లు కాసి, పేడపిసికి, పాలమ్మి, పిసినారిగా పేరొందిన వెంకట్రామయ్యా? ట్రాక్టరు కొనగానే లౌకికం పెరిగిన బాపయ్యా? పంతులుపని సంపాదించుకొని వేరుగా జీవిస్తున్న రాజమ్మ అన్ననా? వడ్లబ్రోకరి చేస్తున్న శారదమ్మ భర్త హరిబాబా? సమిష్టికుటుంబంనుండి విడివడి బళ్లారి వ్యవసాయానికి వెళ్ళిన అంజయ్య సోదరుడా? ఆనవాయితీగా వచ్చే చిన్నకొడుకు ప్రేమకొద్దీ రామయ్యవెంబడి వెళ్ళిన తల్లిదా? నరసింహం, నాగేశ్వరరావు తిరుపతయ్య, పక్కవూరినుండి అగాతంగా వచ్చిన బాబుగాడిదా?

వీళ్లంతా వ్యవసాయాన్ని వదలగానే రైతులకంటే ఉన్నతులమనే భావనను పెంచుకున్నారు. అంజయ్యను 'ఏంరా' అని సంబోధించేదాకా ఎదిగారు. ట్రాక్టరుబాపయ్య లౌకికంగా రాబోయే నష్టాన్ని ఎరిగుండి అంజయ్యనుండి కౌలు గుంజుకోగలిగాడు. అంజయ్యనుండి ఏబదివేలు నగదు కట్నం, పదితులాల బంగారం పొందినా, కర్కశత్వాన్ని ప్రదర్శించగలిగాడు. సోదరుడు రామయ్య తన కౌలుడబ్బుకోసం అన్నచేత ఎద్దులను తెగనమ్మించాడు. బాబుగాడు మెరమెచ్చులు ప్రదర్శించి బోరాలు తొక్కించుకొని పత్తిని తన్నుకుపోగలిగాడు. యల్లారావులాంటివారు నమ్మబలికి పత్తి అమ్మించి, తనకున్న పోలీసు అండతో డబ్బులు తెచ్చుకోగలిగాడు. ప్రభుత్వోద్యోగి పక్షపాతం వహించి తనవారికే సహాయపడ్డాడు.

వీరంతా ఎవరోకాదు! వ్యవసాయ రంగంలోంచి వచ్చినవారే. వ్యవసాయాన్ని వదిలి, ఇతర వృత్తులను స్వీకరించి, ఆ వృత్తులలో ప్రకృతి ఆటుపోటులకు తావులేనందున, కొద్దో గొప్పో సంపాదించి వ్యసాయదారుని చిన్నచూపు చూస్తూ ఈసడించుకున్నారు. రాజమ్మ, శారదల మరణాలకు కారకులయ్యారు. ఆదినుండి చివరవరకు శ్రమలో భాగస్వాములై అండగా వున్నది పాలయ్య, ఆదాములు మాత్రమే.

యదార్థంలో బళ్ళారి ప్రాంతంలో పత్తి పండించటానికి వెళ్ళిన రైతులు కూడా ఆ దశకంలో నష్టాల ఊబిలో కూరుకుపోయారు. మకతాలు చెల్లించలేకపోతే వాళ్ళ పంటలను, పశువులను భూకామందులు జప్తుచేసుకున్నారు. ఆడవాళ్ళను బంధించారు. కట్టుబట్టలతో ఊళ్ళు విడిచి దిక్కులేనివాళ్ళుగా పారిపోయిరావలసి వచ్చింది. ఈ దోపిడిలో 'సేవే పరమావధి' అని బోర్డు తగిలించుకున్న పరపతి సహకార సంఘం, జిల్లా సహకార సంఘం, రైతు కట్టే పన్నులతోనే జీవిస్తున్న అమ్మనబ్రోలు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు, ప్రజల రక్షణకై నియమించబడిన పోలీసు అధికారి, సాంకేతిక జ్ఞానాన్ని, నాణ్యమైన క్రిమిసంహారక మందులను అందజేయవలసివున్న వ్యవసాయ శాఖోద్యోగుల అన్యాయాల పాత్ర ఎంతా? వీరేనా! రైతులు పండించిన తెల్లబంగారంతో టెక్స్‌టైల్ మిల్సు, జౌళిపరిశ్రమలు, వారిపై జీవించే వివిధ వ్యాపారశాఖలు, కోట్లకు పడగలెత్తారే... వారేమయ్యారు? 250 కోట్ల సరుకు దిగుమతి చేసుకునే స్థితి నుంచి ఎగుమతి చేయగల స్థాయికి పంటలను తెచ్చినప్పుడు ఆనందపడ్డ నాయకులంతా ఆపత్సమయంలో ఎలా కనుమరుగయ్యారు? వరలక్ష్మి సువిన్‌లాంటి పొడుగుపింజ పత్తులతో సంపన్నులైన బొంబాయి, అహ్మదాబాదు మిల్లులేంచేశాయి? ప్రపంచంలోనే తెలుగురైతులాంటి ప్రగతిశీల రైతులే లేరని పొగిడిన పాలకులెక్కడ? అర్తజనోద్ధారకులు రాడికల్సు కనుమరుగెందుకయ్యారు?

వ్యవసాయరంగపు తెరచాటు నేరాల్లో వీరందరి భాగమెంత? అనే ఆలోచనలను మొలకెత్తించిన 'ఆక్రందన' రచయిత మొలకలపల్లి కోటేశ్వరరావుగారు ప్రశంసనీయులు. ఈ నవల ఒక యదార్థగాథగా చరిత్రలో మిగిలిపోగలదు.

**-కోటపాటి మురహరిరావు**
అధ్యక్షుడు,
గ్రామాభ్యుదయ పరిశోధన సంస్థ
హైదరాబాద్

# 'ఆక్రందన' పై సమీక్షలు

సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన మొలకలవల్లి కోటేశ్వరరావు నవల 'ఆక్రందన'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ఆత్మహత్యలన్నీ హత్యలే!

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

మానవ సమాజానికి ప్రధాన అవసరాలలో ఒకటైన బట్టకు కావల్సిన 'ప్రత్తి'ని రైతాంగం ఎంత కష్టపడి, ఎన్ని ఒడుదుడుకుల్ని తట్టుకుని, ఎన్ని ఆశనిరాశల్ని నింపుకొని పండిస్తారో, ఆ సజీవ జీవన దృశ్యాల్ని అక్షరబద్ధీకరించిన మంచి ప్రయత్నం ఈ 'ఆక్రందన'.

తెల్లబంగారంగా పేరొందిన ప్రత్తిపంట, ఇబ్బడి ముబ్బడిగా లాభాలు చూపించి రైతాంగాన్ని తనవైపుకు త్రిప్పుకుని, పరాయి ప్రాంతాలకు (బళ్ళారి) సైతం పరుగులు తీయించిందంటే, వాణిజ్యపంటల నైజం అర్థం అవుతుంది. సమాజాన్ని 'డబ్బు' శాసించేస్థితిలో ఉన్నందువల్లనే భూమిని నమ్మిన రైతాంగం తమకు అవసరమైన తిండిగింజల్ని, కూరగాయల్ని పండించుకునే దగ్గరా లాభాలే చూశారు. డబ్బు ఎక్కడ ఎక్కువగా కదులుతుందో అక్కడకు మోసగాళ్ళూ, దగాకోర్లూ తప్పకవస్తారు.

అంజయ్య, మల్లారావు వంటి అమాయక రైతాంగకుటుంబాలు దగాకోరుతనానికి బజారుపాలు అవుతూనే ఉన్నారు. పంట చేతికొచ్చే వరకూ, ప్రకృతి కరుణకు నోచుకోక, పురుగులు పీక్కుతినగా మిగిలిన పంట 'బాబు'గాళ్లవంటి దగాకోరులు తింటే రైతుల గతేమిటి? రాజమ్మలు, శారదలూ చావు పరిష్కారంగా ఎంచి పురుగుమందుల్ని పుచ్చుకొని మరణిస్తే ఆ చావులుహత్యలేగదా? ఆత్మహత్యలన్నీ మూలంలోకెళ్లితే హత్యలే అవుతాయి!

రైతు జీవనంలో బాధామయ పరిస్థితులను హృదయానికి హత్తుకునేలా రాసిన రచయిత ప్రశంసనీయుడు.

-సజ్జా వెంకటేశ్వర్లు
వేటపాలెం

## ఆక్రందన ఆక్రందనే

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

ఆలస్యంగానైనా మన ప్రత్తిరైతుల కడగండ్లు అక్షరరూపంలో చతురలో రావడం ముదావహం. కాదేదీ కవితకనర్హం అన్నట్లుగా ప్రత్తి ఉల్లి, టొమాటో, మిరప, సూర్యకాంతి పంట ఏది అయితేనేం రైతును ముంచడానికి. రైతులో ఉండే అమాయకత్వం, అజ్ఞానం, ఆశ, దురాశ, అనవసర ప్రలోభం అన్నీ కలసి అతని శ్రమను వృధాగా మారుస్తున్నాయి. రైతులకందని విజ్ఞానఫలాలు, పంటలలోని అశాస్త్రీయత, ప్రకృతి అసమతుల్యత, వాణిజ్యపంటలు రైతును జూదరిగా మారుస్తున్నాయి. వ్యవసాయం జూదం అనని రైతు ఈనాడు ఆంధ్రదేశంలో లేడు. పదిఎకరాల ఆసామీకంటే రెండువేల జీతం ఉన్న అటెండర్ బాగా బ్రతుకుతున్నాడంటే అతిశయోక్తి కాదేమో.

రైతులను ఆదుకోవలసిన విజ్ఞానశాస్త్రం కొద్దిమంది చేతులలో వికృతిరూపాన్ని దాల్చి, కల్తీవిత్తనాలు, పురుగుమందులు, నాసిఎరువులతో రైతుకుటుంబాలను ఏవిధంగా బలిగొంటున్నాయో చక్కగా వివరించారు.

రైతు కుటుంబాలలో మధ్యతరగతి

కవర్‌ఫోటో: వికీహండా

మహిళల వేదనకు ప్రతిరూపాలుగా రాజమ్మ, శారద, అంజయ్య తల్లి, నోరున్న వాడిదే రాజ్యం అని నిరూపించిన డి.ఎస్పీ, శీనయ్యల పాత్రలు సజీవరూపాలు. వెంకట్రామయ్య, తిరుపతయ్య, సత్యమూర్తి పాత్రలు గ్రామాలలో ఉండే వ్యాపారజలగలు, ప్రకాశం, బాబూరావు వంటి పరాన్నజీవుల పాత్ర చిత్రీకరణ అతిసహజంగా ఉంది. పురుగుమందులు రైతుల ఆరోగ్యాన్ని కూడా ఏవిధంగా దహిస్తున్నాయో చెప్తూ రాజకీయ వాతావరణ జోక్యం గురించి కూడా వ్రాసి ఉంటే ఇంకా బాగుండేది. శాస్త్రీయ వ్యవసాయం, పంటమార్పిడులను గురించి వ్రాస్తే పరిష్కారం చూపినట్లుండేది. భాష, శైలి, వాతావరణం అన్నీ ఎంతో సహజంగా ఉండి సజీవంగా ఆక్రందిస్తున్నట్లుగా చెవులలో హోరారుమన్పించింది నవల. కాని బధిర పాలితులకు వినబడని ఆక్రందన అది.

-సి. వెంకటనరసమ్మ
హుసేన్‌పురం

## నిజంగా ఆక్రందనే...

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

వర్తమాన పరిస్థితులను సామాజిక స్పృహతో చిత్రించి ప్రయోగాత్మక నవలలను అందించటంలో ప్రముఖపాత్ర వహిస్తోంది చతుర. ఆ పంథాలో వెలువడిన మరో ఉత్తమనవల 'ఆక్రందన'.

ప్రకాశం జిల్లా ప్రత్తిరైతుల సాధకబాధకాలు కళ్లకు కట్టినట్లుగా వర్ణించి హృదయాలను కదిలించివేసే సన్నివేశాలను సహజంగా చిత్రించారు రచయిత. పగబట్టిన ప్రకృతి, కట్టుకట్టిన కల్తీమందుల యజమానులు, అవకాశంకోసం కాచుక్కూచునే వడ్డీ వ్యాపారులు వీరందరితో విసిగివేసారిన రైతు అటు బ్రతుకుతో సమరం, ఇటు ప్రత్తిసేద్యం చేయలేక ఆత్మహత్యలు చేసుకునే దృశ్యాలు సహజంగా వర్ణించారు.

ఈ నవలలో అంజయ్య పాత్ర చాలా ఉదాత్తంగా చిత్రించారు. పరిస్థితులు ఎంత విషమంగా తయారయినప్పటికీ మొక్కవోని ధైర్యంతో అలాగే నిలబడి చివరికి మానసిక నిస్పృహలో భార్యను కొట్టటం... అదే అవకాశంగా భావించి అత్తా, ఆడబిడ్డాలు ఎగతాళి చేయటం, వాటిని తట్టుకోలేక, నమ్ముకున్న ప్రత్తి వమ్ముచేసిందన్న బెంగతో అంజయ్య భార్య పురుగుమందు తాగి చనిపోవటం, అనవసరంగా అపవాదు పడ్తుందన్న ఆదుర్దాలో ఆడబిడ్డ కూడా పురుగుమందు తాగి చనిపోవటం హృదయవిదారకంగా వున్నాయి.

'పక్కవాడి ఆపదే మనకు సంపద, వాడి అవసరం మనకు వ్యాపారం' అనే వ్యాపార సూత్రాలను తూ.చ. తప్పక పాటిస్తూ 'పరోపకారార్థమిదం శరీరమ్' అనే సామాజిక నీతిని విస్మరించి పక్కవాడి అవసరంతో ఆడుకునేవిధంగా ఉన్న ఎరువుల కొట్లయజమానుల కుటిలత్వాన్ని సహజంగా చిత్రించారు!

మాండలిక, వ్యావసాయిక పారిభాషిక పదాలతో వర్తమాన సమాజానికి దర్పణం పట్టేవాసన వున్న ఇంత మంచి నవలను అందించిన 'చతుర'కు, రచయిత శ్రీ మొలకలపల్లి కోటేశ్వరరావుకు కృతజ్ఞతలు.

-టి.ఎల్.ఎన్.మూర్తి
సిరిగిందలపాడు

## వ్యధాభరితగాథల వాస్తవ చిత్రణ

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

దళారుల దగాకోరుతనం, వ్యాపారుల దోపిడీ మనస్తత్వం, నకిలీమందుల కరాళనృత్యం వెరసి ప్రత్తి రైతు జీవనవిధానాన్ని ఏవిధంగా ఛిద్రం చేస్తున్నదీ కళ్లకు కట్టినట్లు వివరించారు మొలకలపల్లిగారు. ఏటా సంభవిస్తున్న ప్రకృతి వైపరీత్యాల మాదిరే, ఆంధ్రదేశానికి

ఏటా ప్రత్తిరైతుల ఆత్మహత్యలు రివాజుగా మారటం వెనుక ఉన్న వ్యధాభరిత యదార్థ పరిస్థితుల్ని గుంటూరు, ప్రకాశం జిల్లాల నేపథ్యంలో కాగితానికెక్కించటంలో రచయిత కృతకృత్యులయ్యారు. ఎదిగొచ్చిన బిడ్డ చదువుకు డబ్బు ఖర్చుపెట్టలేని దుస్థితిని, తోడబుట్టినదానిని అత్తింటికి పంపించలేని నిస్సహాయతను, అన్నివిధాలా తన కండదండలుగా ఉంటూ తన కష్టాల్లో పాలుపంచుకుంటున్నా ఇల్లాలి మాటను వినకపోవటంవల్ల ఎదురైన విపరిణామాలను ఎదుర్కొనేందుకు అంజయ్య జరిపిన జీవనపోరాటంలో తుదకు అతను ఓటమి పాలవటం వాస్తవ పరిస్థితులను ప్రతిబింబించేవిధంగా ఉన్నప్పటికీ సామాన్య పాఠకుడు కోరుకున్న విధంగా ముగింపు లేకపోవటం మాత్రం కాస్తంత నిరాశ కలిగించింది. అడుగడుగునా వంచనకు గురైన ప్రత్తిరైతు ఎదురుతిరిగి ప్రతీకారం తీర్చుకునే విధంగా ముగింపునిస్తే బాగుండేది. ఏదిఏమైనా కథాగమనం కోసం 'మసాలా' దట్టించే కొందరు కమర్షియల్ రచయితలమాదిరి పోకుండా ప్రత్తిరైతు 'ఆక్రందన' వినిపించిన రచయిత అభినందనీయులు.

**-పి.వి.హెచ్.పి. కిషోర్**
సికింద్రాబాద్

## గుండెల్ని పిండే నిజాలు

***(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)***

**జ**నానికి అన్నం పెట్టేవాడు రైతన్న. కాని ఆ అన్నదాతకే అన్నం దొరకడం గగనమైపోతున్న రోజులివి.

కొన్నేళ్లకిందట గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో ప్రత్తిరైతుల ఆత్మహత్యల గురించి పత్రికల్లో చదివాం. వాళ్లలా చేయడానికి దారితీసిన పరిస్థితుల గురించి, వారి జీవితాల్లోని కష్టాలూ, కడగండ్ల గురించీ కళ్లకు కట్టినట్టు చిత్రించారు మొలకలపల్లి కోటేశ్వరరావుగారు 'ఆక్రందన' నవలలో.

బంగారంలాంటి పంటని పండించి లాభాలు తీయాలన్న ఉత్సాహంతో వేలకి వేలుపోసి దండగలు కొనితెచ్చుకున్న సగటురైతు అంజయ్య పాత్ర మనసుని కదిలించివేసింది. చుట్టూ అప్పులు అయినవాళ్ల చీదరింపులు, తిండిగింజలు దొరకని పరిస్థితులు చదువుతుంటే ఆనాటి రైతుల అవస్థలు కళ్లముందు నిలిచాయి. గుట్టుగా, పరువుగా బతికిన రైతులు అలాంటి పరిస్థితుల్లో ఇంకేం చేయగలరు అనిపించింది.

నీటికరువుతో, అప్పుల బరువుతో సతమతమవుతూనే ఏడాది పొడుగునా రెక్కల కష్టాలు ధారపోసి బంగారం పండిస్తున్నాడు రైతన్న. అలాంటి రైతులకి దక్కుతున్నదేమిటి? వ్యాపారులు, దళారులు, నకిలీమందుల కంపెనీలు కలిసి వాళ్లని నిలువుదోపిడీ చేస్తున్నారు. మామూళ్లు అందుకున్న అధికారులు నిమ్మకి నీరెత్తినట్టు ఉంటున్నారు. ముతాతగాదాలకే సమయంచాలని ప్రభుత్వం వీటిని చూస్తూకూడా నిద్రపోతోంది. ఇలాంటి కథలు చదువుతుంటే ఈ సమాజం ఎటుపోతుందో, ఈ పరిస్థితి ఎప్పటికైనా మారుతుందా అనే అనుమానాలు గుండెని పిండేస్తాయి.

అయితే విచక్షణారహితంగా పురుగుమందులు, ఎరువుల వాడకం కూడా అనేక ఘోరాలకి కారణమన్న ఆలోచన నిజమని ఋజువుచేస్తుందీ ఉదంతంవల్ల.

ఇలా వాణిజ్యపంటల విషవలయంలో ఎన్ని కుటుంబాలు అయిన వాళ్లని పోగొట్టుకుని అల్లాడుతున్నాయో తలుచుకుంటే కడుపు తరుక్కుపోతుంది.

నిజానికిది కథకాదు. రైతుల బతుకులకి అద్దం పట్టిన వాస్తవచిత్రం. దీన్ని అతివాస్తవికంగా ప్రాంతీయ మాండలికంగా అందించిన రచయిత అభినందనీయులు.

**-ఎ. ఉషారాణి,**
హైదరాబాద్




# సిరిసిరి ముత్యాలు

★ మృత్యు తిమిరం సాయంసంధ్య వంటిది. చనిపోతున్న వానికి అన్ని వస్తువులు అతిసుందరంగా కనిపిస్తాయి.

— రిష్టర్

★ ప్రేమ యుద్ధంలాంటిది. ప్రారంభించడం తేలికే. ముగింపే కష్టం.

— మెన్‌కెన్

★ ప్రేమికుని ఆయుధం ఆశ. దానితోనే అతడు ముందడుగు వేస్తాడు. నిస్పృహ కలిగించే ఆలోచనలను ఆశతోనే ఖండిస్తాడు.

— షేక్స్‌పియర్

★ ప్రేమించిన హృదయం నిరంకుశంగా మారుతుంది. అది హేతువును వమ్ముచేస్తుంది, విచక్షణాజ్ఞానాన్ని హరింపజేస్తుంది; మనిషిని పిచ్చివాడిని చేస్తుంది.

— జాన్‌ఫోర్డ్

★ నువ్వు ఒకరిని జీవితాంతం ప్రేమించగలనని చెప్పడం, ఒక కొవ్వొత్తి నీవున్నంత కాలం వెలుగుతుందని చెప్పడంలాంటిది.

— టాల్‌స్టాయ్

★ నా ఈ విలువైన కాలాన్ని వెధవ డబ్బు సంపాదనకోసం వ్యర్థపరచలేను.

— అగస్టిన్

★ డబ్బు విషయం వచ్చేసరికి అందరిదీ ఒకే మతం.

★ ధనాన్ని సేకరిస్తూ అనుభవించలేనివాడు బంగారం మోస్తూ ఆకులు, అలములు తినే గాడిదతో సమానం.

— బర్టన్

★ సంపన్న మహిళలకు, సంపన్న దేశాలకు చెప్పుకోదగ్గ చరిత్ర ఉండదు.

— జార్జి ఇలియట్

★ ప్రపంచంలోని సంపదనంతా ఇచ్చైనాసరే ఒక నిజాయితీపరుని ఓటు ఖరీదుచేయలేం.

—సెయింట్ గ్రెగరీ

★ మనం భాగ్యవంతులమైనప్పుడు బాధపడేవారికి సలహాలివ్వడం తేలిక.

— ఎస్కైలస్

★ **మనిషి ఎప్పుడూ** తనకున్న సంపదతో తృప్తిపడాలి. కానీ తనకున్న విజ్ఞానంతో తృప్తిపడకూడదు.

★ కష్టపడకుండా డబ్బు సంపాదించాలనుకోవడం ఒక రకమైన మానసిక వ్యాధి.

— జిడ్డు కృష్ణమూర్తి

★ పొగడ్తలు, ప్రశంసలు రేపటి విజయానికి ప్రతిబంధకాలు.

— ఫ్రాంక్లిన్

★ వలపు ఒంటరితనాన్ని కోరుతుంది.

— శూద్ర మహాకవి

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# చతుర

సంపుటి: 17 సంచిక: 10

నవంబర్ 1994


ఒకరూ ఇద్దరూకాదు, ఏకంగా అయిదుగురు కాస్త పేరున్న రచయితల్నే కిడ్నాప్ చేసేశారు తీవ్రవాదులు.

వారిలో ఒకరు తప్ప మిగతా నలుగురూ ఎవరికీ హానిచేయని, ఏ రాజకీయాభిప్రాయాలూ లేని కాలక్షేపంటైపు రచయితలే. జాలీగా కాలంగడిపే నిక్షేపరాయుళ్ళే.

**మరి అలాంటివారిని ఎందుకు కిడ్నాప్ చేశారా తీవ్రవాదులు?**

పైగా వారిని బందీలుగా వుంచుకుని అడవుల్లో తిప్పుతూకూడా వారి విడుదలకోసం ప్రభుత్వాన్ని ఎలాంటి కోరికలూ కోరలేదు.

ఇందులోని చిదంబర రహస్యం ఏమిటి? కారణాలు తెలియక బుర్రలు పగలగొట్టుకున్న మంత్రులూ, పోలీసులూ ఏంచేశారు?

ఖంగారుపడిన ఆయా రచయితల భార్యలు తమ భర్తలకోసం ఏంచేశారు?



పులిపాక శ్రీరామచంద్రమూర్తి రచన

'అజ్ఞాతవాసం'

ఈనెల 'చతుర' సమగ్రనవల.

సన్నగా వానజల్లు పడుతోంది.

ఆటో ట్రాఫిక్‌ని తప్పించుకుంటూ, వంపులు తిరుగుతూ మెల్లిగా వెళ్తోంది.

వివేకానంద వెనక్కి వెళ్తున్న షాపుల్నీ, మనుషుల్నీ, వాహనాలని చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. భార్య సుమతి రియర్‌మిర్రర్‌లోంచి తననే గమనిస్తున్న ఆటోవాలా చూపులనించి తప్పించుకునేందుకు ప్రయత్నిస్తోంది.

"ఈ సదస్సుకు ఎంతమంది వస్తారు?"

"ఓ వందలోపు''

"ఏవేం చర్చిస్తారు?"

వివేకానంద జవాబు చెప్పకుండా నవ్వాడు.

సుమతి మాట్లాడకుండా బైటికి చూడసాగింది. వరసగా వస్త్రదుకాణాలు గబగబా వెనక్కి వెళ్ళాయి. ఆమె అప్రయత్నంగా తను కట్టుకున్న చీరెవైపు చూసుకుంది.

"ఈ చీరె ఎలా ఉంది?"

"చాలా బాగుంది''

"ఆ షాపులోనే తీసుకున్నాను. ఇదే మొదటిసారి కట్టుకోవడం" అంది వెనక్కి మాయమవుతున్న ఓ షాపును చూపుతూ!

"అహc...''

"నేనేచీరె కట్టుకున్నా బాగుందో, లేదో చెప్పరు. వంట రుచిగా ఉందో లేదో చెప్పరు. ఎప్పుడూ ఊహాప్రపంచమేనా?"

"వాస్తవంలోనే బతుకుతుంటాను సుమతీ... అయితే కొన్నికొన్ని అంశాలు నాకు అత్యల్ప విషయాలుగా కనిపిస్తుంటాయ్''

"నాకు కుట్లూ, అల్లికలూ ఇష్టం. వాటిమీద మీరేం ఆసక్తి చూపించరు. బొన్సాయ్ చెట్లు పెంచడం ఇష్టం... మీకే ఇంట్రస్టూ ఉండదు. రంగు రంగుల శాలువాలు, గాజులు ఇష్టం... మీరసలు పట్టించుకోరు''

"నిజమేగానీ, నేనెప్పుడూ నీ ఇష్టాలకు అడ్డు చెప్పలేదుగదా!"

"లేదు... కాని ఆసక్తి చూపించరు. అదే నాక్కోపం" అంది సుమతి మూతిబిగించి చిరుకోపం ప్రదర్శిస్తూ.

"ఇహనుంచి బోళ్ళంత ఆసక్తి చూపిస్తాను, ప్రామిస్''

"ఉట్టి కబుర్లే. నేను చూడండి... మీ రచనలమీద, సాహిత్యంమీద ఎంత ఆసక్తి చూపిస్తానో''

అవును నిజమే. సుమతికి సంగీత సాహిత్యాలపట్ల చాలా మక్కువ ఉంది. పుస్తకాలు బాగా చదువుతుంది ముఖ్యంగా భర్త రాసేవి. సాహితీసభలు సమావేశాలకు వెళ్తుంది. భర్తతో సాహితీ చర్చలు జరుపుతుంది.

"థాంక్స్..." అన్నాడు వివేకానంద.

"ఎంత ఆసక్తి లేకపోతే ఇప్పుడీ సాహిత్యసభకి వస్తాను చెప్పండి''

"థాంక్స్... థాంక్స్..."

ఆటో ఆగింది.

వివేకానందని, సుమతిని దూరంనించే చూసి 'హలో' అన్నాడు సూర్యనారాయణ దగ్గరికి వస్తూ.

"హలో..." అన్నాడు వివేకానంద.

"ఏమ్మా... బాగున్నావా?"

"సుమతి తలూపి నమస్తే చెప్పింది.

"పదండి... సభ ప్రారంభం కాబోతోంది''

ఇద్దరూ వెళ్ళి కుర్చీల్లో కూర్చున్నారు. అప్పటికే వేదికమీద అధ్యక్షుడు, వక్తలు కూర్చుని వున్నారు. ఒకవైపు వీడియో కెమేరా భుజంమీద పెట్టుకుని ఒకతను సిద్ధంగా ఉన్నాడు. అతనికి అటూ ఇటూ ఇద్దరు ఫ్లాష్‌లైట్లు పట్టుకుని ఉన్నారు.

అధ్యక్షుడు కుర్చీలోంచి లేచి వీడియో కెమేరా తనవైపు తిరిగేదాకా ఆగి గొంతు సవరించుకుని అన్నాడు.

"ఈ సదస్సుకు హాజరైన రచయితలకు, రచయిత్రులకు నమస్కారం, స్వాగతం. మా ఆహ్వానం మన్నించి మీరందరూ వచ్చినందుకు నాకెంతో ఆనందంగా ఉంది.




సాహిత్యాన్ని స్థూలంగా సమీక్షించడమే ఈ సదస్సు ఉద్దేశం. సాహిత్యానికి సంబంధించిన వివిధ అంశాలమీద మీ అభిప్రాయాలు ప్రకటించాలి. ఇది ఇప్పటి సాహిత్యంలో మంచిచెడుల్ని పరిశీలించడానికే కాకుండా మరింత మంచి సాహిత్యం సృష్టించడానికి, అందించడానికి మనమేం చెయ్యాలో తెలుసుకోవడానికి కూడా ఉపయోగపడుతుంది. కార్యక్రమం ప్రారంభించేముందు వక్తలు ప్రసంగిస్తారు..."

వేదికమీద కూర్చున్న వక్తలు ఇద్దరూ ఒకరి తర్వాత ఒకరు క్లుప్తంగా ప్రసంగించారు. వాళ్ళిద్దరు కూడా రచయితలే. వాళ్ళలో ఒకాయన సాహిత్యం బ్రహ్మాండంగా ఉందని అంటే, రెండో ఆయన ఏం బాగాలేదు, దరిద్రంగా తయారైందని అన్నాడు.

సభాధ్యక్షుడు మళ్ళీ లేచాడు.

"అసలు కార్యక్రమం ఇప్పుడు ప్రారంభమవుతుంది. ఈ అభిప్రాయ సేకరణ పర్వాన్ని మిత్రుడు రాంప్రసాద్ నిర్వహిస్తారు..."

రాంప్రసాద్ కుర్చీలోంచి లేస్తూ వీడియో కెమేరావైపు ఓరగా చూశాడు. అది తనవైపే ఉండటం గమనించి సంతృప్తిగా నవ్వుకుని మొదలుపెట్టాడు.

"ఈ సదస్సులో మొట్టమొదటి చర్చనీయాంశం రచనావస్తువు... ఇదెలా ఉండాలో మీ అభిప్రాయాలు చెప్పండి"

"గ్రామీణ జీవితానికి సంబంధించినదై ఉండాలి. భారతదేశ సంస్కృతికి, సంప్రదాయాలకి, వారసత్వానికి, ఆచారాలకు, విశ్వాసాలకు ప్రతీకలు పల్లెసీమలు. అందువల్ల రచనా వస్తువు ఎప్పుడూ గ్రామీణ ప్రాంతాలకు సంబంధించిందే అయ్యుండాలి" అన్నాడు ఓ రచయిత గంభీరంగా.

"కాదు... దేశ ప్రజలందరూ గ్రామాల్లోనే ఉండటంలేదు. పట్టణాలు, నగరాల్లో కూడా ఉంటున్నారు. రచయిత ఎక్కడ నివసిస్తుంటే అక్కడికి సంబంధించిన వస్తువే తీసుకోవాలి"

"అసలు వస్తువంటే సబ్జెక్ట్... రచనకి ఏ వస్తువునైనా స్వీకరించవచ్చు. అందులో తప్పేంలేదు. దాన్ని మలచడంలో సరైన, నిర్దిష్టమైన శైలి, శిల్పం ఉన్నాయా లేదా అనేదే ప్రశ్న..."

"కాదు... రచనకి స్వీకరించిన వస్తువు బహుజన హితాయ, బహుజన సుఖాయ అనే సూత్రం ప్రకారం ఉండాలి. అశ్లీలకరమైన అసభ్యకరమైన బూతుమయమైన వస్తువును తీసుకుని, అద్భుతంగా రాయవచ్చుగాని అది తప్పు. సామాజిక ద్రోహం... సాహితీ ద్రోహం..." అన్నాడో సీనియర్ రచయిత ఉద్వేగభరిత స్వరంతో.

"శృంగారపరమైన వస్తువును స్వీకరించడంలో తప్పేముంది?" అన్నాడు మరోవ్యక్తి.

అతని పేరు పరబ్రహ్మం. అతను మంచి రచయితేగాని అప్పుడప్పుడు మెదడులో ఏదో తొలిచి సెక్స్ కథలూ వగైరా రాస్తుంటాడు. అలా రాయకపోతే మిగతా రచయితలకంటె తను వెనుకబడిపోతానని ఎందువల్లనో భయపడుతుంటాడు. రాత్రివేళ నక్షత్రమయ ఆకాశంకిందో, గదిలో ఒంటరిగా ఉన్నప్పుడో అట్టడుగు పొరల్లో దాచుకున్న అంతరాత్మని బైటికి తీసి తనని తనే తిట్టుకుంటూ ఉంటాడు. రచయత అనేవాడు ప్రలోభాలకి లొంగరాదని, తప్పుదారిలో వెళ్ళకూడదని, సమాజానికి, ఆత్మకు ద్రోహంచేసుకోకూడదని దృఢంగా అనుకుంటూ ఉంటాడు. కాని ఆ కీర్తికండూతి బలహీనతమాత్రం అతన్ని వదిలిపెట్టడంలేదు.

"తప్పు... మీ అభిప్రాయం తప్పు" అన్నాడు మరో రచయిత గట్టిగా.

"రచనా వస్తువు ఏ ప్రాంతానికి, ఏ విషయానికి సంబంధించిందైనా కావచ్చు. శిల్పం, శైలి ముఖ్యం. అయితే బూతుమయమైన వస్తువును స్వీకరించడంమాత్రం సమాజానికి హానికరం"

"ఇది బాగుంది" అన్నాడు కన్వీనర్

ఆనందంగా, ముక్తాయింపుగా. వెంటనే వేరే అంశం ప్రస్తావించకపోతే అందరూ అరుస్తార నే భయంతో "ఇప్పుడు సాహితీశిల్పం, శైలి గురించి చర్చిద్దాం' అని ప్రకటించాడు.

"శైలి అనేదేంలేదు ప్రత్యేకంగా. ఎలాగైనా చేయొచ్చు''

"అవును''

"అసలీ రెండు అంశాలపై చర్చ అనవ సరం" అన్నాడు నాగార్జున. అతనికి ప్రాచీనసా హిత్యం అంటే ఇష్టం. ముఖ్యంగా చారిత్రక సంఘటనలు. అయితే వాటిని వాస్తవరూ పంలో స్వీకరించకుండా చిలవలు పలవలు చేర్చి కల్పితగాథల్లా రాస్తాడు. ఆర్యులు, ద్రవి డుల గురించి అతను రాసినవేవీ చారిత్రకమై నవి కాదు. పైగా చారిత్రక వ్యక్తుల గురించి అస్తవ్యస్తమైన అంశాలతో నవలలు రాశాడు.

"చలం, కుటుంబరావు, రావిశాస్త్రి... వాళ్ళ కంటూ ప్రత్యేకమైన శైలీవిన్యాసముంది. రచ నకి శైలి ముఖ్యం. దాన్ని రచయిత మరువకూ డదు. తృణీకరించకూడదు''

"బాగుంది'' అన్నాడు కన్వీనర్.

"ఇక శిల్పం అంటే పాత్రలు, పాత్రోచిత సంభాషణలు... సాహితీపరమైన సామాజిక వాతావరణం సృష్టించడం... అసలు వస్తువు, శైలి, శిల్పం మధ్య అవినాభావ సంబంధం ఉంది. దీన్ని రచయితలు గుర్తించాలి'' అన్నా డో సీనియర్ రచయిత. దాంతో రచయితలంద రూ ఏకీభవించారు.

తర్వాత చర్చ మాండలికాలపై జరిగింది. మాండలికంలోనే రాయాలని కొందరు, అక్కర్లేదు... ప్రామాణికమైన పత్రికాభాషలోనే రాయాలని కొందరు, సంభాషణలు మాండలి కంలో సాగినా ఇతర వ్యాఖ్యలు వర్ణనలు ప్రామాణికభాషలోనే ఉండాలని మరికొందరు చెప్పారు.

అంతలో రచయితలకు టీ, బిస్కెట్లు వచ్చాయి. కాసేపు సాహిత్యచర్చను పక్కన పెట్టి వాటిమీద పడ్డారు. వివేకానంద తనకి చ్చిన సాహితీ ప్రశ్నాపత్రం పూర్తిచేసి హాలు ముందున్న కుర్రాడికి ఇచ్చొచ్చాడు.

తర్వాత చర్చనీయాంశం పత్రికలు సంపాదకులు. రాంప్రసాద్ మరిచిపోకుండా వీడియో కెమెరావైపు చూస్తూ ఆ విషయం ప్రకటించాడు.

"పత్రికలు వ్యాపారధోరణిలో నడుస్తు న్నాయ్. అందుకే మంచి సాహిత్యం రావ డంలేదు'' అన్నాడు కిశోర్‌కుమార్ నీరసంగా. అతను మంచి అభ్యుదయవాది. ఎన్నో కథలు, నవలలు రాశాడుకాని వాటిలో పాత్రపోషణ, సంభాషణలు, సాహితీ వాతావరణం కృత కంగా ఉంటుంది. రచయితగా తనే జోక్యం చేసుకుని కథ నడిపిస్తూ ఉంటాడు. పాత్రల మనస్తత్వం, అంతస్సంఘర్షణలు ఎక్కువగా ఉండవు. అతని కథలకు చాలాసార్లు పత్రికలవా ళ్ళు బహుమతులు ఇచ్చారు.

"సంపాదకులు కేవలం సర్క్యులేషన్ పెంచుకోవడమే ధ్యేయంగా పనిచేస్తున్నారు. ఇలాంటి పత్రికలూ, సంపాదకులు ఉన్నంత కాలం మంచి సాహిత్యం చస్తే రాదు''

"పత్రికల ధోరణి, సంపాదకుల వైఖరి మారాలి''

"మంచి కథో, నవలో పంపిస్తే మూడేళ్ళకి కూడా వాటి అతీ గతీ తెలియడంలేదు. చెత్త రచనలు పంపిస్తే వెంటనే అచ్చేస్తున్నారు. అసలీ పద్ధతిమూలానే సాహిత్యం నాశనమైపో యింది''

"వాళ్ళు చెత్తే వేస్తున్నారు కాబట్టి పంపిస్తు న్నాం... తప్పేముంది?"

"అవును... సంపాదకుల ధోరణీ, సాహితీ అవగాహనా పెరిగితే మంచివే పంపిస్తాం"

"వాళ్ళ దృష్టి డబ్బుమీదే ఉంది కాబట్టి మేం కూడా రచనలద్వారా డబ్బు సంపా దించుకోవాలనే చూస్తున్నాం"

వివేకానంద లేచాడు.

"పత్రికల్ని విమర్శించడంవల్ల లాభమేంటే




దు. సంపాదకుడు సస్పెన్స్, క్రైం, థ్రిల్, హింస, శృంగారం నిండిన రచనల్నే పంపమని అడగొచ్చు. కాని పంపడమా, పంపకపోవడమా అనేది రచయిత చేతుల్లోనే ఉంది. ఈ విషయంలో రచయిత రాజీపడకుండా రాయాలి. ఇప్పటికీ మంచి రచనలే వేసే పత్రికలు చాలా ఉన్నాయి. వాటికే పంపుదాం, ప్రచురణ ఆలస్యమైనా ఫరవాలేదు అనుకోవాలి. రచయిత సాహితీపరమైన విలువలు వదిలేసి డబ్బుకోసం పేరుకోసం కక్కుర్తిపడితే నష్టం సమాజానికి. దీన్ని అందరూ గుర్తించాలి''

కొందరు చప్పట్లు కొట్టారు. మరికొందరు హియర్ హియర్ అన్నారు. ఇంకొందరు మూతి బిగించి జేబుగుడ్డమాటున తమ అసహనం దాచుకున్నారు.

కన్వీనర్ ఇదే మంచి అవకాశమనుకుని మైకుముందుకు వచ్చి 'సమాజం-సాహిత్యం' అని ప్రకటించాడు. దాంతో ఓ సీనియర్ రచయిత మహోత్సాహంగా లేచాడు.

"అసలు సమాజం అంటూ ఏమీలేదు. మనం చూస్తోంది కొందరు మనుషుల వికృత స్వరూపం. నేనెప్పుడో ఈ నిర్ణయానికి వచ్చాను. అందువల్ల సాహిత్యంతో సమాజాన్ని ఉద్ధరించాలనుకోవడం కేవలం భ్రమ మాత్రమే''

ఆయన మొదట్లో మంచి కథలు, నవలలు రాసి వాణిజ్యపత్రికలు రంగంలోకి దిగగానే ఆ బాణీ, పంథా మానేసి సస్పెన్స్, సెక్స్, హింస వైపు వెళ్ళిపోయాడు వెనక్కి తిరిగి చూసుకోకుండా. దాంతో ఆయనకి సమాజం వికృతమైన మనుషుల స్వరూపంలా కనిపించడం ప్రారంభించింది.

"భేష్... భేష్..." అన్నాడు గురుదేవ్ అనే రచయిత. అతని రచనల్లో ఎక్కువభాగం నాటకాలే. వాటి ఇతివృత్తాలు అభ్యుదయకరమైనవే అయినా ప్రయోగాత్మక నాటకాలంటే భయం. ప్రజలు వాటిని ఆదరించరేమో, అనవసరంగా ప్రయాసపడాల్సి వస్తుందేమోనని అనుకుంటూ ఉంటాడు. అతని రచనల్లో మనుషులమీద కసి, కోపం ఉన్నట్టు కనిపిస్తుంది.

"సాహిత్యం సమాజంనుంచే వస్తుంది. రచనలకు ఆధారం, ప్రాతిపదిక, ప్రాణవాయువు సమాజమే. అందువల్ల సమాజం లేదనడం, సమాజాన్ని వికృతమైన మానవుల స్వరూపంగా భావించడం తగదు. ఇది ఆత్మద్రోహం" అన్నాడో కుర్ర రచయిత గట్టిగా. అంతే, చప్పట్లు మోగాయి హాల్లో.

వివేకానంద అతనివైపు అభినందన పూర్వకంగా చూశాడు. తర్వాత ప్రస్తుత సాహిత్యం ఎలా ఉంది? అనే అంశంమీద చర్చ జరిగింది. బాగానే ఉందని, బాగా లేదని, పరమ దరిద్రంగా ఉందని ఇక దీన్ని బాగుచేయడం ఎవరివల్లా కాదని ఇలా రచయితలు రకరకాల అభిప్రాయాలు ప్రకటించారు.

చివరికి వివేకానంద ఇలా అన్నాడు.

"సాహిత్యం దారితప్పిన మాట నిజమే. కొందరు రచయితల ధోరణి, ఆలోచనావిధానంలో మార్పు వచ్చినమాట వాస్తవమే. అయితే అసలు మంచి సాహిత్యమే రావడంలేదనడం అన్యాయం, అవాస్తవం. మంచి సాహిత్యం వస్తూనేవుంది. దాన్ని చదివి జీర్ణించుకునేవాళ్ళు ఉన్నారు. అందువల్ల రచయితలకి నిరాశానిస్పృహలు అనవసరం. మనం మంచి సాహిత్యమే సృష్టిద్దాం. సమాజంలో మంచితనాన్ని, మానవత్వాన్ని పెంచుదాం. ఈ తిమ్మిరికథలూ, థ్రిల్లింగ్ నవలలూ ఎక్కువకాలం ఉండవు. నేను మీకా హామీ ఇస్తున్నాను. సాహిత్యానికి మంచికాలం వస్తుంది. మంచి సాహితీసృష్టి జరుగుతుందని ఎవరికి వాళ్ళం అలా గాలికి వదిలేసి కూర్చుంటే లాభంలేదు. మనం ముందుకు నడవాలి. దారి చూపించాలి. సృజనాత్మక శక్తి పెంచుకుని సాహిత్యాన్ని పునరుజ్జీవింపచేయాలి... ఏమంటారు?

మళ్ళీ చప్పట్లు మోగాయి.

తర్వాత సాహిత్యప్రయోజనం గురించి

చర్చ జరిగింది కొద్దిసేపు. సాహిత్యంవల్ల ప్రయోజనం లేదని కొందరు, ధనార్జనకోసం ఉపయోగించుకోవచ్చునని కొందరు, సాహిత్యం ఏదో కొద్దిమంది సహృదయుల ఘోషేనని మరికొందరు... ఇలా రకరకాలుగా మాట్లాడారు. వివేకానంద వివరంగా చెప్ప బోయి మానేశాడు.

ఆ చర్చ ముగియగానే కన్వీనర్ రాంప్ర సాద్ లేచాడు, వీడియోకెమేరావైపు చూస్తూ అన్నాడు.

"సాహిత్యానికి సంబంధించిన, అన్ని అంశా ల్ని సమీక్షించాం. మొత్తంమీద తేలిందేమి టంటే సాహిత్యాన్ని, ముఖ్యంగా మంచి సాహిత్యాన్ని బతికించుకోవలసింది రచయిత లే. ఈ సామాజిక బాధ్యత, కర్తవ్యం మనమీద ఉన్నాయి. మనందరం దీనికి కట్టుబడి ఉందాం"

దాంతో రచయితల సమావేశం పూర్త యింది. అందరూ లేచారు.



వివేకానంద భార్యతో కలిసి మెల్లిగా నడవ సాగాడు.

"ఈ సమావేశంలో అన్ని అంశాలు చర్చించారుగాని ఒకటి మర్చిపోయారు సు మతీ... ఏమిటో చెప్పు చూద్దాం"

"జీవితం"

"వెరీగుడ్... దాని ప్రస్తావన వస్తుందేమో నని చూశానుగాని ఎక్కడా రాలేదు"

"మీరెందుకు చెప్పలేదు సార్?" అంది సుమతి నవ్వుతూ.

"ఎందుకూ జీవితానికి సాహిత్యానికి అస లేం సంబంధంలేదని అనేస్తారు"

"అదీ నిజమే... సాహితీప్రయోజనం ఏమి టంటే చాలామంది పరమ తప్పుడు అభిప్రా యాలు చెప్పారు"

"అందుకే నేనా ప్రసక్తి తీసుకురాలేదు. అసలు సమస్యేమిటంటే సుమతీ, రచయితల కి జీవితం గురించి అవగాహన లేదు. జీవితం ఎందుకో, దీని పరమార్థం ఏమిటో తెలీడంలే దు. ఈమధ్యన వచ్చే రచనలు చూస్తున్నానుగ దా, చాలామందికి ఈ అవగాహన లేనట్టు కనిపించింది"

"అవునవును"

"అసలు తాము చూడని, తమకి తెలీని విషయాల గురించి కూడా రాస్తున్నారు, బహు మతులు అందుకుంటున్నారు"

"తప్పేం ఉంది?"

"తప్పు మహా తప్పు... మనది మధ్యతర గతి కుటుంబం... మనకి ఈ జీవితాలమీద అవగాహన ఉంది. అందుకని మనం వీటి గురించే రాయాలి. కాయకష్టం చేసుకునే వా ళ్ళు వాళ్ళ జీవితాల్ని వాళ్ళే కథలుగా చె ప్పాలి. ఈమధ్య దళిత రచయితలు ఈ పనిచేస్తున్నారు. ముందు నువ్వు జీవితం అంటే ఏమిటో చూడాలి, పరిశీలించాలి. అలా గే మనషుల మనస్తత్వాన్ని కూడా. అప్పుడే రాయాలి. జీవితం గురించి ఏం తెలీకుండా రాయకూడదు. మన దౌర్భాగ్యంకొద్దీ రచయిత ల్లో ఈ అవగాహన లోపించింది. అందుకే పనికిమాలిన చెత్తంతా సాహిత్యంగా చెలామ ణి అవుతోంది"

వానజల్లు తగ్గిందిగాని రోడ్డంతా తడితడిగా ఉంది. సుఖమైన చల్లని గాలి... నియాన్ లైట్ల కాంతులమధ్య రాత్రి జీవనం సాగుతోంది ప్రశాంతంగా.

"ఇప్పుడేం చేద్దాం?" అడిగాడు వివేకా నంద పాంట్ జేబుల్లో చేతులు పెట్టుకుని నడుస్తూ.

"ఏం చేద్దాం ఏమిటి? ఇంటి కెళ్ళడం... భోం చేయడం, నిద్రపోవడం"

"సినిమాకెళ్దాం... తొమ్మిదేగా అయింది..."

"ఏం సినిమా?"

"శ్రీదేవిలో రాజ్‌కపూర్ 'జాగ్తేరహెూ' ఆడు తోంది. దానికెళ్దాం"




"ఓకే..." అందామె నవ్వుతూ.

రోడ్డుమలుపు తిరిగి టక్కున ఆగిపోయాడు వివేకానంద. సుమతి కూడా ఆగింది.

"మిరపకాయ బజ్జీలు తిందామా? తిని చాలా రోజులైంది"

"నాకేం అభ్యంతరం లేదు"

ఇద్దరూ బజ్జీల బండి దగ్గరికి వెళ్ళారు. వివేకానంద ఐదు రూపాయలనోటు అందించాడు. బండి అతను గ్యాస్‌స్టౌ ముందు కూర్చొని బజ్జీలు వేస్తున్నాడు. భార్య వచ్చిన వాళ్ళకి అందిస్తోంది.

"చూశారా... అతనెంత కష్టపడుతున్నాడో... భార్యకి ఎంత సహాయం చేస్తున్నాడో"

"భార్యకి శారీరక శ్రమ తగ్గించాలి మేడమ్. ఇది భర్తలందరి బాధ్యత... ఈ సబ్జెక్ట్ మీద పెద్ద కథొకటి రాశానుగా" అన్నాడు వివేకానంద గొప్పగా.

సుమతి నవ్వింది.

"రాయడం వరకే అమల్లో పెట్టడం లేదు. కథల్లో, నవలల్లో స్త్రీ శ్రమ దోపిడీ గురించి రాయడం తప్ప ఇంటి పని వంట పని అన్నీ నేనే చూసుకుంటున్నాను"

వివేకానంద ఇబ్బందిగా ఫీలయ్యాడు. భార్య చెబుతోంది నిజమే. కథల్లో తను రాసిన ఆదర్శాలని ఆచరణలో పెట్టలేకపోతున్నాడు. ఏనాడూ వంటింట్లోకి వెళ్ళి సాయం చెయ్యలేదు. బజారుకి సరుకులకోసం వెళ్ళాలన్నా ఆమే వెళ్ళాలి. తను పడక్కుర్చీలో హాయిగా పవళించి ఊహల్లో విహరిస్తూ ఉంటాడు. భర్తననే సాంప్రదాయక పురుషాహంకారం తను చూపించడుగాని చాలా విషయాల్లో తనకీ, మిగతావాళ్ళకీ ఏం తేడా లేదనుకున్నాడు వివేకానంద.

మిరపకాయ బజ్జీలు తినడం పూర్తయింది. ఆ పక్కషాపులో సోడా తాగి ముందుకు నడిచారు ఇద్దరూ.

వివేకానంద, సుమతి టిక్కెట్లు తీసుకుని లోపలికి వెళ్ళారు. సినిమా పూర్తయ్యాక బైటికి వస్తూ అన్నాడు వివేకానంద.

"ఈ సినిమా ఎన్నిసార్లు చూశానో నాకే గుర్తులేదు"

"అంత ఇష్టమా?"

అరగంట తర్వాత ఒక రెసిడెన్షియల్ కాంప్లెక్స్ నాలుగో అంతస్థులో తన ఫ్లాట్ తాళం తీశాడు వివేకానంద. స్నానం, భోజనం పూర్తయ్యాక అతను కిటికీ దగ్గరికి వెళ్ళి బైటికి చూస్తూ నిలబడ్డాడు. అక్కడినించి చూస్తుంటే నగరం నల్ల దుప్పటి కప్పుకున్న దయ్యంలా కనిపించింది. అంతలో సుమతి వచ్చింది కొంగుతో చేతులు తుడుచుకుంటూ.

"మీ సాహిత్య సదస్సులో ఇంకో విషయం మరిచిపోయారు"

"ఏమిటది?" అడిగాడు వివేకానంద.

"సాహిత్యం, ఊహ, వాస్తవం"

"అవునవును... భలే గుర్తుచేశావు. ఊహని వాస్తవాన్ని సమపాళ్ళలో రంగరించి జీవితాన్ని జీవితంగా చూపించేదే అసలు సిసలైన సాహిత్యం సుమండీ"

"స్వానుభవం?"

"అదీ ఉంటుందిగాని ఏది రచయిత స్వానుభవం కాదు? అనేది పాఠకులు సరిగ్గా గ్రహించగలగాలి. ఇప్పుడు ఓ రచయిత ఒక హత్యని తను దగ్గరుండి చూసినట్టు రాశాడనుకో... అది అతని స్వానుభవం కాదు. రావిశాస్త్రి రత్తాలు-రాంబాబు రాశాడు. అందులో వ్యభిచార కొంపల్ని అద్భుతంగా చిత్రించాడు, తనే దగ్గరుండి ఒక కొంప నిర్వహించినట్టు. అంత మాత్రంచేత ఆయన ఆ పని చేశాడని అనుకోవడం తప్పు. అలాగే ఇంకో రచయిత జైలుజీవితం గురించి రాస్తాడు. ఇంకో అతను అనుమానం మొగుడు గురించి రాస్తాడు. దాన్నిబట్టి అతను జైల్లో ఉండొచ్చాడనిగాని, ఇతను అనుమానం మనిషనిగాని నిర్ధారణకి రావడం తప్పు..."

"పాఠకులు అలా అనుకుంటే?"




# చేపలతో చెలిమి



జాన్‌వెస్ట్ అనే ఈ ఆసామిగారికి భయంకరమైన షార్క్‌చేపలతో ఆడుకోవడం మహా సరదా. ఒక్క చేపలేకాదు పాములు, భయంకరమైన బల్లులు, కప్పలు మొదలయినవాటిని కూడా చక్కగా లొంగదీసుకుని అనేక విన్యాసాలు చేసేవాడు వేస్ట్. ఈయనగారు 13 సంవత్సరాల వయసులోనే నాలుగు మీటర్ల పొడవున్న కొండచిలువను మాలిమిచేసుకుని పెంచడం ప్రారంభించాడు. పద్ధెనిమిది సంవత్సరాల వయసులో జూలోని షార్క్ చేపలుండే పూల్‌ని శుభ్రపరిచే వ్యక్తికి సాయంచేస్తూ అనుక్షణం ఆ చేపల విన్యాసాలను గమనించేవాడు. ఓ స్వంత ఎక్వేరియమ్ తయారుచేసుకుని చిన్నచేపనుంచి పెద్దచేపదాకా అన్నిరకాల మత్స్యాజాలాల్ని పెంచి పోషిస్తూ అందులోనే ఆనందం పొందుతున్నాడు.

"నమస్కారం చేసి వదిలెయ్యడమే. ప్రముఖ రచయిత ఉన్నాడు సుమతీ... అతను ఐదారేళ్ళక్రితం ఓ నవల రాశాడు. అందులో ఒకతను ఏదో తప్పుడు కేసులో జైలుకి వెళ్తే అతని భార్య ఒక మోసగాడి వలలో పడుతుంది. అతను తన మిత్రుడికి ఆమెని తారుస్తాడు. ఆ నగరంలో కొంతమంది అతనే ఆ పని చేసుంటాడని, అందుకే అతని కథలూ, నవలలూ అచ్చవుతున్నాయని దుష్ప్రచారం చేశారు''

"పాపం తప్పు గదూ'' అంది సుమతి సానుభూతిగా.

"ఈమధ్య అతను కనిపించాడు. తన గోడ వంతా చెప్పుకుని చాలా బాధపడ్డాడు. ఓ దినపత్రిక సండే మేగజైన్‌లో ఎప్పుడో పదేళ్ళక్రితం ఓ పెద్ద వ్యాసం వచ్చిందట. దాని ఆధారంగా ఆ నవల రాశానని చెప్పాడు''

"ఆ తార్పుడు సన్నివేశాలు చాలా సినిమాల్లో ఉన్నయ్... అంతమాత్రంచేత ఆ రచయితలందరూ ఆ పనులు చేశారని అర్థమా?"

"పాఠకుల స్థాయి నీచస్థితిలో ఉందని చెప్పి ఏడ్చినంత పని చేశాడు. మానవ మనస్తత్వం అలాగే ఉంటుంది. రచయితలు, కవులు, కళాకారులమీద దుష్ప్రచారాలు చేసి ఆనందిస్తూ ఉంటారు. అయినా రచయిత ఎప్పుడూ మనుషుల్ని ద్వేషించకూడదు, ప్రేమించాలని చెప్పాను. చాలామంది రచయితలు మీకంటే ఎక్కువ బాధలు, కష్టాలు పడ్డారు, అని చరిత్రంతా టూకీగా చెప్పి ఏం బాధపడకుండా రచనా వ్యాసంగం కొనసాగించమని చెప్పి ఓదార్చాను.

"ఏమన్నాడు?"

"కొంచెం ఉత్సాహం తెచ్చుకుని థాంక్స్ చెప్పి పోయాడు''

"మంచిపని చేశారు, పదండి... నిద్రపోదాం"

లైట్లు తీసేసి ఇద్దరూ పడగ్గదిలోకి వెళ్ళారు. అలారం పీస్ టిక్‌టిక్ శబ్దం తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది.

టైమ్ ఎంతైందో తెలీదుగాని, కాలింగ్ బెల్ చప్పుడు వినిపించింది రణభేరిలా... ఇద్దరికీ మెలకువ వచ్చింది.

"మీ తమ్ముడు అయ్యుంటాడు. వాడి అభిమాన రాజకీయపార్టీ సదస్సు కోసం ఇప్పటిదాకా గోడలమీద శ్రమించి వచ్చినట్టున్నాడు. వెళ్ళి తలుపు తియ్యి'' అన్నాడు వివేకానంద.

సుమతి లేచి వెళ్ళి తలుపు తీసింది. ఆ వచ్చిన వాడు తన తమ్ముడు కాదు. ఎవరో నలుగురున్నారు. తలుపు తీసీ తీయగానే గభాలున లోపలకి వచ్చి తలుపు మూశారు. ఆమెకి ఆశ్చర్యంతో నోట మాటరాలేదు. వివేకానంద పరిస్థితీ అలాగే ఉంది. అలా వాళ్ళవైపు నోరు తెరుచుకుని చూస్తూ ఉండి పోయాడు.

సుమతి అప్రయత్నంగా తన చేతులకున్న బంగారు గాజులవైపు చూసుకుని, మెళ్ళో మంగళసూత్రాన్ని తడుముకుంది.

"మేం దొంగలం కాదు, మీరేం భయపడనక్కర్లేదు'' అన్నాడు వాళ్ళలో పొడుగ్గా ఉన్నతను.

"మరెందుకు వచ్చారు?" అడిగాడు వివేకానంద.

"మిమ్మల్ని కిడ్నాప్ చేయడానికి''

"ఎవరు మీరు?"

"విప్లవకారులం"

ఆ మాటతో వివేకానంద పెద్దగా నవ్వాడు.

"నన్ను కిడ్నాప్ చేసి జైళ్ళలో ఉన్న మీవాళ్ళని విడిచిపెట్టాలని షరతుపెడతారా? ఏం లాభం ఉండదు. నేనంత ప్రముఖ వ్యక్తినికాదు, ప్రభుత్వం లొంగదు. దిసీజ్ షియర్ వేస్ట్ ఆఫ్ యువర్ టైమ్ అండ్ ఎనర్జీ''

"మేం ఆ ఉద్దేశంతో మిమ్మల్ని కిడ్నాప్ చేయడంలేదు. వేరే పని ఉంది''

"మీరు తీవ్రవాదులనే నమ్మకం ఏముంది? బైటికి తీసుకెళ్ళి చంపేస్తే...?"

"ఆ పని ఇక్కడే చెయ్యొచ్చుగాని చెయ్యం. అయినా మేం విప్లవకారులమని రుజువుచేసుకోవడానికి విప్లవ గీతాలు పాడాలా? లేకపోతే తుపాకులు చూపించాలా?" అడిగాడతను.

"ఏం అక్కర్లేదు. ఇంకో రుజువు ఏదైనా చూపించండి''

వాళ్ళు నలుగురూ మొహామొహాలు చూసుకున్నారు. వాళ్ళలో ఒకతను జేబులో చెయ్యిపెట్టి రెండు ఈగల్ని తీశాడు.

"ఇదుగో మీకు కావాల్సిన రుజువు. ఇవి అడవి ఈగలు... మైదాన ప్రాంతంలో ఉండవు... చూడండి''

వివేకానంద, సుమతి వాటివైపు చూశారు.

"రుజువు చాలు గాని, నన్ను కిడ్నాప్ చేయడం అనవసరం. మీకు దానివల్ల వచ్చే లాభం అంటూ ఏం ఉండదు''

"లాభాలు, నష్టాలు ఆలోచించే వ్యాపారులం కాదు మేము. ఒక పనిమీద తీసుకెళ్తున్నాం... అది పూర్తవగానే మిమ్మల్ని భద్రంగా తీసుకొచ్చి ఇక్కడే వదిలేస్తాం"

సుమతికి ఏం అంతుపట్టలేదు. కిడ్నాప్ చేయడానికి వచ్చిన వాళ్ళతో మామూలుగా ఏదో బంధువులతో మాట్లాడినట్టు మాట్లాడతాడేవిటి తన భర్త అనుకుంది.

"నాకిది ఇష్టంలేదు. ఆయన ఆరోగ్యం బాగా లేదు! లివర్ కంప్లయింట్ ఉంది. మీరు తీసుకెళ్ళగానే జబ్బు చేస్తే కష్టం... మమ్మల్నిలా వదిలేయండి ప్లీజ్"

"మొత్తం రెండు వారాలు మేడమ్. అంతే. మేం అంతకుమంచి ఒక్క రోజు కూడా ఉంచుకోం... అయితే ఒక హెచ్చరిక. దీన్ని గురించి మీరు యాగీ చెయ్యకూడదు'' అన్నాడు పొడుగ్గా ఉన్న నక్సలైట్.

"మీపేరేమిటి?"

"మావన్నీ మారు పేర్లే"

"మీ మాటల్లో తెలంగాణా యాసలేదు, మీరు నక్సలైట్లు కారేమోనని నా అనుమానం" అన్నాడు వివేకానంద.

"కోస్తా భాష నేర్చుకున్నాం"

"ఇప్పుడు మిమ్మల్ని ఎవరైనా చూస్తే''

"వాళ్ళకి ఆయుధాలతోనే సమాధానం చెబుతాం... మీరేం దిగులు పడనక్కర్లేదు'' అన్నాడతను, తన చేతి సంచీలో ఉన్న రివాల్వర్ తీసి చూపిస్తూ!

"మావారిని తీసుకెళ్ళడం నాకేం ఇష్టం లేదు! ఎన్‌కౌంటర్‌లో పొరపాటునో, గ్రహపాటునో బుల్లెట్ తగలొచ్చు. లేకపోతే పోలీసులు మీతోపాటు ఈయన్ని కూడా అరెస్టు చెయ్యొచ్చు''

"అసలు రహస్యం అంతా అక్కడే ఉంది మేడమ్. ఒక రచయిత మాలో ఉన్నాడని తెలిస్తే పొరపాటున బుల్లెట్ తగులుతుందేమోనని పోలీసులు మా జోలికిరారు. అయినా కేవలం రెండు వారాలు... అంతే! ఇక మీరు బయలుదేరండి వివేకానందగారూ''

వివేకానంద లోపలి గదిలోకి వెళ్ళాడు. అతనితోపాటు సుమతి కూడా వెళ్ళింది.

"మీకేదో పిక్నిక్‌కి వెళ్తున్నట్టుంది''

"లేదు సుమతీ... మనం ఎన్ని చెప్పినా వాళ్ళు వినరు. అందుకని లేని పోని తలనొప్పి కంటే ఒకసారి వెళ్ళి వాళ్ళతోపాటు ఉండివస్తేనే బాగుంటుందనుకుంటున్నాను''

"రోజూ పేపర్లలో రకరకాలవార్తలు చదువుతున్నాం... ఎన్‌కౌంటర్లు, మందుపాతరలు... నాకేదో భయంగా ఉంది''

"డోన్ట్ వర్రీ డియర్"

"అయితే తప్పదా''

"తప్పదుగాక తప్పదు. పిల్లలు అడిగితే ఊరికెళ్ళానని చెప్పు'' అన్నాడు వివేకానంద సూట్‌కేసులో బట్టలు పడేస్తూ.

తనిలా ఏం గాభరాపడకుండా వెళ్లడం తనకే ఆశ్చర్యంగా ఉంది. భార్య కూడా గగ్గోలుపెట్టి ఏడవడం గట్టిగా ప్రశ్నించడం




లాంటివి ఏమీ చెయ్యకపోవటం మరింత ఆశ్చర్యంగా ఉంది. బహుశా నక్సలైట్లకు ఇది మింగుడు పడి ఉండదు. నానా యాగీ చేసి, తెగ భయపడిపోతామని ఊహించి ఉండవచ్చుగాని ఇంత సింపుల్‌గా తేలి పోతుందని అనుకుని ఉండరు.

వివేకానంద ఆలోచిస్తూనే బట్టలు సర్దడం పూర్తిచేశాడు. తర్వాత నాలుగు నవలలు, కొన్ని తెల్లకాగితాలు పడేశాడు. అలాగే తన మందులు, స్పేర్ కళ్ళజోడుకూడా.

"వస్తాను సుమతీ... వీళ్ళు ఓ నిర్ణయానికి వచ్చాక దాన్ని తుచ తప్పకుండా అమలుచేస్తారు. నో డిస్కషన్స్... నో గోయింగ్ బ్యాక్... అందుకే నేనేం వాదించలేను. నువ్వు కూడా ఏం గాభరాపడలేదు... భేష్'' అని హాల్లోకి వచ్చాడు వివేకానంద.

"అన్నీ తీసుకున్నారా?" అన్నాడు ఒకతను.

"అన్నీ తీసుకున్నాను. అయితే నాకొక్కటే చిన్న సందేహం"

"చెప్పండి''"

"మేం లోపలికి వెళ్ళినప్పుడు పోలీసులకి ఫోన్ చేస్తామని ఎందుకు అనుమానించలేదు?"

"మీ ఇంట్లో ఫోన్ లేదని మాకు ముందే తెలుసు''

వివేకానంద భార్యవైపు చూసి చెయ్యూపి వాళ్లతో కలిసి బైటికి వెళ్ళాడు. సుమతి అలాగే కొయ్యబొమ్మలా నిలబడిపోయింది. జరిగింది అసలు వాస్తవమా కలా అనీ అనుమానం వచ్చిందామెకి. తనిప్పుడు వెంటనే బైటికి వెళ్ళి ఏదైనా పబ్లిక్ టెలీఫోన్ బూత్‌నించో, ఎవరైనా ఫ్రెండ్ ఇంటినుంచో పోలీసులకు ఫోన్ చేస్తే? వెంటనే వాళ్ళు నగరం చెక్‌పోస్టుల్ని అలర్ట్ చేసి నక్సలైట్లను అరెస్టుచేసి తన భర్తని విడిపిస్తారు. అయితే ఆమెకి ఒక్కటే అర్థంకాలేదు. తన భర్త తీవ్రవాదులతో ఎక్కువ వాదించలేదు. రమ్మనగానే బయల్దేరాడు, ఆనందంగా. వాళ్ళతో వారం పదిరోజులు గడిపితే ఇంకో నవల రాయడానికి వీలవుతుందేమోనని అనుకుంటున్నాడా? అక్కడా ఇక్కడా విన్నవి చదివినవి కాకుండా తీవ్రవాదులతో కొన్నాళ్ళు తిరిగితే ఫస్ట్‌హాండ్ ఇన్‌ఫర్మేషన్ సంపాయించి, పేరు ప్రఖ్యాతులు పెంచుకోవచ్చు అనుకుంటున్నాడా?

భర్తకి అంత ఆసక్తి ఉత్సాహం ఉన్నప్పుడు తను పోలీసులకి ఫోన్ చేయడం అనవసరం... దానివల్ల నక్సలైట్లకు ఆగ్రహం వచ్చి తన భర్తని కాల్చి పారేసినా దిక్కులేదు. అదికాదు చెయ్యాల్సిన పని. తెల్లవారాక ఎటూ పేపర్‌వాళ్ళకి తెలుస్తుంది. పత్రికలు గగ్గోలు పెడతాయి. అప్పుడు ఆలోచించొచ్చు ఏం చెయ్యాలా అనే దాని గురించి.



రోడ్డుపక్క చిన్న సందులో ఒక మెటడోర్ వ్యాను ఆగి ఉంది.

నక్సలైట్లు వివేకానందని వ్యాను దగ్గరికి తీసుకెళ్ళి డోర్‌మీద చిన్నగా తట్టారు, సంకేతంలాగా. డోర్ తెరుచుకుంది. వివేకానంద ఏం వాదించకుండా నిశ్శబ్దంగా లోపలికి ఎక్కాడు.

సీట్లో కూర్చుని లోపలివైపు పరిశీలనగా చూసి తనుగాక ఇంకో నలుగురైదుగురు ఉన్నట్టు గ్రహించాడు వివేకానంద. తనకోసం ఇంత మంది తీవ్రవాదులు రావడం ఎందుకో అతనికి అర్థంకాలేదు. వాళ్ళ మొహాలు చూడ్డానికి

లోపల లైటు లేదు, వీధి దీపం కూడా వెలగటం లేదు.

బైట ఉన్న నలుగురూ వ్యాన్ లోపలికి ఎక్కారు.

"నాపేరు పులకేసి. మీకింకో విచిత్రం చూపించనా? ఆశ్చర్యపడిపోతారు'' అన్నాడు ఒకతను.

"ఏమిటది?" అడిగాడు వివేకానంద.

పులకేశి జవాబు చెప్పకుండా నవ్వి అగ్గిపుల్ల గీశాడు. ఆ వెలుతురులో ఎదురు సీట్లో కూర్చున్నవాళ్ళు కనిపించారు. మొత్తం నలుగురు.

"హలో వివేకానందగారూ, బాగున్నారా?" అడిగాడు గురుదేవ్.

వివేకానంద పరమాశ్చర్యంగా అతనివైపూ, మిగతా ముగ్గురివైపూ చూశాడు. వాళ్ళు నలుగురూ రచయితలే. అంటే... అంటే తీవ్రవాదులు మొత్తం ఐదుగురు రచయితల్ని కిడ్నాప్ చేశారన్న మాట... దేనికి? ఏం ఆశించి ఈ కిడ్నాప్ చేశారు? వాళ్ళ పథకం ఏమిటి?

వివేకానందకి ఈ ప్రశ్నకి జవాబు దొరకలేదు.

వ్యాన్ బయలుదేరింది.

★ ★ ★

ప్రాతఃకాలపు గాలి చల్లగా, మెల్లిగా వీస్తోంది. ఆర్టీసీ బస్సు నిదానమే ప్రధానం అన్నట్టుగా వెళ్తోంది. బస్సులో చాలామంది నిద్రలో పడి జోగుతున్నారు. కొందరు పేపర్లు చదువుతున్నారు.

కండక్టర్ కలెక్షన్ లెక్కిస్తున్నాడు. అతని పక్కనే నిలబడ్డ ముగ్గురు ప్రయాణీకులు అతను లెక్కేస్తున్న నోట్లవైపు కళ్ళార్పకుండా చూస్తున్నారు. కండక్టర్‌కి ఉదయంవేళ చల్లటి గాలి ఇస్తున్న ఆనందంకంటే ఇష్యూ చేసిన పాత టిక్కెట్లనే మళ్ళీ ఇష్యూచేసి సంపాదించిన






ఇరవై నాలుగు రూపాయల అరవై పైసలు అమితానందం ఇస్తున్నాయి. అతని చేతి వేళ్ళకో నీలంరంగు రాయి ఉన్న బంగారు ఉంగరం ఉంది. ఒక వేళ చెకింగ్ పార్టీ వస్తే వాళ్ళకి సమర్పించుకోవడానికి. గతంలో అతనొకసారి అలా చేసి తప్పించుకున్నాడు. రెండోసారి మాత్రం సస్పెండ్ అయి నానాకష్టాలు పడి మళ్ళీ ఉద్యోగంలోకి వచ్చాడుగాని పాతబుద్ధి ఇప్పటికీ మారలేదు.

ముందుసీట్లో కిటికీ పక్కనే కూర్చున్న భవాని ఇవేం పట్టించుకోవడంలేదు. కిటికీ లోంచి అలా వరసగా వెనక్కి వెళ్తున్న పల్లెటూళ్ళని, పొలాలని, పంటకాలువల్ని చూస్తోంది. ఆమెకి నగరంలో ఒక మందులషాపు ఉంది. డిగ్రీ పూర్తయ్యాక ఉద్యోగం కోసం ఎవర్నీ యాచించకుండా సొంతంగా, స్వతంత్రంగా, స్వేచ్ఛగా బతకాలనే ఉద్దేశంతో ఆ షాపు పెట్టింది. ఆమె తల్లిదండ్రులు కాదనలేదు.

"ఏ ఊరెళ్ళాలి?" పక్కనున్న ముసలమ్మ అడిగింది.

ఆవిడ బస్సెక్కినప్పటినించి భవానినే గమనిస్తోంది. ఆ లేత మొహం, ఉజ్వలంగా ప్రకాశిస్తున్న కళ్ళు, చెవులికి రింగులు, తలలో ఒకే ఒక సంపెంగపువ్వు... మెళ్ళో సన్నని గొలుసు, వళ్ళో ఉన్న ఆంగ్లదినపత్రిక ముసలావిడని ఎంతగానో ఆకర్షించాయి. తనకీ మనవరాలుందిగాని దానికి ఇంగ్లీషు సంగతలా ఉంచి తెలుగే రాదు. ఏడో క్లాసు తప్పి ఇంట్లో కూచుంది. అందుకో, ఇంకెందుకోగాని ఆ ముసలావిడకి చదూకున్న ఆడవాళ్ళమీద ఒక రకమైన గౌరవభావం ఏర్పడిపోయింది. భవాని బస్సులో ఎక్కగానే శ్రద్ధగా పేపర్ చదవడం ఆవిడకి నచ్చింది.

"రామచంద్రాపురం" చెప్పింది భవాని.

# రచయితలకు మనవి



- 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్యా పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం**
- ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

"మాదీ ఆ ఊరే... అవునూ, ఎందుకు వస్తున్నావు?"

"నా స్నేహితురాలి పెళ్ళి... ఇవాళ రాత్రికి''

"ఎవురమ్మాయి?"

"రామానుజంగారి కూతురు''

"రామానుజం కూతురా... ఇద్దరూ కలిసి సదువుకున్నారా?"

"అవును''

"వాళ్ళిల్లు నీకు తెలుసా?"

"తెలుసు... ఇదివరకు రెండుమూడుసార్లు వచ్చాను''

"అయితే మంచిదే... అయినా అంత చదూకున్న పిల్ల పెళ్ళి పట్నంలో చెయ్యక పల్లెటూళ్ళో ఎందుకు?"

"ఛాయకి తన ఊరంటే చాలా ఇష్టం... పైగా పట్నంలో అయితే ఎక్కువ ఖర్చని వద్దనిఉంటుంది''

"ఆ మాటా నిజమే తల్లీ... పట్నంలో అన్ని వస్తువుల ధరలు మండిపోతున్నాయ్... రెండొందలు పెడితే ఎన్ని సరుకులొచ్చినయ్యో సూడు'' అంది ముసలావిడ తన కాళ్ళదగ్గరున్న సంచీ చూపిస్తూ.

"మీరు పట్నం ఎందుకువచ్చారు'' అడిగింది భవాని, ఏదో ఒకటి మాట్లాడాలనే ఉద్దేశంతో

"మా తోడికోడలుకి వంట్లో బాగాలేదు. సూసొద్దామని ఎళ్ళాను. ఎటూ ఎళ్తున్నాం గదా కాసిని పచారీ సామాన్లు కూడా తెచ్చుకుందామని డబ్బులు తీసుకుపోయాను''

బస్సు ఆగింది. నలుగురు దిగితే ఆరుగురు ఎక్కారు. మళ్ళీ కదిలింది.

"వచ్చేదే రామచంద్రాపురం... అవునూ నీకో ఇషయం తెలుసా?" అడిగింది ముసలమ్మ గొంతు తగ్గించి మెల్లిగా.

"ఏమిటది?"

"రామానుజం ఈ మజ్జ పట్నం చుట్టూ తెగ తిరుగుతున్నాట్ట''

"దేనికి?"

"కోర్టుకి ఎళ్తాడంటగా... ఉరోళ్ళు సెప్పుకుంటున్నారు''

"కోర్టుకి వెళ్లడం ఎందుకు?"

"ఆడే... మావూరి రావణాసురుడు కాశీప్రసాద్‌మీద కేసుపెట్టాడంట.

"దేనికి?" అడిగింది భవాని కొంచెం విసుగ్గా! ఆ ముసలమ్మ మొత్తం ఒకేసారి చెప్పకుండా ముక్కలు ముక్కలుగా చెబుతోందని.

"ఏం ముసలమ్మా... ఏమిటీ అడ్డదిడ్డంగా వాగుతున్నావు? ఇంటికెళ్ళాలని లేదా?" అడిగాడు వెనక సీట్లో కూర్చున్న ఒకతను.

ఆ మాటతో ముసలమ్మ, భవాని ఒకేసారి వెనక్కి తిరిగి చూశారు. అతను పొడుగాటి మీసాలతో, ఖద్దరు చొక్కాతో, జేబులోంచి బైటికి కనిపిస్తున్న వందరూపాయల నోట్లతో గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టెతో ఉన్నాడు. వాళ్ళిద్దరి వైపు చూసి భీకరంగా నవ్వాడు.

"నేనేం అనలేదయ్యా... ఊరికే చెబుతున్నాను. అయినా ఊళ్ళో ఎవరెట్టాపోతే నాకెందుకు?" అంది ముసలమ్మ.

"అదీ మంచి పద్ధతి... బుద్ధిగా ఉండటం నేర్చుకో... అదుగో మనూరొచ్చింది దిగు'' అన్నాడతను.

బస్సు ఆగింది. భవాని ముందు, ఆ వెనక ముసలమ్మ, అతను మరో ముగ్గురు దిగారు.

ముసలమ్మ భవానివైపు చూసి మాట్లాడకుండా వెళ్ళిపోయింది. భవాని ముందుకు నడిచింది. ఆమెని చూసి ఇద్దరు చిన్నపిల్లలు గుర్తుపట్టి రాకెట్లలా దూసుకెళ్ళి 'పట్నం అమ్మాయి వస్తోంద'ని రామానుజం ఇంట్లో చెప్పి వెళ్ళారు.

తనీఊరొచ్చి మూడేళ్ళు పైనే అయిందనుకుంది భవాని, చుట్టూ చూస్తూ. ఊరేం మారలేదు. ప్రధానమైన వీధుల్లో అంటే అగ్రవర్ణాలు ఉండే వీధుల్లో ఎర్రమట్టిరోడ్డు పడింది. దూరంగా రక్షిత మంచినీటి పథకం కింద కట్టిన

వాటర్ ట్యాంకు కనిపిస్తోంది. గోడలమీద గత అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా 'ఫలానా అభ్యర్థికే ఓటు వేయండి' అని రాసి ఉన్న స్లోగన్లు అలాగే ఉన్నాయి. ఒకటి రెండు ఇళ్ళకు మరమ్మతులు చేసినట్టు కనిపించింది.

ప్రధానమైన వీధి గుండా నడిచి మలుపు తిరిగింది భవాని. ఛాయవాళ్ళ ఇల్లు కనిపించింది. ఇంటిముందున్న వేపచెట్టు అలాగే ఉంది. ఎత్తయిన అరుగుల ఇల్లు. వేపచెట్టుకి ఆనుకుని కట్టిన పందిరి. కొత్త సున్నం కనిపించాయి. పందిట్లో కొందరు చిన్న పిల్లలు ఆడుకుంటున్నారు. ఒకవైపు కొంతమంది పెద్ద వాళ్ళు బల్లలమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఇదేమిటి? అశ్చర్యపడింది భవాని, ఛాయ ఇంటికి కుడిపక్క వేసిన పెద్ద పశువుల కొట్టాన్ని చూస్తూ.

రామానుజం పాడిపరిశ్రమలోకి దిగాడేమో! ఆయన పెద్ద రైతు కాదు. నాలుగెకరాల మాగాణి, ఒక ఎకరం మెట్ట మాత్రమే ఉన్నాయని అప్పుడెప్పుడో ఛాయ చెప్పింది. అదనపు ఆదాయంకోసం నాలుగు గేదెల్ని కొని పాల వ్యాపారం మొదలు పెట్టినట్టున్నాడు.

అయితే ఆమెకి ఒకటే అర్థం కాలేదు. ఇలా శుభ్రంగా వ్యాపారంలోకి దిగిన రామానుజం కోర్టుకెందుకు వెళ్ళాడు? బస్సులో ముసలమ్మ కాళీప్రసాద్ అనే ఆయన్ని ఎందుకు తిట్టింది? ఆవిడ తిట్టిందో లేదో వెనక సీట్లో కూర్చున్నవాడు ఎందుకు బెదిరించాడు?

వాకిట్లోనే ఎదురొచ్చింది ఛాయ.

"పెళ్ళి ఇవాళైతే ఇవాళే రావాలా? నాలుగు రోజులు ముందే వస్తావనుకున్నాను"

"కుదరలేదు" సంజాయిషీ చెప్పింది భవాని.

"అయినా మందుల వ్యాపారంలో పడిపోయావు గదా... నాలుగు రోజులు షాపు మూసే

స్తే బోలెడు నష్టం" అంది ఛాయ నవ్వుతూ.

"అదేం కాదు..."

"ఏమ్మా బాగున్నావా?" పలకరించింది ఛాయ తల్లి.

"బాగానే ఉన్నాను..."

"ఆ సూట్‌కేసు లోపలపడేసి స్నానం చెయ్. టిఫిన్ చేద్దువుగాని''

"ఫరవాలేదు... తొందరేంవుంది లెండి... ఛాయతో కాసేపు కబుర్లు చెప్పి స్నానం చేస్తాను''

"సరే నీ ఇష్టం" ఆవిడ లోపలికెళ్ళిపోయింది. భవాని, ఛాయ పెరట్లోకి వెళ్ళి అక్కడ వేసున్న నవారు మంచంమీద కూర్చున్నారు.

"కాలేజీలో కబుర్లన్నీ మరిచిపోయావుటే ఛాయా?"

"ఏమిటవి?"

"మనకు నచ్చినవాణ్ణి ఇష్టపడి చేసుకోవడమా లేకపోతే తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధాన్ని తలొంచుకుని అంగీకరించడమా అని చర్చ వస్తే మొదటిదానికే ప్రిఫరెన్స్ ఇచ్చావు గుర్తుందా?"

"ఆరోజులే వేరు భవానీ... ఆ ఆశలు, ఆశయాలు, కలలు ఇప్పుడంతా మొనాటనీ... రొటీన్... ఉద్యోగం చేస్తానంటే ఒప్పుకోకుండా ఈ సంబంధం కుదిర్చారు. నాకిష్టంలేదంటే ఒప్పుకోలేదు''

"మొత్తానికి అప్పటి తిరుగుబాటు ధోరణి పోయిందే నీకు?"

"ఏం చేస్తాం? మానాన్న ఆత్మహత్య చేసుకుంటానన్నాడు. మా అమ్మ కిరోసిన్ పోసుకుని తగలబెట్టుకుంటానంది. చేసేదిలేక ఒప్పుకున్నాను. నాకేమో హాయిగా ఉద్యోగం చేస్తూ, చీకూ చింతాలేకుండా బతికేస్తూ ఎప్పుడో నాకు నచ్చినవాడు, నన్ను మెచ్చినవాడు కనిపిస్తే చేసుకుందామని ఉంది కాని కుదరలేదు''



"ఉద్యోగం వస్తే సిటీ కొస్తావు... నీ క్కూడా మా మహిళామండలిలో సభ్యత్వం ఇప్పిద్దా మని అనుకున్నాను''

"మహిళామండలిలో చేరావా నువ్వు? ఏం చేస్తున్నారేమిటి మీరందరూ?"

"సారా వ్యతిరేక పోరాటంనుంచి లాకప్ డెత్‌ల వరకు అన్నీ చూస్తున్నాం... మొత్తానికి ఆడవాళ్ళలో చాలా మార్పు వచ్చిందే ఛాయా. భర్త హింసిస్తుంటే మౌనంగా తమ కర్మని సరిపెట్టుకోవడం మానేస్తున్నారు. ఈ మధ్య మేం అలాంటి కేసులు కొన్ని పరిష్కరించి పేపర్లకెక్కాం కూడా''

"భేష్... మీరలా చేస్తూ ఉండండి. నేనిలా పెళ్ళిచేసుకుని సంసారం చేసుకుంటాను. ఏమి టోనే భవానీ... ఏదో తలుపులు మూసుకుపో యినట్టు ఫీలవుతున్నాను. ఈ పల్లెటూళ్లో ఉంటే కొన్నాళ్ళకి పిచ్చిపట్టేటట్టుంది. ప్రతివా ళ్ళూ మీ అమ్మాయికి ఇంకా పెళ్ళి చెయ్యరా అని అడిగేవాళ్ళే. దాంతో మా అమ్మకీ, నాన్నకి రోగం ముంచుకొచ్చింది''

"ఆ అబ్బాయిని నువ్వు చూడలేదా?"

"పెళ్ళి చూపుల తతంగం పూర్తయింది గా... చూశాను. బాగానే ఉన్నాడు. గవర్న మెంటు ఉద్యోగమేనట. కొంచెం పొలం సొంత ఇల్లు ఉన్నాయి. అంతే, మా నాన్న ఎగిరి గంతేశాడు.

"మన ఆశయానికి విరుద్ధంగా ఉందని తప్పు కాదని చెప్పడానికి నాకు ఏ కారణం కనిపించలేదు'' అంది ఛాయ మెల్లిగా.

"అయితే ఇంకేం హాయిగా పెళ్ళి చేసుకుని సుఖంగా సంసారం చేసెయ్... సరేగానీ మీ నాన్న పాల వ్యాపారం మొదలెట్టారా?"

"పాల వ్యాపారమా? మా నాన్నా... ఎవరు చెప్పారు నీకు?"

"ఇంటిపక్కనే లంకంత పశువుల కొట్టం కట్టించారుగా''

"ఓస్ అదా... అదో పెద్ద కథ. ఈ ఊళ్ళో కాళీప్రసాద్ అనే పెద్ద భూస్వామి ఉన్నాడు. ఏదో పార్టీ నాయకుడు కూడా. మా ఇంటిపక్క స్థలం ఖాళీగా ఉంటే చూసి గడ్డివామి వేసు కుంటానన్నాడు. సరే ఎలాగూ ఖాళీగా ఉంది కదా అని ఒప్పుకున్నాం. తర్వాత దాని చుట్టూ దడికట్టించాడు. ఒకరోజు గుంజలు, తాటాకు లు తెప్పించి పశువులకొట్టం వేసుకున్నాడు. ఎందుకని అడిగితే తన కొట్టం చాలడంలేదు, అందుకని వేసుకుంటున్నాను. కావాలంటే నె లకి పాతిక రూపాయలు ఇస్తానన్నాడు. ఇంత వరకు ఒకపైసా కూడా ఇవ్వలేదనుకో, అది వేరే విషయం. ఈమధ్య హెల్ప్ అనే మిషనరీ సంస్థవాళ్ళొచ్చి మీఊళ్ళో స్కూలుపెడతాం, ఖాళీస్థలం చూపించండని అడిగితే ఇది ఇద్దా మనుకుని కాళీప్రసాద్‌ని ఖాళీచెయ్యమన్నాం. అంతే, ఆయన మండిపడి ఎదురుతిరిగాడు. ఆ మాలనాకొడుకులకోసం నన్ను ఖాళీచెయ్య మంటారా? అని ఎగిరిపడ్డాడు. అంతటితో ఆగకుండా మానాన్ననికొట్టాడు. ఊళ్ళోవాళ్ళు సానుభూతి చూపించారు తప్ప కాళీప్రసాద్‌ని ప్రశ్నించే సాహసం చెయ్యలేదు. ఆ తగాదా అలా రాజుకుంటూనే ఉంది.

"కోర్టుకి వెళ్ళారుట కదా''

"నీకెవరు చెప్పారు?"

"బస్సులోనే ఓ ముసలమ్మ చెప్పిందిలే! ఆవిడ కాళీప్రసాద్‌ని తిడితే వెనక సీట్లో కూర్చు న్న ఒకతను బెదిరించాడు. దాంతో ఆవిడ మాట్లాడకుండా నోర్మూసుకుంది. ఊరు రాగా నే బస్సు దిగి వెళ్ళిపోయింది''

"మానాన్నని కొట్టేసరికి ఆయనకి కోపంవ చ్చి పట్నం వెళ్ళి స్థలం ఖాళీచేయాలని లాయర్ నోటీసు ఇప్పించాడు. నిన్నో మొన్నో అంది ఉంటుంది''

"ఓంటె, వ్యాపారి కథలా ఉంది మొత్తాని కి''

"ఆ కాళీప్రసాద్ ఇంకేం చేస్తాడోనని భయంగా ఉందే మాకు. వాడిది తాచుపాము పగ. మా ఊళ్ళో అన్యాయం, అక్రమం ఏం జరిగినా చేసేది వాడే. మా ఊరి మాజీ




సర్పంచ్ కూడా. పంచాయతీ నిధులు తినేశా వని విమర్శిస్తే ఒకతన్ని రాత్రికి రాత్రే హత్యచే యించాడు.

"లాయర్ నోటీసు ఇప్పించారు గధా! ఏం జరుగుతుందో చూద్దాం" అంది భవాని.

అయితే వాళ్ళు ఎదురు చూడని సంఘటన ఒకటి ఆ రాత్రికే జరిగిపోయింది.

★ ★ ★

కాళీప్రసాద్‌కి నూటనలభై ఎకరాల మాగాణి, ఓ పాతిక ఎకరాల మెట్ట ఉన్నాయి. ఊళ్ళో ఎవరూ ప్రారంభించక ముందే ట్రాక్టర్ సేద్యం మొదలుపెట్టాడు. ఆయన పెద్ద కూతురు అమెరికాలో డాక్టర్, పెద్ద కొడుకు కెనడాలో ఆయిల్ టెక్నాలజీలో ఇంజనీరు. రెండో కూతురు, రెండో కొడుకు మాత్రం ఈ వెధవన్నరెధవ ఇండియాలోనే ఉంటున్నారు. వాళ్ళిద్దరూ ఆయన రాజకీయాన్ని పట్టించుకోరు. హై సొసైటీ కల్చర్ అలవరుచుకుని పల్లెటూళ్ళకి, అలగా జనానికి దూరంగా ఉండటం నేర్చుకున్నారు.

కాళీప్రసాద్ మాటకి ఆ ఊళ్ళో ఎదురులేదు. రాజకీయ పార్టీలు పెరిగి, రాజకీయాలు ముదిరిపోయాక ఊళ్ళో ప్రత్యర్థులంటూ బయలుదేరారుగాని వాళ్ళెవరూ ఆయనమీద ప్రత్యక్షంగా దాడికి దిగే ప్రయత్నం చెయ్యరు. కారణం కాళీప్రసాద్ కులం, వాళ్ళ కులం ఒకటే. ఇందిరాగాంధీ రోజుల్లో ఆ ఊరి పంచాయతీ రిజర్వ్‌డ్ అయింది. ఇప్పుడు గ్రామసర్పంచ్ ఏసోబు. అతను కాళీప్రసాద్ ఎక్కడ కూచోమంటే అక్కడ కూచుంటాడు. ఎక్కడ ఎంత దూరంలో నిలబడమంటే అక్కడ నిలబడతాడు. ఏ కాగితాలమీద ఎక్కడ వేలుముద్ర వెయ్యమన్నా ఏమిటి, ఎందుకని ప్రశ్నించకుండా వేసేస్తాడు.

కాళీప్రసాద్ ఒక్కడికే ఆ ఊళ్ళో మూడంతస్థుల భవనం ఉంది. పై భాగంలోని గదిని ఈమధ్యనే ఏసీ చేయించాడు. అక్కడినించి ఊరివైపు చూస్తూ ఆ ఊరు, ఊళ్ళోని ప్రజలు తన పాదపద్మాల దగ్గర నిర్నిమిత్తంగా, నిర్భయంగా బతుకుతున్నారని అనుకుంటూ ఆనందిస్తుంటాడు.

ఆయన ఒక టర్మ్ సహకారబ్యాంకు డైరెక్టర్‌గా ఉన్నాడు. తనవాళ్ళకి భారీ ఎత్తున అప్పులు ఇప్పించి వాళ్ళు తనని, తన మాటని, తన పార్టీని ఎదిరించకుండా కట్టుదిట్టం చేశాడు. రామచంద్రాపురం రిజర్వ్‌డ్ కాక ముందు ఆయనే ఆ ఊరి సర్పంచ్‌గా దాదాపు పదిహేను సంవత్సరాలు ఏకగ్రీవంగా ఎన్నికై పరిపాలించాడు. ఇప్పుడు ఎన్నికలు ఏడెనిమిది నెలల్లో వస్తున్నందువల్లా, అందర్నీ కలుపుకుపోవాలని పైవాళ్ళు ఆదేశించడంవల్లా, ప్రజలతో కొంత సఖ్యంగా ఉండాలని నిర్ణయించుకున్నాడు.

అయితే రామానుజం తనకి లాయరు నోటీసు ఇప్పించడంతో ఆ క్రియాశీలక నిర్ణయానికి కొంత మినహాయింపు ఇచ్చాడు. ముందు ఆయన సంగతి తేల్చేయాలని అనుకున్నాడు. అందులో భాగంగానే తన నమ్మినబంటు రఘురాంని పట్నంలో లాయర్ దగ్గరికి పంపించాడు. అతని రిపోర్ట్‌కోసం ఇప్పుడు ఎదురుచూస్తూ డాబామీద నిద్రపట్టని పులిలా అసహనంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు.

కింద ఏవో మాటలు వినిపించేసరికి కాళీప్రసాద్ పిట్టగోడదగ్గరికి వెళ్ళి చూశాడు. రఘురాం కనిపించాడు, ఖద్దరు చొక్కా గ్లాస్కో పంచెతో.

"ఏరా వెళ్ళిన పని ఏమైంది?" అడిగాడు కాళీప్రసాద్, అతను మెట్లెక్కుతుండగానే హడావుడిగా ముందు కెళ్ళి.

"మన లాయర్ మహా చాలూగాడు. ఏం భయంలేదు. రామానుజం సంగతి చూస్తానన్నాడు. లాయర్ల భాషలో సూట్లు, నోటీసులు, పిటీషన్లని ఏవేవో చెప్పాడుగాని అయ్యన్నీ మన బుర్రకి ఎక్కలేదు''

"అగ్రిమెంట్ సంగతి ఏమన్నా అడిగాడా?"

"అడిగాడు. రామానుజంకి మీకూ అగ్రిమెంట్ ఏం లేదని చెప్పాను. నెలనెలా కిరాయి

ఇస్తున్నారా అని అడిగితే లేదన్నాను''

"కిరాయా బొచ్చా ఆడికిచ్చేది... కాకపోతే ఇప్పుడు మరీ అవసరం అనుకుంటే ఇంకో నాలుగు దెబ్బలేసి ఎక్కడ కావాలంటే అక్కడ సంతకాలు పెట్టించొచ్చు''

"ఆ పని చేసెయ్... ఎందుకైనా మంచిది... అగ్రిమెంటుకి ఒప్పుకుని కూడా ఇప్పుడు అనవసరంగా ఖాళీ చెయ్యమంటున్నాడని మనం కూడా కోర్టుకి ఎళ్ళొచ్చు''

"అవునూ రాత్రికిరాత్రి పని చూసుకునిరారా అంటే ఇప్పుడా వచ్చేది?"

"లాయర్‌తో మాట్లాడి సెకండ్‌షో కెళ్ళాను. ఇంటికొద్దామంటే లారీలేం దొరకలేదు. ఏం చెయ్యాలో తోచక మడతమంచం అద్దెకి తీసుకుని, పడుకుని పొద్దున్నే ఫస్ట్‌బస్‌కొచ్చాను. మా చంటాడికి వంట్లో బాగాలేకపోతే డాక్టర్ కాడకి తీసుకెళ్ళి, పొలంపని చూసుకునేసరికి ఈ టైమైంది'' అన్నాడు, రఘురాం పనుల భారం తప్ప తన విధేయతలో ఎలాంటి మార్పురాలేదని ప్రకటిస్తూ.

"సర్లె... ఇహ నువ్వెళ్ళి... ఆ రామానుజంగాణ్ణి లాక్కురా... ఈలోపు నేను అగ్రిమెంట్ తయారుచేస్తాను''

"ఇవ్వాళ వాడు రాడు. కూతురి పెళ్ళి. నీకు తెలీదంటే బాబాయ్''

"ఇవ్వాలేనా... రేపో ఎల్లుండో అనుకుంటున్నాను. మేళతాళాలేం మోగడంలేదు''

"ఎప్పుడో తెల్లారుజామున పెళ్ళి... ఆడి కూతురి ఫ్రెండొకతె నాకు బస్సులో కనిపించింది. పిల్ల బాగానే ఉంది''

"ఆ పిల్ల సంగతి కాదురా... రామానుజం కూతురు కూడా బాగానే ఉంటుందిగాని... ముందు దాని సంగతి ఆలోచించు''

"ఏవుంది ఆలోచించడానికి? ఇవాళ పెళ్ళి.







రేపట్నించి సంసారం మొదలుపెడుతుంది. మనం చూసుకోవాల్సింది రామానుజంగాణ్ణి. ఆడు ఈ ఊళ్ళోనే ఉండేవాడు''

కాళీప్రసాద్ కుబుసం విడుస్తున్న పాము లా, చిన్న జంతువుని మింగబోతున్న కొండచి లువలా నవ్వాడు.

"రామానుజం సంగతి నీకు తెలీదురా రఘురాం? ఆడొట్టి అమాయకుడు. ఈ పాతికే ళ్ళలో ఆడు మనదారికి అడ్డురాలేదు. తలొంచు కుని పోవడం, చెప్పింది చెయ్యటం, పార్టీ విరాళం ఇమ్మంటే మెదలకుండా ఇవ్వటం తప్ప ఆడు చేసిందంటూ ఏమీలేదు. అయితే ఇన్నాళ్ళకి ఆడు మనమీద ఎదురుతిరిగాడంటే దానిక్కారణం ఏమిటో ఆలోచించావా?"

"ఏంలేదు... పరిస్థితులు''

"పరిస్థితులూ కాదు, వల్లకాడు కాదు. ఆడి కూతురు ఛాయ... దానికి అవేం భావాలు... అభ్యుదయ భావాలంట అయ్యిన్నయ్. అందుక మాలనాకొడుకులు స్కూలు పడతాం అనగానే సరేనంది''

"అవునవును..." అన్నాడు రఘురాం. "స్కూలు పెట్టడం మంచిదేగదా! ఊళ్ళో ఉన్న సర్కారీవారి స్కూల్లో ఎవరూ పాఠాలు చెప్పరుగదా! టీచర్లు పిల్లలచేత ఇంటిపనులు చేయించుకోవడం తప్ప... మా అబ్బాయి ఐదోతరగతైనా ఐదోఎక్కమే రాదుకదా!"

"స్థలం ఖాళీచెయ్యం అన్నందుకు మనకి లాయర్ నోటీసు ఇప్పించింది. ఇది దానికి పుట్టిన బుద్ధి తప్ప రామానుజంగాడి ఆలోచన కాదు. అందుకని దానికో గుణపాఠం నేర్పాలి. ఇప్పుడే, పెందలాడే వేగిరం చెప్పకపోతే పనీపాటా లేని చదువుకున్న ఆడాళ్ళు దాన్ని సపోర్టుచేసినా చేస్తారు. అదీగాక ఆ పిల్ల ఈమధ్య అందరి ఇళ్ళకీ వెళ్తోందిట మన

దుర్మార్గం గురించి ప్రచారం చెయ్యడానికి''

"గుణపాఠం అంటే...?"

"ఏంలేదు... మగపెళ్ళోళ్ళు ఊళ్ళోకి రాగానే పెళ్ళికొడుకు తండ్రిని మనదగ్గరికి తీసుకురా. మిగతా సంగతి నేను చూస్తాను''

"సరే..."

"ఆళ్ళకి ఎవరింట్లో విడిది ఇచ్చారు?"

"నారయ్యగారింట్లో"

"ఆళ్ళింటికీ, రామానుజం ఇంటికి పెద్ద దూరమేం లేదుగదా! అయినా ఎవరూ చూడర్లే... చూసినా మరేం పరవాలేదు. ఆణ్ణి తీసుకురా. నేను మీకోసం ఎదురుచూస్తూ కూచుంటా'' రఘురాం తలూపి లేచి వెళ్ళిపోయాడు.

★ ★ ★

భగవంతరావు భయస్థుడు.

అనుక్షణం భయపడుతూ ఉంటాడు.

పై అధికారికి ఎందుకో, దేనికో తనమీద కోపంవచ్చి ఉద్యోగంలోంచి పీకేస్తాడని, తన భార్యాపిల్లలకి సంఘవ్యతిరేక శక్తులనుంచి ఏవో ఉపద్రవాలు రాబోతున్నాయని, తనని ఎవరో ఎందుకో ఏదో చేస్తారని భయపడుతూ ఉంటాడు. ఆయనకి చావుభయం కూడా ఎక్కువే.

భగవంతరావుకి ఏ విషయంలోనూ అభిప్రాయాలంటూ లేవని ఆయన భార్యాపిల్లల నమ్మకం. పూర్వజన్మలో చేసుకున్న పాపంవల్ల ఈ జన్మలో ఈయనతో ఇలా అనుభవిస్తున్నానని ఆయన భార్య ఎప్పుడో నమ్మకంగా సర్దిచెప్పుకుంది. కర్మసిద్ధాంతం-కొన్ని విషయాల్లో నులివెచ్చగా ఉంటుందిమరి.

రామానుజంతో వియ్యం అందుకోవడం ఆయనకి నచ్చింది. ఛాయ ఆయనకే కాకుండా ఆ ఇంట్లో అందరికీ నచ్చింది. మంచి ఎత్తు, ఎత్తుకు తగ్గ లావు, పెద్ద ముక్కు, గుండ్రని మొహం, చక్కని పలువరస... ఆమెని కోడలిగా స్వీకరించడానికి భగవంతరావు వెంటనే ఒప్పుకున్నాడు. ఆయన కొడుక్కి కూడా నచ్చింది. కట్నకానుకలకింద ముప్పైవేల రూపాయలు, పదికాసుల బంగారం పెట్టడానికి బేరం కుదిరింది. భగవంతరావు సంతోషించాడు.

బంధువులతో సత్సంబంధాలు లేకపోవడంవల్ల ఎక్కువమంది పెళ్ళికి రాలేదు. వాళ్ళొచ్చిన పెళ్ళిబస్సులో సగం ఖాళీగానే ఉంది. విడిదింటిముందు బస్సు దిగి కుటుంబ సభ్యులు, ఐదారుగురు దగ్గరి బంధువులతో లోపలికి వెళ్ళాడు భగవంతరావు. ఇల్లు బాగానే ఉంది. ముందు ఆవరణ, వెనక పెరడు.

పెరట్లో స్నానం చేసొచ్చి, ఆ రాత్రి వియ్యంకుడు ఇవ్వబోయే డబ్బుకట్టలు, బంగారం గురించి ఊహించుకుంటూ భార్యకి స్నాతకానికి సంబంధించిన సూచనలు, సలహాలు చెప్పేసి బైటికి వచ్చాడు. అప్పటికే రఘురాం ఆయనకోసం ఎదురుచూస్తున్నాడు.

"మీరు భగవంతరావుగారు కదూ!" అడిగాడతను. సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలీక.

"అవును..."

"రామానుజంగారి అమ్మాయికి మీ అబ్బాయికి ఈ రాత్రికి పెళ్ళనుకుంటాను...!"

"అవును..."

"మా ఊరి మాజీ సర్పంచ్ కాళీప్రసాద్‌గారు మిమ్మల్నోసారి పిలుచుకురమ్మన్నారు''

"నాతో ఏంపని? ఇక్కడ పెళ్ళిపనులు చూసుకోవద్దూ'' అన్నాడు భగవంతరావు ఆశ్చర్యంగా. పెళ్ళి హడావుడిలో కొంచెం మరుగున పడిపోయిన భయం ఆయనలో మళ్ళీ ప్రవేశించింది.

"ఏదో మాట్లాడాలిట. మిమ్మల్ని తీసుకురమ్మన్నారు. ఎంతా ఒక్క అరగంట... అంతే''

"సరే... పదండి''

"కాళీప్రసాద్ వీళ్ళకోసమే డాబామీద ఎదురుచూస్తూ కూర్చున్నాడు. భగవంతరావుని పరిచయం చేసుకుని, తనగురించి క్లుప్తంగా,




# ఏరిన ముత్యాలు

★ యుద్ధాన్ని నిరోధించే యుద్ధాన్ని గురించి ఎవరయినా మాట్లాడితే వారిని వెంటనే వెళ్లి ఆ యుద్ధంలో చేరమనండి. నా అనుభవంవల్ల యుద్ధం అంటే నాకు అసహ్యం కలిగింది. దానివల్ల ఏసమస్యా పరిష్కారం కాదు.

**— ఐసెన్‌హోవర్**

★ ఉత్సాహం అగ్నిపర్వతంలాంటిది. ఏ సందేహం దానిపై మొలవదు.

**– ఖలీల్‌జిబ్రాన్**

★ సంతోషాన్ని కొనుక్కోలేవు. దానిని నీవు కష్టపడి గడించుకోవాలి.

**— హెచ్.జి.హావెన్**

★ సంతోషాన్ని మించిన సౌందర్యపోషక వస్తువు మరొటి లేదు.

**— లేడీబ్లెస్సింగ్‌టన్**

★ మానవుల దుర్మార్గాలను చూసి నాకెప్పుడూ ఆశ్చర్యం కలగదు. కానీ వారు అందుకు సిగ్గుపడకపోవడం చూసి ఆశ్చర్యం కలుగుతుంది.

**-స్విఫ్ట్**

★ నువ్వు సుఖంగా బతుకు. పరులను సుఖంగా బతకనీ. ఇంతకంటే సరళమైన సూత్రం మరొకటి లేదు.

**- సర్.ఆర్.లెస్ట్రేంజ్**

★ స్వల్పధనంతో సుఖపడటం మీకు తెలియకపోతే, అపారమైన ధనం కూడా మిమ్మల్ని సుఖపెట్టలేదు.

**- అజ్ఞాత్**

★ ఒక కష్టం తరువాత వచ్చే సుఖమే నిజమైన సుఖం. నిజమైన సుఖం కష్టానికి అవతలి తీరంలోనే ఉంటుంది. దాన్ని అనుభవించాలంటే ముందుగా కష్టపడాలి.

**- జాన్ ఫాస్టర్**

★ మనం పూర్తిగా సుఖపడలేకపోవటానికి అవరోధం ఒక్కటే. మనకు ఉన్నదానిపై నిర్లక్ష్యం, లేనిదానిపై ఆరాటం.

**- రియో**

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

నవంబర్ చతుర నవల అజ్ఞాతవాసం

సమీక్షకుని పేరు : ..........

చిరునామా : ..........

సూటిగా మూడుమాటల్లో చెప్పుకుని స్వీటూ, హాటూ, ఫ్రిజ్‌లోంచి కూల్‌డ్రింక్ తెప్పించి అస లువిషయంలోకి నేరుగా దిగిపోయాడు.

"మీ అబ్బాయి ఏంచేస్తుంటాడు?"

"గవర్నమెంట్ ఉద్యోగం. నెలకి రెండున్న రవేలు వస్తుంది''

"కట్నం ఎంత తీసుకుంటున్నారు?"

"ఏదో కొంచెం..." అన్నాడు భగవంతరావు కట్నంగురించి ఆయనకి చెప్పడం ఇష్టంలేక.

"చెప్పండి.. ఫర్వాలేదు. యాంటీ డౌరీ చట్టంకింద పోలీసులు అరెస్టు చేయడం అనేది సినిమాల్లో తప్ప జరగదు. నాదగ్గర మొహ మాటం ఎందుకు?"

"ముప్పైవేలు, పదికాసుల బంగారం"

"మీవాడికి యాభైవేలు, ఇరవైకాసుల బంగారం ఇప్పించే పూచీ నాది''

"మీరు ఇప్పించొచ్చు. నేను తీసుకోవచ్చు గాని... పెళ్ళికి ఒప్పుకుని ఇంతదూరం వచ్చాక..." నసిగాడు భగవంతరావు భయంభయంగా.

"ఇప్పటికీ మించిపోయిందేంలేదు.. ఇంకా పెళ్ళి కాలేదుగదా. అయినా భగవంతరావుగా రూ! పెళ్ళి చేసేముందు అవతలివాళ్ళ వంశ చరిత్ర మొత్తం లాగాలి. మీరాపని చేసినట్టులే దు''

"రామానుజంది మంచి కుటుంబం. ఆచారా లు, సంప్రదాయాలమీద గౌరవం ఉన్న కుటుంబం. ఆయన చాలా మంచివాడని చె ప్పారు''

"కాని మీ కాబోయే కోడలి గురించిమాత్రం మీరు తెలుసుకోలేదు''

"ఛాయ గురించా?"

"అవును''

"శీలవతి కాదనా?"

"శీలవతే... ఆ విషయంలో ధోకా ఏంలేదు. కాని మీవాడితో ఎన్నాళ్ళు కాపురం చేస్తుందో చెప్పలేం. ఏంట్రా రఘురాం అది... ఆ మాట... ఏదో ఇస్టు అంటారు''

"ఫెమినిస్టు'' చెప్పాడు రఘురాం.

"అంటే...?" అడిగాడు భగవంతరావు అయోమయంగా.

"ఆడవాళ్ళకి స్వేచ్ఛ, సమానత్వం కావా లని. అరిచేవాళ్ళు''

"అది నాకు నచ్చదు. ఆడదంటే ఇంట్లో చాకిరీ చెయ్యడం, ఇంటికి కాపలా ఉండటం తప్ప ఇంకో పని చెయ్యకూడదు'' అన్నాడు భగవంతరావు.

"సరిగ్గా నేనూ అదే చెప్పదల్చుకుంది. కాలేజీలో ఉన్నప్పుడు ఎప్పుడూ సభలు, సమా వేశాల్లోనే తిరిగేది. పోలీస్‌స్టేషన్‌కి కూడా వెళ్ళొ చ్చింది. కావాలంటే అప్పటి యస్.ఐ.ని పిలిపిస్తాను. మీరే కనుక్కోండి''

"అహఁ..."

"పైగా నా అంతటివాడితో తగాదా. తిరు గుబాటు... వాళ్ళ ఖాళీస్థలం అన్యాయంగా ఆక్రమించుకున్నానని లాయర్‌నోటీసు ఇప్పించింది. మనుషులు లేకా కాదు. గుణ పాఠం చెప్పలేకా కాదు ఊరుకుంది. పోనీలే ఏదో ఆడముండని..."

భగవంతరావు ఆలోచనలో పడిపోయాడు. ఆయనకి డబ్బు, పలుకుబడి ఉన్నవాళ్ళంటే భయంతోపాటు వాళ్ళకి సాధ్యమైనంతవరకు దూరంగా ఉండాలి. వాళ్ళేదన్నా చెబితే ఎందుకు ఏవిటని ప్రశ్నించకుండా చేసెయ్యాల నే నిర్ణయానికి కట్టుబడి బతుకుతున్నాడు. ఈ రాత్రికి అలా డబ్బొచ్చి ఒళ్ళో పడుతుందను కుంటే కథేమిటి అడ్డుతిరిగింది? అనుకున్నాడు భగవంతరావు. అయినా ఇది మనమంచికోస మే కావచ్చు. ఆయనకి కాశీప్రసాద్ చె ప్పిందాంట్లో పోలీసులు, మనుషులు అనే మాటలు బాగా భయపెట్టాయి.

"నేనివన్నీ ఎంక్వైరీ చెయ్యలేదు''

"ఇప్పటికీ మునిగిపోయిందేంలేదు. ఈ ఊళ్ళో ఎవర్ని అడిగినా అమ్మాయి గురించి

చెబుతారు. ఈ సంబంధం చేసుకుని కావాలని కష్టాల ఊబిలో దిగిపోతారో, మంచి సంబంధం కుదుర్చుకుని సుఖంగా ఉంటారో తేల్చుకోండి''

"కాని పెళ్ళికి వచ్చాక వెనక్కి పోవడం బాగుండదు'' ఆఖరి ప్రయత్నంగా నసిగాడు భగవంతరావు.

"ఈ దిక్కుమాలిన సెంటిమెంట్‌కంటె మీ అబ్బాయి భవిష్యత్తు మీకు ముఖ్యం. తెల్లార్లూ సభలూ సమావేశాలూ, పోలీస్ స్టేషన్‌చుట్టూ తిరిగే కోడలివల్ల తలనొప్పి తప్ప ఉపయోగం ఉండదు. ఏదో మీ మంచికోరి ఈ నాలుగుమాటలు చెప్పాను తప్ప పెళ్ళి చెడగొడితే నాకొచ్చే లాభం ఏమీలేదు... ఏమంటారు?"

భగవంతరావు తలూపాడు.

"మీకు నా మాటలమీద నమ్మకం లేకపోతే ఎంక్వైరీ చేసుకోండి. దానికి నేను సిద్ధం. అసలు ఈ సంబంధం చెడిపోయినందుకు తర్వాత మీరే ఆనందిస్తారు... ఏరా రఘురాం?"

"అవునవును... అప్పుడెప్పుడో పట్నంలో వరకట్నం హత్య జరిగితే ఛాయ, ఆ పిల్ల స్నేహితురాళ్ళు కరపత్రాలు వేసి, వీధుల్లో ఊరేగింపుతీసి నానా హడావుడి చేశారు. పోలీసులు పట్టుకెళ్ళి ఒకరాత్రంతా స్టేషన్‌లో ఉంచేశారు. అదంతా పేపర్లలో వచ్చిందికూడా..." అన్నాడు రఘురాం భగవంతరావు మొహంలోకి చూడకుండా.

"రాడికల్స్‌తో సంబంధాలున్నాయని అప్పట్లో పుకారు వచ్చింది. అది నిజమో కాదో గాని... అమ్మాయిని చేసుకుంటే మీరు పెద్ద ఇరకాటంలో పడిపోవడంమాత్రం ఖాయం. ఇదే నేను చెప్పదల్చుకుంది''

"మేం ఊబిలో దిగకుండా ముందే హెచ్చరించారు. థాంక్స్'' అన్నాడు భగవంతరావు లేస్తూ.




ఆయన విడిదింటికి వెళ్ళగానే భార్యని, కొడుకుని ఇవతలికి కేకేసి కాళీప్రసాద్ చెప్పిన మాటల్ని పూసగుచ్చినట్టు వివరించాడు. దాంతో వాళ్ళు భయపడిపోయారు.

"ఊళ్ళో పెద్దాళ్ళతో తగాదాలు పెట్టుకుని, ఇల్లుపట్టకుండా వీధుల్లో తిరిగేదానితో నేనేం సుఖపడతాను, వీడేం ఆనందిస్తాడు?" అందావిడ.

కొడుకు కూడా అలాగే మాట్లాడాడు. అతనికి కొత్త సినిమాల వీడియోకాసెట్లు, పదకొండు ఛానెల్స్‌లోనూ టీవీ చూడటం, పుస్తకాలకి, ఆశయాల అంతర్జ్వాలలున్న మిత్రులకి దూరంగా ఉండటం, డబ్బున్న మిత్రులకు విధేయంగా ఉండటం తప్ప ఏమీ తెలీదు. అతను మూత బిగించిన సీసాలా, మూసేసిన గదిలా శూన్యంగా ఉంటాడు.

అరగంట తర్వాత 'పెళ్ళివారి బస్సు' వెళ్ళిపోయింది.



పెళ్ళివారి బస్సు వెళ్ళిపోయిందని, విడిది గృహం ఖాళీ అయిందనే వార్త రామానుజంకి క్షణాల్లో తెలిసిపోయింది.

"ఏం వచ్చింది పోయేకాలం? ఇలా అర్థాంతరంగా, హఠాత్తుగా మాయమైపోయారు?" అంది రామానుజం భార్య ఆక్రోశంగా.

ఆవిడ ప్రశ్నకి ఎవరూ జవాబు చెప్పలేదు. రామానుజం విడిదిగృహానికి వెళ్ళి ఖాళీగా వున్న ఇంటిని చూసి తిరిగి వస్తుంటే వీధిమలుపులో నారయ్య హఠాత్తుగా ప్రత్యక్షమై రెండుముక్కల్లో ఏం జరిగిందో చెప్పి వెళ్ళిపో

యాడు. దాంతో రామానుజానికి ఎక్కడలేని కోపం వచ్చింది. ఆ మాటే వచ్చి ఇంట్లో చెప్పాడు.

"వాడి కాష్టంకాల... పిల్ల పెళ్ళి చెడగొడతా డా? వాడికిమాత్రం ఆడపిల్లలు లేరా, వాళ్ళకి పెళ్ళిళ్ళు చెయ్యడా? ఇంత అన్యాయం చేస్తే పైన భగవంతుడున్నాడు. వాడు చూస్తాడు'' అందావిడ.

రామానుజం ఏం మాట్లాడకుండా వెళ్ళి బైట బల్లమీద పడుకున్నాడు. పురోహితుడు, భజంత్రీలవాళ్ళు, పెళ్ళికి వచ్చిన బంధువుల్లో ఎక్కడలేని నిరుత్సాహం వచ్చింది. ఆ రాత్రి ఎవరూ సరిగ్గా భోజనాలు చెయ్యలేదు. రామానుజం భార్యమాత్రం తెల్లార్లూ తిడుతూనే వుంది.

"నువ్వేం బాధపడకే ఛాయా... వెన్నెముక లేని మనుషులతో కలిసి బతకడంకంటె వాళ్ళ కి దూరంగా ఉండటమే మంచిది. ఏమంటావ్?" అంది భవాని.

ఛాయ ఏం మాట్లాడలేదు.

"పెళ్ళి తప్పిపోయినందుకు నీకూ బాధగానే ఉన్నట్టుంది''

"తప్పిపోయినందుకు కాదు... ఎవరో ఏదో చెబితే అది విని పారిపోయినవాళ్ళ గురించి''

"ఎందుకైనా మంచిది, నువ్వు కొంచెం జాగ్రత్తగా ఉండు. లాయర్ నోటీసు ఇప్పించావని కాళీప్రసాద్ కక్షకట్టాడు. అందుకే పెళ్ళి చెడగొట్టాడు. ఏం తోచకపోతే నాదగ్గరికి రా... వాడికి గుణపాఠం ఎలా చెప్పాలో నాకు తెలుసు''

"ఎందుకూ లేనిపోని గొడవ?"

"వాడి పాపాన వాడే పోతాడనే కర్మ సిద్ధాంతానికి వచ్చావా? అలా పోయేటట్లయితే ఈ ప్రపంచం ఇలా ఉండేది కాదే పిచ్చిదానా... ఏం బాధపడకుండా హాయిగా ఉండు. మిగతా కథ నేను నడిపిస్తాను'' చెప్పింది భవాని భరోసాగా.

మర్నాడు ఉదయం ఛాయ బస్టాండ్‌కి వెళ్ళి మిత్రురాలిని బస్సెక్కించింది.

"అక్కడే ఉన్న రఘురాం వాళ్ళని చూసి నవ్వాడు.

★ ★ ★

అది ఏప్రాంతమో తెలీదు.

తమ నగరానికి, తాము ఇప్పుడు నడుస్తున్న ప్రాంతానికి మధ్య ఎంతదూరం ఉందో తెలీదు.

పచ్చపచ్చని అడవి, ఎటు చూసినా రకరకాల పేర్లు తెలీని చెట్లు, రకరకాల రంగు రంగుల పూలు, పూలగుత్తులు, రాళ్ళురప్పలు, అక్కడక్కడ చదునైన ప్రదేశాలు, అప్పుడప్పుడు అడవి జంతువులు దూరంగా కనిపించి అదృశ్యమైపోవడం, సన్నని కాలిబాటలు, నిశ్శబ్దగీతంలా నిర్లిప్తంగా సాగుతున్న వాగులు, వంకలు, పచ్చపచ్చని లోయలు, కొండలు, గుట్టలు, పక్షుల కిలకిలా రావాలు, కోతుల కిచకిచలు... పొదలు, ముళ్ళపొదలు, వంటచెరకుకోసం కొమ్మల్ని నరుకుతున్న గిరిజనుల గొడ్డళ్ళ చప్పుళ్ళు...

వాహనాల శబ్దాలు వినిపించడంలేదు.

అంతా నిర్మానుష్యంగా కొంచెం భీతావహంగా, కొంచెం అందంగా, నునులేత, చిక్కని, చక్కని రంగుల్లో చిత్రీకరించిన అద్భుతమైన చిత్రపటంలా ఉంది.

భుజాలమీద వంటసామగ్రితో ముందు ఇద్దరు తీవ్రవాదులు, వెనక ఇద్దరు, వాళ్ళమధ్య ఐదుగురు రచయితలు...

ఆ రచయితలు ఉస్సురంటూ, అస్సురంటూ, చెమటలు తుడుచుకుంటూ నడుస్తున్నారు. వాళ్ళకి కాళ్ళు పీకుతున్నాయి. నీరసంగా, నిస్సత్తువుగా ఉంది. మాటిమాటికి దాహం వేస్తోంది. ఈ ప్రస్థానానికి ముగింపు ఎప్పుడో, ఎక్కడో అర్థంకావడంలేదు.

ఏదోక్షణంలో అలా నడుస్తూనే నిద్రలోకి జారిపోవడమో, తూలి నేలమీద కూలిపోవడమో జరుగుతుందని భయపడుతున్నారు.



"అయిపోయింది కామ్రేడ్స్... ఇంకెంతో దూరం లేదు. మరో అరమైలు నడిస్తే చాలు. మా స్థావరం చేరుకుంటాం" అన్నాడు పులకేశి ఆగి వాళ్ళవైపు చూస్తూ ఓదార్పుగా.

"ఏం నడకో... ఏవిటో... ఎప్పుడో చిన్నప్పుడు మా ఊరికి మూడుమైళ్ళదూరంలో ఉన్న హైస్కూలుకి వెళ్ళడానికి నడిచేవాణ్ణి. ఇప్పుడు పక్కవీధికి వెళ్ళాలన్నా స్కూటర్‌మీదే వెళ్తున్నాను'' అన్నాడు హాస్యరచయిత పరబ్రహ్మం.

"మేం అడవుల్లో, కొండల్లో, గుట్టల్లో మైళ్ళకి మైళ్ళు ఆకలీ, దప్పికా కూడా మరిచిపోయి నడుస్తాం" చెప్పాడో తీవ్రవాది.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

"తెల్లారుజామునే నిద్రలేవడం, నడకకి అలవాటు పడటం, ఎప్పుడూ అప్రమత్తంగా ఉండటం మా జీవితంలో చాలా ముఖ్యం" కొంచెం అనునయంగా అన్నాడు పులకేశి.

"నేను పొద్దున ఎనిమిది గంటలలోపు నిద్రలేవను. లేవగానే బెడ్‌కాఫీ కావాలి''

"ఇక్కడ కూడా ఆ ఏర్పాట్లు చేస్తాంలెండి! డోన్ట్‌వర్రీ... నడవండి. దగ్గరికి వచ్చేశాం"

సూర్యాస్తమయం కాబోతోంది.

సూర్యకిరణాలు పొడుగాటి చెట్లమీద పడి చెదురుతున్నాయి. దూరంగా ఉన్న కొండ బంగారు పూత పూసినట్టు మెరుస్తోంది. పక్షులు, పిట్టల హడావుడి ఎక్కువైంది.

ముందు మెటడోర్ వాన్‌లో కొంతదూరం, తర్వాత రెండుకార్లు, ఆ తర్వాత సగంలోడున్న ఒక లారీలో తీసుకొచ్చి అడవి మధ్యలో దించారు. అటు తర్వాత ఎక్కడినుంచో వంట సామగ్రి, బియ్యం, కందిపప్పు, కూరలు, నూనె, చింతపండు వగైరా తీసుకొచ్చారు. ఆరోజు పగలు ఏదో గూడెంకి కొంచెందూరంలో వంట



చేసి భోజనాలు ఏర్పాటుచేశారు. రెండు గంటలు విశ్రాంతి. మళ్ళీ నడక...

ఎక్కడున్నా పోలీసులుగాని, ఐటిడిఏ ప్రాజెక్టు సిబ్బందిగాని గిరిజనుల సంక్షేమం కోసం కృషిచేసే స్వచ్ఛంద సంస్థల వాలంటీర్లుగాని కనిపిస్తారేమోనని రచయితలు ఎదురుచూశారుగాని ఎక్కడా ఎవరూ కనిపించలేదు

"ఈ రాత్రికి మన మజిలీ ఇక్కడే'' ప్రకటించాడు పులకేశి ఒకచోట ఆగి.

ఆ ప్రదేశం నలుచదరంగా ఉంది. చుట్టూ చెట్లు, ఒకవైపు చిన్న గుట్ట. రచయితలు తమ చేతుల్లోని సూట్‌కేస్‌లు కిందపెట్టి వళ్ళు, వేళ్ళు విరుచుకుని చతికిలపడ్డారు. పులకేశి వాళ్లకి నీళ్ళక్యాన్ అందించాడు. అందరూ ఆత్రంగా తాగారు.

"దగ్గర్లో ఏదో వాగు ఉన్నట్టుంది'' అన్నాడు నాగార్జున నీళ్ళశబ్దం వింటూ.

"ఉంది'' అన్నాడో నక్సలైట్.

"స్నానాలు చేయదల్చుకున్నవాళ్లు చెయ్యొచ్చు... బట్టలూ అవీ తెచ్చుకున్నారుగదా''

"తెచ్చుకున్నాం"

"ఒక్కొక్కరే వెళ్ళండి... అందరూ ఒకేసారి వెళ్ళొద్దు..." హెచ్చరించాడు పులకేశి.

"ఎందుకు?" అడిగాడు గురుదేవ్.

"వివరణలు అడగొద్దు... చెప్పింది చెప్పినట్టు చెయ్యండి''

పరబ్రహ్మం సూట్‌కేసు తెరిచి. టవల్, లుంగీ తీసుకునివెళ్ళాడు.

"మా పట్నానికి ఎంత దూరంలో ఉన్నాం?" అడిగాడు కిశోర్‌కుమార్.

"సుమారు రెండొందల కిలోమీటర్లు''

"ఇక్కడికి దగ్గర్లో ఏదైనా టౌన్ ఉందా?"

"లేదు... కనీసం ఎనభైకిలోమీటర్లు వెళ్తే

తప్ప రాదు''

"పోనీ గూడెం?"

"లేదు. అడవిలో అడుగుపెట్టి పన్నెండు గంటలు కాలేదు. అప్పుడే పారిపోవడానికి ప్లానేస్తున్నారా?"

"అబ్బే అదేంలేదు... ఊరికే తెలుసుకుందామని అడిగాను'' అన్నాడు కిశోర్‌కుమార్ గాభరాగా.

"అన్ని వివరాలు మీకు చెప్పం... కొన్ని కొన్ని మీకే తెలుస్తయ్. తెలీకపోతే వదిలెయ్యడమే''

పరబ్రహ్మం స్నానంచేసి లుంగీకట్టుకుని తువ్వాలుతో చెవులు తుడుచుకుంటూ వచ్చాడు. స్నానంచేస్తూ చుట్టూ నిశితంగా పరిశీలించాడుగాని ఎక్కడా మనుషుల జాడ కనిపించలేదు. ఇదేదో పెద్ద పథకం ప్రకారమే తీవ్రవాదులు తమని కిడ్నాప్ చేశారని వాళ్లు దిగవిడిస్తే తప్ప విముక్తి లేదని అనుకున్నాడు. తర్వాత నాగార్జున స్నానానికి వెళ్ళాడు.

మిగతా ముగ్గురు రచయితలు స్నానాలు చేసివచ్చారు. కిడ్నాప్ చేసేముందే నక్సలైట్లు చెప్పారు వాళ్ళతో, అన్ని వస్తువులూ బట్టలూ తెచ్చుకోమని. సూట్‌కేసుల్లోంచి దుప్పట్లు తీశారు.

అంతలో వంటపూర్తయింది.

పల్చటిపప్పు, ఉడికీ ఉడకని కూర, చారు.

రచయితలకి వాళ్ళ ఇళ్ళల్లో భోజనాలు, డైనింగ్ టేబుళ్లు సీలింగ్ ఫ్యాన్లు, సింకులు గుర్తువచ్చాయి.

"పొద్దున్న, ఇప్పుడు కూడా శాఖాహార భోజనమే, రేపు మాంసాహారం ఏర్పాటుచేద్దాం" అన్నాడు పులకేశి నవ్వుతూ.

ఎవరూ ఏం మాట్లాడకుండా తినేసి దుప్పట్లు పరుచుకున్నారు.

"ఈ అడవిలో పులులున్నాయా?" అడిగాడు కిశోర్‌కుమార్, ఇంట్లోని డబుల్‌కాట్ బెడ్, ఎయిర్‌కూలర్ తలుచుకుంటూ భయంభయంగా.

"లేవు. రెండో మూడో చిరతపులులున్నయ్''

"ఎలుగులు...?" "ఎలుగులున్నా పరవాలేదు. ఏం చెయ్యవు'' అన్నాడు గురుదేవ్.

పులకేశి నవ్వాడు.

"చిరతలు, పులులైనా మనిషిని వదిలేస్తయ్ గాని ఎలుగులు ఒకపట్టాన వదలవు. అవి చాలా ప్రమాదకరం. చెట్లు కూడా ఎక్కుతయ్. అయినా అడవుల్లోని క్రూరజంతులేవీ దుష్టులైన మనుషులంత ప్రమాదకరమైనవి కాదు''

"మీ దగ్గర ఆయుధాలున్నయ్‌గదా. మాకేం దిగుల్లేదు'' అన్నాడు కిశోర్‌కుమార్ పడుకోవడానికి ఉపక్రమిస్తూ.

క్షణాలు మెల్లిగా దొర్లుతున్నాయి.

దూరంగా అడవిజంతువుల అరుపులు తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. రచయితలు ఊరికే పడుకున్నారేగాని వాళ్ళలో ఎవరికీ నిద్రపట్టలేదు. చుట్టూ చెట్లు, అడవిజంతువులు, పాములు తేళ్ళ మధ్య నిర్భయంగా నిద్ర ఎలా పడుతుంది? ఒక రకమైన అభద్రతాభావం వాళ్ళని పీడిస్తోంది. ఎన్నిరోజులు ఇలా ఉండాలో, ఈ భయానకమైన క్షణాల్ని ఎలా దొర్లించాలో అర్థం కావడంలేదు.

తీవ్రవాదులు అతని ఇంటికి వెళ్ళి నిన్ను కిడ్నాప్ చేస్తున్నాం అని చెప్పినప్పుడు అతను భయపడలేదుగాని బోళ్ళంత ఆశ్చర్యపడ్డాడు. వాళ్ళమీద జాలిపడ్డాడు. హాస్యం పేరుతో ఏవో రచనలు చేసే తనతో నక్సలైట్లకేం పని? తనకో సిద్ధాంతంగాని, స్థిరమైన అభిప్రాయాలుగాని దేన్ని గురించీ లేవు. ఒక పత్రికలో 'హ్యూమర్, హ్యూమర్' శీర్షికా, ఇంకో పత్రికలో 'హాస్యప్రహసనం' అనే శీర్షికా నిర్వహించడం, అప్పుడప్పుడు కథలు, నవలలు రాసుకోవడం తప్ప తను చేస్తున్నదంటూ ఏంలేదు.

ఇన్‌స్టెంట్ రచయిత కిశోర్‌కుమార్ పరిస్థితి కూడా అంతే. అర్ధరాత్రి శత్రువు, లాస్ట్‌వా




ర్నింగ్, మిస్టర్ ఎక్స్... చీకట్లో చేమంతి లాంటి నవలలు రాసుకునే తనతో వీళ్లకేం పని? చూస్తుంటే వీళ్ళకసలు బుర్ర లేనట్టు కనిపిస్తోంది.

ఏదో సామాజికమైన ఆదర్శంకోసం, లక్ష్యంకోసం త్యాగాలు చేసే నక్సలైట్లకి తన లాంటివాడితో పని ఏవిటో ఏం అర్థం కావ డంలేదు.

తల విదిలించి నిద్రకుపక్రమించాడు తను.

చెట్లకొమ్మలు, ఆకుల మధ్యలోంచి కని పిస్తున్న నక్షత్రాలవైపు చూస్తూ నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్న గురుదేవ్ సాహితీ వ్యాపారి, చిన్నసైజు పబ్లిషర్.

అన్ని జిల్లా గ్రంథాలయ సంస్థల వారితో సన్నిహిత సంబంధాలున్నాయి. కథా, కవితా సంకలనాలు అచ్చేసి వాళ్ళకి విక్రయిస్తూఉంటా డు. తరచు ఏదో ఒక సాహితీ ప్రకటనతో పత్రికల్లో కనిపిస్తూవుంటాడు.

సిటీలో ప్రముఖులు, డబ్బున్నవాళ్లు, వ్యా పారుల దగ్గరనించి, అందులో ముఖ్యంగా తమ పేర్లు పేపర్లలో, కరపత్రాల్లో చూసుకోవా లనే తహతహ ఉన్నవాళ్ల దగ్గర్నించి విరాళాలు వసూలుచేస్తాడు. వాళ్ళని ప్యాట్రర్లుగా ఆర్భా టంగా ప్రకటించి డబ్బు మిగుల్చుకుంటాడు.

నక్సలైట్లు కిడ్నాప్ చేశార్మగాబట్టి తనకి బోల్లంత పబ్లిసిటీ వస్తుందనీ, దీన్ని కూడా తన సాహితీ వ్యాపారానికి పెట్టుబడిగా పెట్టుకోవ చ్చుననీ గురుదేవ్ అవధుల్లేకుండా ఆనందించా డు.

అయితే నాగార్జున వీళ్ళలాంటి వాడుకాదు. అతనికి ప్రాచీన సాహిత్యం అంటే ఎందుకో తగని ఇష్టం. ముఖ్యంగా చారిత్రక సంఘటన లు. వాటిని చిలవలు పలవలు చేర్చి కల్పితగా థల్లా రాస్తాడు. ఆర్యులు, ద్రావిడుల గురించి అతను రాసినవేవీ చారిత్రకమైనవి కాదు.

నాగార్జున ఎవరితోనూ ఎక్కువగా మాట్లా డడు. సాయంత్రం వేళల్లో గ్రంథాలయానికి వెళ్ళి చదువుకోవడం అతని అలవాటు. ఎక్కు వగా సినిమాలు చూడడు. నిశ్శబ్దంగా తనపని తాను చూసుకుంటూ, నిర్లిప్తంగా జీవితం గడి పే మధ్యతరగతి సాధారణ మానవుడు.

ఏ రకమైన ఆలోచనలు, భయం, అభద్రతా భావం లేకుండా ఉన్నవాడు ఒక్క వివేకానంద మాత్రమే. అతని 'ఆశయం' వేరు. అంతా తను అనుకుంటున్నట్టే జరుగుతుందో లేదో అనే అనుమానం పీడిస్తోందిగాని 'ప్రయత్నం పురుషలక్షణం' కాబట్టి ప్రయత్నం చేయాలనే దృఢనిర్ణయానికి ఎప్పుడో వచ్చాడు. పైగా ఇలాంటి అవకాశం ఇంటికొచ్చి తలుపు తడు తుందని ఎన్నడూ అనుకోలేదు.

అందువల్ల అతనొక్కడే నిశ్చింతగా నిద్రపో తున్నాడు.

తూర్పున తొలిచుక్క పొడిచింది.

★ ★ ★

నక్సలైట్లు వివేకానందని తీసుకెళ్లిన తర్వాత సుమతికి ఏం చెయ్యాలో తోచలేదు. చాలా సేపు మౌనంగా, నిర్లిప్తంగా శరీరంలో సగ భాగం కోల్పోయిన దానిలా అలాగే గుమ్మం దగ్గర నిలబడిపోయింది.

చుట్టూ చీకటి, దూరంగా వీధిలైట్లు, ఎక్క డో ఒక కుక్క అరుపు, నిర్మానుష్యంగా ఉన్న వీధివైపు చూస్తూ ఏం ఆలోచించాలో కూడా తెలీని పరిస్థితిలో నిలబడిపోయింది. వివేకా నందని మళ్ళీ తీవ్రవాదులు భద్రంగా అప్పగి స్తారనే నమ్మకం ఉన్నా లోలోపల ఎక్కడో మనసు పొరల్లో కీడు తలపెడతారేమోననే అనుమానం కూడా ఉంది.

మనసులో ముసురుకున్న ఆలోచనల్ని శుద్ధిచేసి, తలుపేసి లోపలికి వెళ్ళిపోదాం అనుకుంటుండగా మెట్లమీద అడుగుల చప్పు డు వినిపించింది. ఆమె కొంచెం అనుమా నంగా, మరింత ఆశ్చర్యంగా చూస్తుండగానే గోపీనాథ్ గుమ్మంముందు ప్రత్యక్షమయ్యాడు, సిగరెట్ పొగతోసహా.

"ఏవిటక్కా... ఇంకా నిద్రపోలేదా?"

"లేదురా''

"బావగారు సుఖంగా నిద్రిస్తున్నారా? కాగితాలు ఖరాబు చేస్తున్నారా?"

"ఆయన ఇంట్లో లేరు"

"నిన్నోమొన్నో ఊరికెళ్తానన్నారు. వెళ్ళారా ఏవిటి?"

"ఆయన్ని తీవ్రవాదులు తీసుకెళ్ళారు"

"నక్సలైట్లా... ఎప్పుడు?".

"ఒక అరగంట అవుతుందేమో. అందుకే నేనింకా నిద్రపోలేదు"

"ఎంతమంది వచ్చారు?"

"నలుగురు.. వ్యానులో ఎక్కించుకుని తీసుకెళ్ళారు"

"కథలు రాసుకునేవాడితో వాళ్ళకేం పని?"

"ఏమో..."

"ఇప్పుడేం చేద్దాం?" అడిగాడు గోపీనాథ్ విప్పిన బూట్లు మళ్ళీ వేసుకుంటూ.

"ఆలోచిద్దాంగాని నువ్విప్పుడు ఎక్కడికీ వెళ్లకు. నేనసలే భయపడిచస్తున్నాను"

"ఎక్కడికీ వెళ్ళకుండా చేతులు ముడుచుకుని ఇంట్లో కూర్చోమంటావా? పోలీసులికి చెప్పొస్తాను"

"ఇంత రాత్రివేళా?"

"రాత్రీలేదు... పగలులేదు. ఎప్పుడైనా చెప్పొచ్చు"

"అనవసరం" అంది సుమతి ఖండితంగా.

"వాళ్ళయితే వైర్‌లెస్ మెసేజ్ పంపించి ఆ వ్యాను ఎక్కడున్నా పట్టుకుంటారు"

"అనవసరం. పోలీసులు కనిపించగానే నక్సలైట్లు కాల్పులు జరుపుతారు. వాళ్లు ఎదురుకాల్పులు జరుపుతారు. మధ్యలో ఈయన ప్రాణానికి ముప్పు వస్తుంది. ఆ పిచ్చిపని మాత్రం చెయ్యకు"

"మరేం చేద్దాం?"

"శుభ్రంగా, సుఖంగా నిద్రపో. రేప్పొద్దున ఆలోచిద్దాం" అంది.

గోపీనాథ్ ఏదో ఆలోచిస్తూ మళ్ళీ బూట్లు విప్పేసి బాత్‌రూంకెళ్లి కాళ్లూ, చేతులు, మొహం కడుక్కుని లుంగీలోకి మారి తన పడగ్గదికి వెళ్ళాడు. అతను పదోతరగతిలో లెక్కల్లో తప్పాడు. తర్వాత రెండుసార్లు ఆ పరీక్ష రాశాడుగాని ఆ రెండుసార్లు కూడా తప్పాడు. దాంతో విద్యావైరాగ్యం పుట్టుకొచ్చి చదువుకోవడం మానేసి టాక్సీడ్రైవింగ్ నేర్చుకున్నాడు. ఆ శిక్షణాకాలంలో అతనికి వందేళ్ళ రాజకీయచరిత్ర గల పార్టీ కార్యకర్తలతో స్నేహం ఏర్పడింది. అయితే అతనికి ఉద్యోగం ఇచ్చింది మాత్రం పన్నెండేళ్ళ చరిత్ర ఉన్న పార్టీ నాయకుడు. దాంతో గోపీనాథ్ ఆ పార్టీ క్రియాశీలక కార్యకర్తగా మారిపోయాడు. ఏదోరకంగా పార్టీలో చిన్నదో పెద్దదో పదవి సంపాదించాలనే తపన ప్రారంభమైంది. అలా తపన పుట్టాక ఆలోచన కార్యరూపంలోకి వస్తుంది కాబట్టి గోపీనాథ్ పెద్దగా ప్రయత్నించకుండానే మిత్రుల అండదండలతో ఆ పార్టీ అర్బన్ కమిటీలో సభ్యుడయ్యాడు. దాంతో అతనికి గుర్తింపు, ప్రతిష్ఠ పెరిగాయి. దానికి నిదర్శనం అతను కమిటీ సభ్యుడిగా ఎన్నికైన సందర్భంలో ఒక దినపత్రికలో వచ్చిన అభినందనల ప్రకటన.

బావగారిని తీవ్రవాదులు కిడ్నాప్ చేశారని తెలియగానే అతను రెండుక్షణాలు ఆశ్చర్యపడి, తర్వాత ఆ కిడ్నాప్ వ్యవహారం తనకి రాజకీయపరంగా ఎలా ఉపయోగపడుతుందా అని ఆలోచించడం ప్రారంభించాడు. ఇందులో ఏదైనా విజయం సాధిస్తే అర్బన్ కమిటీ సెక్రటరీ పదవి సంపాదించడానికి అవకాశం ఏర్పడుతుందని అనుకున్నాడు. గోపీనాథ్ ఇంతవరకు ఆ చుట్టుపక్కల ప్రాంతంలో పదిపదిహేనుమందికి రేషన్‌కార్డులు, ముగ్గురికి నీళ్ళపంపు కనెక్షన్లు ఇప్పించాడు, చిన్న చిన్న తగాదాలు పరిష్కరించాడు.

అతనిమీద పోలీస్‌స్టేషన్‌లో మూడు కేసులు నమోదై ఉన్నాయిగాని స్థానిక నాయకులతో సన్నిహిత సత్సంబంధాలుండటంవల్ల పోలీసులు అతని జోలికి రావడం మానేశారు.




అయితే గోపీనాథ్ ఇంకా జేబులో కత్తిపెట్టుకుని తిరిగే స్థాయికి ఎదగలేదు. గోపీనాథ్ ఇప్పటిదాకా మర్నాడు నగరంలోకి రాబోతున్న రాష్ట్ర స్థాయి నాయకుడుకోసం స్వాగత ద్వారాలు, బ్యానర్లు ఏర్పాటు చేసివస్తున్నాడు.

పడుకున్నాడన్నమాటేగానీ అతను నిద్రపోకుండా కిడ్నాప్ వ్యవహారం గురించే చాలాసేపు ఆలోచించాడు. చివరికి తెల్లారుజామున చల్లని తూర్పుగాలి తగలగానే అతనికో ఐడియా తట్టింది. దాంతో సంతృప్తిపడి నిద్రలోకి జారిపోయాడు.

గోపీనాథ్ పొద్దున్నే అత్యుత్సాహంగా లేచి ఏదో కొంపమునిగిపోతున్నట్టు కాలకృత్యాలు తీర్చుకుని వంటగదిలోకి అడుగుపెట్టాడు.

"అక్కా... కాఫీ..."

"ఏరా ఇంత పొద్దున్నే లేచావు. రాత్రి అంతసేపు మెలకువగా ఉండికూడా"

"బోల్నన్ని పనులున్నయ్. ముందు ఈ సంగతి మా నాయకుడికి చెప్పాలి. తర్వాత పోలీసులకి చెప్పాలి"

"సరే వెళ్ళుగాని. నాకొక్కటే భయంరా అడవుల్లో పోలీసులకి, నక్సలైట్లకి మధ్య జరిగే ఎన్‌కౌంటర్లలో మీ బావగారికి ఏదన్నా ప్రాణహాని జరుగుతుందేమోనని..."

గోపీనాథ్ హుషారుగా నవ్వాడు.

"అది కూడా ఆలోచించానే... దానికో ఉపాయం కూడా తట్టింది. అది మా నాయకుడి చెవిన వేస్తే చాలు. మా పార్టీ రాష్ట్ర నాయకులకి తెలిసిపోతుంది. వాళ్లు రంగంలోకి దిగుతారు. రేపో ఎల్లుండో మనం హైదరాబాద్ వెళ్ళాల్సివుంటుంది"

"ఎందుకురా?"

గోపీనాథ్ సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయాడు.

సుమతి అలా నిలబడిపోయింది.

★ ★ ★

హాస్య రచయిత పరబ్రహ్మం భార్య ఆరతి తన భర్తని కిడ్నాప్ చేసి తీసుకెళ్ళినా ఏమాత్రం కంగారుపడలేదు. దానిక్కారణం ఆమె జమీందారుల వంశంనించి వచ్చింది.

అలాంటి వంశాల్లో పుట్టినవాళ్ళు దేనికీ భయపడకూడదని, చలించకూడదని ఆమెకో గట్టి అభిప్రాయం చిన్నతనంలోనే ఏర్పడిపోయింది. ఆరతి తాత అదేదో సంస్థానంలో దివాన్‌గిరీ వెలిగించాడు.

ఆమె తండ్రి కొన్నాళ్ళు స్వాతంత్రోద్యమంలో పాల్గొని, బ్రిటీష్‌వాళ్లని మనదేశంనించి వెళ్ళగొట్టలేమని, స్వరాజ్యం సాధించుకోలేమని ఎందువల్లనో గ్రహించి, ఎదిరించే శక్తి లేనప్పుడు వినయవిధేయతలతో బతకడమే మంచిదనే తాత్విక సూత్రం ప్రకారం దొరలతో స్నేహంచేసి పదవులు సంపాదించి ఇంట్లోకి సీమ సంస్కృతిని దించేశాడు.

ఆ రెండు కారణాలవల్ల ఆరతికి అసలు భయం అంటే ఏమిటో తెలీకుండా పోయింది. ఆమె దురహంకారి అని చెప్పలేంగాని తన వంశస్థులంటే ఆమెకి ఎనలేని గౌరవం... గర్వం... పరబ్రహ్మంకి చెప్పుకోదగ్గ ఆస్తిపాస్తులు లేకపోయినా ఆమె పెళ్ళి చేసుకోవడానికి కారణం, అతనికి ఠీవి దర్జా ఉన్నాయనే. పెళ్ళయ్యాక ఆరతి పుట్టింటినించి కొంత ఆస్తి బంగారం పట్టుకొచ్చి తనే సొంతంగా ఇల్లు కట్టించింది. తర్వాత ఆమె దృష్టి సామాజికమైన కీర్తిప్రతిష్టలవైపు మళ్ళింది.

నక్సలైట్లు పరబ్రహ్మంని తీసుకెళ్ళిన తర్వాత ఆరతి రెండు నిమిషాలు ఆలోచనలో పడింది. పోలీసులకి ఫోన్ చెయ్యొద్దని వాళ్ళు హెచ్చరించారు. దాంతో ఆరతి ఆ ఉద్దేశం విరమించుకుంది గాని ఆ విషయాన్ని కనీసం తన మిత్రురాళ్ళకైనా తెలియచేయాలని నిర్ణయించుకుంది. దాంతో మిసెస్ గుప్తాకి, మిసెస్ నాగార్జునకి సిటీ క్లబ్బు ఆర్గనైజింగ్ కమిటీలోని ఇతర సభ్యులకి ఫోన్ చేసింది.

అంత రాత్రివేళ ఆరతి ఫోన్ చేసినందుకు వాళ్ళు మనసుల్లోనే విసుక్కుంటూ ఆమె

చెప్పిందంతా ఓపిగ్గా విన్నారు. విని ఆ సంగతి పోలీసులకి చెప్పబోమని హామీ ఇచ్చి మర్నాడు ఉదయం పది గంటలకి పోలీస్‌స్టేషన్‌లో కలుసుకుంటామని చెప్పారు.

ఆరతి త్వరత్వరగా ఇంటిపని ముగించుకుని పట్టుచీరె కట్టుకుని పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళింది. బైటికి వెళ్ళేటప్పుడు చాలా హుందాగా, దర్జాగా రీవిగా ఉండాలని ఆమె దృఢాభిప్రాయం.

అప్పటికే ఆమె మిత్రురాళ్ల కార్లు అక్కడ ఉన్నాయి. ఆమెని చూసి ఆమె ఫ్రెండ్స్ అందరూ హలో, హాయ్ అంటూ పలకరించి స్టేషన్‌లోపలికి తీసుకెళ్ళారు.

లోపల వైర్‌లెస్ సెట్టుంది. నాలుగైదు బల్లలు కుర్చీలు ఉన్నాయి. యస్.ఐ. రవిరాజా, తాజా ఖాకీపువ్వులా తన కుర్చీలో మహారాజులా కూర్చుని ఉన్నాడు. ఆ ఉద్యోగంకోసం ఖర్చుచేసిన దానికి మూడురెట్లు వీలైనంత త్వరగా ఎలా సంపాదిద్దామా అనే ఆదుర్దాలో ఉన్నాడు. ఇప్పుడు తన చుట్టూ ఉన్న హైక్లాసు లేడీస్ తన ఆశయసాధనకి ఏమాత్రం ఉపయోగపడరని తెలిపోవడంతో అతనికి వాళ్ళ కేసు పట్ల ఆసక్తిపోయింది. అయితే నక్సలైట్లు, కిడ్నాప్ అనే మాటలతో కొంత ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఏమైనా గట్టి ఆధారాలు దొరికి, ఒకవేళ వాళ్ళు దొరికితే తేలిగ్గా ప్రమోషన్ వస్తుందని ఆశపడుతున్నాడు.

ఆరతిని అతను అన్ని రకాల ప్రశ్నలు వేసి కిడ్నాప్ సంగతిని అన్ని గంటలపాటు దాచిపెట్టి ఉంచినందుకు చిరాకుపడి, ఆ విషయాన్ని పై అధికారులకు తెలియచేసి, వాళ్ళొచ్చేదాకా కూర్చోమని చెప్పాడు.

అంతలో కిశోర్‌కూమార్ భార్య సౌజన్య వచ్చింది. అక్కడి కార్ల హడావుడి చూసి కంగారుపడి, స్టేషన్‌లోకి వెళ్ళడానికి కొంచెం సంశయించి గుమ్మంలోనే ఆగిపోయింది. ఒక కానిస్టేబుల్ ఆమె దగ్గరికి వచ్చి అనుమానంగా చూస్తూ అడిగాడు.

"ఏం కావాలి?"

"నా భర్తని నక్సలైట్లు కిడ్నాప్‌చేశారు..." చెప్పింది సౌజన్య మెల్లిగా.

"మీదీ అదే కేసా?... లోపల ఒకామె ఉంది"

"ఆవిడ ఎవరు?"

"కథలురాసే పరబ్రహ్మంగారి భార్య. అంటే నక్సలైట్లు ఒకేరాత్రి ఇద్దరు రచయితల్ని కిడ్నాప్ చేశారన్నమాట... పోలీస్ ఇన్‌ఫార్మర్లు అనుకున్నారేమో... వెళ్లండి... లోపల యస్.ఐ.గారున్నారు"

సౌజన్య నిదానంగా లోపలికి వెళ్ళి కిడ్నాప్ సంగతి చెప్పింది. యస్.ఐ. రవిరాజా ఆరతిని అడిగిన ప్రశ్నలే ఆమెనీ అడిగి జవాబులు అదేవిధంగా వచ్చినందుకు సంతృప్తిపడి పై అధికారులకు మళ్ళీ ఫోన్‌చేసి చెప్పాడు.

అదే సమయంలో నగరంలోకి వేర్వేరు పోలీస్‌స్టేషన్‌లనించి కూడా పై అధికారులకు ఇదేరకమైన మరో మూడు వర్తమానాలు అందాయి.

కిడ్నాప్ చేయబడిన రచయితల భార్యలు ఐదుగురినీ పోలీస్ ఆఫీసర్స్ క్లబ్బుకి తీసుకురమ్మని 'పైనించి' హుకుం జారీ అయింది.

★ ★ ★

గోపీనాధ్ సరాసరి తన పార్టీనాయకుడి ఇంటికి వెళ్ళాడు.

అదో పెద్ద బంగళా.

చుట్టూ ఎత్తయిన కాంపౌండ్ గోడ, గేటు మీద 'కుక్క' ఉంది జాగ్రత్త అనే హెచ్చరిక బోర్డు, లోపల పూలమొక్కలు, ఒక కారు, రెండు స్కూటర్లు... ఇంటి చుట్టూ వ్యాపించిన మనీప్లాంట్... ఆ ఇల్లు ఊదారంగులో విశాలంగా అందంగా ఉంది.

అతను వెళ్లిన సమయానికి నాయకుడు ఇంట్లో లేడు. జాగింగ్‌కి వెళ్లొచ్చి స్నానం చేసి ఎక్కడికో వెళ్ళాట్ట వేరేవాళ్ల కారులో... నేపాలీ వాచ్‌మాన్ తెలుగు యాసలో ముద్దుముద్దుగా




చెప్పాడు. ఆ మధ్య గుండెపోటు వచ్చినప్పటి నుంచి ఆయన జాగింగ్‌కి వెళ్ళడం ప్రారంభించాడు. దానివల్ల శారీరక వ్యాయామం సంగతి ఎలా ఉన్నా ఊళ్ళో బొజ్జలు, శరీరాలు పెంచిన ప్రముఖులతో ఆయనకి పరిచయం ఎక్కువైంది.

ఆ పార్టీనాయకుడికి రకరకాల వ్యాపారాల్లో వాటాలున్నాయి గాని దేని రూపేణ ఎంత ఆదాయం వస్తుందో ఎవరికీ తెలీదు. ఆయన అన్నింటిలోనూ స్లీపింగ్ పార్టనరే

ఉదయం పదకొండు గంటలకి వచ్చాడు నాయకుడు. రాష్ట్రస్థాయి నాయకుడికోసం ఏర్పాటుచేసిన స్వాగత ద్వారాలు, బ్యానర్లు ఆయనకి నచ్చాయి. పొద్దున్నే మొగుడూ పెళ్లాల తగాదా కేసు, ఒక భూవివాదం పరిష్కరించేశాడు. ఎవర్నో ఎందుకో కొట్టి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళిన తన వాళ్ళని విడుపించుకొచ్చాడు. అదుగో, అప్పుడే ఆయనకి రచయితల కిడ్నాప్ గురించి తెలిసింది. దాంతో ఆయనకి మరింత ఉత్సాహం పొంగుకొచ్చింది.

గోపీనాథ్ తన నాయకుడి ఆస్తిపాస్తుల గురించి ఆదాయ మార్గాల గురించి ఏనాడూ ఆలోచించలేదు. చెప్పింది చెయ్యడం, చేసింది చెప్పడం తన రాజకీయ వృత్తిధర్మంగా స్వీకరించాడు.

రాజకియాల్లోకి దిగిన తర్వాత ఆయనకి ప్రతిరోజూ 'ఇస్యూ'ల కోసం ఎదురు చూడటం అలవాటైపోయింది. ఏదన్నా ఇస్యూ దొరికితే దాన్ని తమ పార్టీ కోసం ఉపయోగించుకోవడం నేర్చుకున్నాడు.

"ఏమిటీ విశేషాలు?" అడిగాడాయన లెదర్ సోఫాలో సుఖాసీనుడై.

"మీకు తెలీదేమో, మా బావ రచయిత. ఆయన్ని రాత్రి నక్సలైట్లు కిడ్నాప్ చేశారు''

"మీ బావనే కాదు, ఇంకో నలుగుర్ని కూడా. వాళ్ళ భార్యలు పోలీస్‌స్టేషన్లకి వెళ్ళారు. కమీషనరే వాళ్లని పోలీస్ ఆఫీసర్స్ క్లబ్‌కి రమ్మని చెప్పాడు. వాళ్ళు వెళ్ళారు''

"ఈ సంగతి నాకు తెలీదు''

"నక్సలైట్లువల్ల తమ భర్తల ప్రాణాలకు ముప్పు వస్తుందేమోనని వాళ్ళు భయపడుతూ ఉండొచ్చు. వాళ్ళు భయపడినా పడకపోయినా మనం భయపడాలనే చెబుతాం... అందుకని నువ్వో పనిచెయ్''

"చెప్పండి''

"ఆ రచయితల భార్యలు ఇప్పుడేమి చేస్తారో కనిపెట్టు''

"అలాగే''

"మనకిది మంచి అవకాశం... ఒకే రోజు రాత్రి నక్సలైట్లు ఐదుగుర్ని కిడ్నాప్ చేశారంటే రాష్ట్రంలో శాంతిభద్రతల పరిస్థితి ఎంత అధ్వాన్నంగా ఉందో అర్థంకావడంలేదా అని మనం నానా యాగీ చేద్దాం"

"ఈ ఐడియా బాగుంది సార్''

"నువ్వా పనిమీద ఉండు, మిగతా కథ నేను నడిపిస్తాను''

గోపీనాథ్ తలూపి నమస్తే చెప్పి వెళ్ళిపోయాడు.



సిటీ పోలీస్ ఆఫీసర్స్ క్లబులో ప్రశ్నోత్తరాల కార్యక్రమం ప్రారంభమైంది.

ఈ ప్రశ్నోత్తరాల కార్యక్రమానికి నగరంలోని వివిధ దినపత్రికల విలేఖరులు కూడా హాజరయ్యారు. రచయితల భార్యలు చెప్పిన

సమాచారాన్ని వివరంగా రాసుకొని వాళ్ళని తాము కూడా కొన్ని ప్రశ్నలడిగి వార్తలు రాసేశారు, అక్కడే కూర్చుని.

ఐదుగురు రచయితల భార్యలు, వాళ్ళ మిత్రురాళ్ళు పోలీస్ ఆఫీసర్స్ క్లబ్‌నించి బైటికి వచ్చారు.

అందరూ ఆటోలు ఎక్కారు. అవి ముందుకు కదిలాయి. ఇలా పోలీసులచుట్టూ తిరగాల్సి వస్తుందని వాళ్ళలో ఎవరూ ఎప్పుడూ అనుకోలేదు. నక్సలైట్లు గతంలో ఒకసారి కొందరు అధికారుల్ని, రెండుసార్లు ఇద్దరు ఎమ్మెల్యేలని, చాలాసార్లు పోలీసుల్ని ఫారెస్ట్‌గార్డుల్ని కిడ్నాప్ చేశారుగాని ఏ సందర్భంలోనూ వాళ్లలో ఎవరికీ ప్రాణహాని చేయలేదు. అయినా కీడెంచి మేలెంచడమే మంచిది కాబట్టి ముందు జాగర్త తీసుకోవాలని వాళ్లు అనుకున్నారు. ఎవరి ఆలోచనా చప్పున ఒక కొలిక్కి రావడంలేదు. జరగరానిది ఏదైనా జరిగితే ఎవరిదీ బాధ్యత? ప్రభుత్వానిదా, పోలీసులదా. తీవ్రవాదులదా? అయినా కీలకమైన పదవుల్లో ఉన్నవాళ్ళని కిడ్నాప్ చేయక తమ భర్తల్ని కిడ్నాప్ చేయడం ఎందుకు? ఆ ఐదుగురికి ఎవరెవరిమీదనో ఎందుకో కోపం పెరిగిపోతోంది.




ఆటోలు ఆరతి ఇంటిముందు ఆగాయి.

అందరూ దిగి లోపలికి వెళ్ళారు.

టిఫిన్లు, కాఫీలు పూర్తయ్యాక ఆరతి అంది.

"మనం ముఖ్యంగా భయపడాల్సింది ఎన్‌కౌంటర్ల గురించి. తీవ్రవాదులు రచయితల్ని కిడ్నాప్ చేశారు, మనం కాల్పులు జరిపితే పొరపాటున వాళ్ళకి తగలొచ్చనే జ్ఞానం పోలీసులకి ఉండదు"

"అవునవును..." మిగతా నలుగురూ ముక్తకంఠంతో అన్నారు, పోలీసులు పూర్తిగా అజ్ఞానులని అంగీకరిస్తూ.



"పైగా ఈమధ్య కేంద్ర రిజర్వ్ దళాలు, ఐ.ఎస్.ఎఫ్, పారా మిలట్రీ దళాలు కూడా రంగంలోకి దిగాయట. పేపర్లలో చదువుతున్నాం కదా... మన తెలుగు పోలీసులైతే ఆగుతారేమోగాని వాళ్ళసలు ఆగరు. మన బాధవాళ్ళకి అర్థంకాదు''

"అవునవును..."

"అందుకని మనవాళ్ళని నక్సలైట్లు విడచి పెట్టేవరకు రాష్ట్రంలో ఎక్కడా ఎన్‌కౌంటర్లు జరపరాదని డిమాండ్ చేద్దాం"

"మన మాట ప్రభుత్వం వింటుందా?"

ఆడవాళ్ళ మాట చచ్చినట్టు వింటుంది. దీనికోసం మనం ఇక్కడి కమీషనర్‌కో మెమొరాండం ఇచ్చి హైదరాబాద్ వెళ్దాం"

"వెళ్ళి?"

"సెక్రటేరియట్ ముందు నిరాహారదీక్ష ప్రారంభిద్దాం"

"ఐడియా బాగుంది. ఆడాళ్ళు గొడవ చేస్తేనే గదా, ప్రభుత్వం సారా నిషేధం విధించింది. ఇప్పుడు కూడా మనమాట చచ్చినట్టు వింటుంది'' అంది సౌజన్య.

"మనకి మద్దతుగా ఇంకొంతమంది ఆడవాళ్ళని తీసుకెళ్తే బాగుంటుంది''

"బాగానే ఉంటుందిగాని అక్కర్లేదు, మనం చాలు'' అంది ఆరతి.

మిగతా నలుగురూ ఆలోచనలో పడిపోయారు. ఆ పని తాము చేయగలమా అని అనుమానం వచ్చింది. సెక్రటేరియట్ ముందు గొడవకి దిగుతారా అని పోలీసులు లాఠీ చార్జి చేసి కీళ్ళు విరగ్గొడితే దిక్కేవుంది? కాని ఏం చెయ్యకుండా చూస్తూ ఊరుకోవడం కూడా మంచిది కాదనిపిస్తోంది.

"ఆలోచిస్తుంటే మనకి మద్దతుగా కొంతమంది ఆడవాళ్ళని తీసుకెళ్ళడమే మంచిదనిపిస్తోంది''

"అవును... ఎంత ఎక్కువ మంది ఉంటే అంతరక్షణ" చెప్పారొకరు.

"మాకు చేతనైనంత మందిని మేం తీసుకొస్తాం... మీరూ తీసుకురండి. రాత్రికి బస్‌స్టేషన్‌లో కలుసుకుందాం" అంది సుమతి. అందరూ లేచారు.

వాళ్ళలా వాకిట్లోకి వెళ్ళగానే గోపీనాథ్ వచ్చి వివరాలు అడిగి తెలుసుకుని, రాత్రికే హైదరాబాద్ వెళ్తున్నామని వాళ్ళు చెప్పడంతో 'ఆడవాళ్ళకి బుర్ర పెరిగి పోయిందని' తెగ ఆశ్చర్యపడ్డాడు.

ఆ రోజు రాత్రి ఐదుగురు రచయితల భార్యలు బస్‌స్టేషన్‌కి వెళ్లారు. వాళ్లతోపాటు మరో పదిహేనుమంది వచ్చారు కూడా. అందరూ టిక్కెట్లు తీసుకుని బస్సెక్కి కూర్చున్నారు.

అక్కడికి దగ్గర్లో ఓ కిళ్ళీ కొట్టుముందు సిగరెట్ కాలుస్తూ నిలబడ్డ ఓ యువకుడు వాళ్ళని చూసి చిరునవ్వు నవ్వుకున్నాడు.

అతనిపేరు నరసింహం.

★ ★ ★

నరసింహం అసలు పేరేమిటో ఎవరికీ తెలీదు, అతని తల్లికి, ముఖ్యమైన బంధువులకి తప్ప. అతని తండ్రి చిన్నతనంలోనే చనిపోయాడు. ఆయన్ని భూమితగాదాల్లో ఎవరో హత్య చేశారని కొందరు, కాదు ఆత్మహత్య చేసుకున్నాడని కొందరు అంటారుగాని నిజం ఏమిటో ఎవరికీ తెలీదు. ఆయన పొలాలకు వేసే క్రిమిసంహారకమందు తాగి పొలాల్లో పడిఉండగా చూశారు.

నరసింహం తల్లి తన కర్మానికి తననీ, భగవంతుణ్ణీ తిట్టుకుని కూలిపనులు చేసుకుంటూ నలుగురు పిల్లల్ని పెంచింది. వాళ్లలో పెద్దవాడు నరసింహం. అతనికి చాలా చిన్నతనంలోనే సమాజంలోని అసమానత్వం అర్థమైంది. పుస్తకాలు చదివే అలవాటు అతనికి ఎలా అబ్బిందోగానీ కొంచెం పెద్దయ్యాక రోజూ గ్రంథాలయానికి వెళ్ళి కనిపించిన ప్రతి పుస్తకం చదివేవాడు. తర్వాత కొన్నాళ్ళకి కేవలం వామపక్షగ్రంథాలు చదవడానికి మాత్రమే తన జిజ్ఞాసను పరిమితం చేసుకున్నాడు.

కొడుకులో వస్తున్న మార్పుకి, ఊరిపెద్దలతో తగాదాకి దిగే స్వభావాన్ని తల్లి గమనించి అతన్ని 'మంచిదారి'లో పెట్టడానికి, వినయవిధేయతలు నేర్పడానికి ప్రయత్నించిందిగాని ఆమె ప్రయత్నాలు ఏమాత్రం ఫలించలేదు.

స్థానిక భూస్వామి కొడుకుతో తగాదాపడి అతన్ని కొట్టి కొన్నాళ్లు అజ్ఞాతంలోకి వెళ్ళాడు నరసింహం.

ఆ రోజుల్లో పోలీసులు అతని తల్లిని ప్రశ్నలతో విసిగించి, వేధించి పోలీస్‌స్టేషన్ చుట్టూ తిప్పుకుని నానా బాధలూ పెట్టారు. నరసింహం ఎక్కడున్నాడో ఆమెకీ తెలీదుగాని ఆమె తెలిసి కూడా దాచిపెడుతోందని వాళ్లు అనుమానించారు.

దాంతో ఆవిడకి తనని వేధిస్తున్న పోలీసుల మీదకంటె కనిపించకుండాపోయిన కొడుకు మీద ఎక్కువ కోపం వచ్చింది. ఒక నెలరోజుల తర్వాత నరసింహం స్వయంగా పోలీసులకి లొంగిపోయి, చిత్రహింసలు అనుభవించి బైటికివచ్చాడు. పోలీసులు అతన్ని ఎందువల్లనో కోర్టుకి తీసుకువెళ్ళకుండా వాళ్లే స్వయంగా శిక్షించి వదిలిపెట్టారు.

ఇదంతా నరసింహం ఇంటర్మీడియేట్ చదువుతుండగా జరిగింది. దాంతో అతను చదువు అర్థాంతరంగా మానేసి ఇంట్లోనే ఉండిపోయాడు.

ఎక్కడెక్కడో తిరగడం, ఎవరెవరితోనో మాట్లాడటం ఇంటికి ఎప్పుడో రావడంతో అతన్ని తల్లి ప్రశ్నించడం, పట్టించుకోవడం మానేసింది. అయితే ఆ ఊరి భూస్వామి కొడుకు మాత్రం అతనిమీద పగపట్టి ఎప్పుడు ఏ నేరంతో పట్టుబడతాడా అని ఎదురు చూస్తూనే ఉన్నాడు.

అలాగే నరసింహానికి రాడికల్స్‌తో సంబంధాలున్నాయని పోలీసులకి అను




మానం ఉందిగానీ, సరైన ఆధారాలు దొరక్క అవకాశం కోసం చూస్తూ కూర్చున్నారు.

బస్‌స్టేషన్‌లో కాసేపు అటూ ఇటూ తిరిగి రామచంద్రాపురం వెళ్లే లాస్ట్‌బస్ వెళ్లిపోయిందని తెలుసుకుని నరసింహం మెల్లిగా రోడ్డుమీదికి వచ్చి లారీకోసం ఎదురుచూడసాగాడు.

"ఎక్కడికెళ్ళాలి?" అడిగాడో లారీక్లీనర్. ఆలోచనలోపడి ఆ లారీ రావడం, ఆగడం నరసింహం గమనించలేదు.

"రామచంద్రాపురం"

"ఎక్కు"

ఎక్కాడు నరసింహం. లారీ కదిలింది.

గంటన్నర తర్వాత రామచంద్రాపురం మెయిన్‌రోడ్డుమీద దిగి చుట్టూ చూశాడు నరసింహం.

ఊరు ముసుగు కప్పుకుని నిద్రపోతున్న తాబేలులా ఉంది. ఊరిపక్క చెరువు ముసలి మొసలిలా నిశ్శబ్దంగా నిశ్చలంగా ఉంది. ఒడ్డు చుట్టూ ఉన్న కొబ్బరిచెట్లు గాలికి ఊగుతూ అర్ధరాత్రి అతిథులకు స్వాగతం చెబుతున్నట్టున్నాయి. పంచాయతీవారి లైట్లు వెలుగుతూ ఆరిపోతూ చీకటితో ముసుగుయుద్ధం సాగిస్తున్నాయి. చెరువుకి దూరంగా అవతలి వైపు 'మాలోళ్ళ బావి' ఒంటరిగా వెలేసినట్టుగా ఉంది.

పల్లెటూళ్ల ప్రజలు పెందలాడే పడుకుని పెందలాడే నిద్రలేస్తారని నరసింహంకి తెలుసు. అందుకే తనపని త్వరగా ముగించుకుని వెళ్ళిపోవాలనుకున్నాడు.

భవాని చెప్పిన గుర్తుల ప్రకారం నడవసాగాడు. ఒకటి రెండు కుక్కలు అతనివైపు అనుమానంగా చూసి మళ్ళీ నిద్రలోకి జారిపోయాయి.

మూడువీధులు తిరిగి ఛాయవాళ్ళ ఇంటి ముందుకు వచ్చాడు నరసింహం. ఆ ఇంటికి కుడివైపున్న పశువులకొట్టం, గడ్డివామివైపు చూసి లోపలికి వెళ్ళి పశువులతాళ్లు విప్పదీసి వాటిని దూరంగా తోలేశాడు. తర్వాత సంచీలోంచి పెట్రోలు డబ్బాతీసి కొట్టంమీద, గడ్డివామిమీద చుట్టూ చల్లి నిప్పంటించి నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు.

కొద్దిక్షణాల్లో మంటలు గుప్పున ఎగసి చుట్టూ వ్యాపించాయి.

★ ★ ★

ఐదుగురు రచయితల భార్యలు, వాళ్ళ సానుభూతిపరులు హైదరాబాద్ చేరేసరికి తెల్లవారింది. వాళ్ళొక మంచి హోటల్లో గదులు తీసుకుని స్నానాలు చేసి, ఆటోల్లో సెక్రటేరియట్ దగ్గరికెళ్లారు.

సెక్రటేరియట్‌ముందు రోడ్డుపక్క అప్పటికే పెద్ద షామియానావేసి ఉండటం చూసి ఆశ్చర్యపోయారు వాళ్లు. అన్నీ ప్రతిపక్షాలవాళ్ళవే ఓ డజను కార్లు ఉన్నాయి.

ఎక్కడినుంచో మైకులు వచ్చాయి.

బ్యానర్లు వెలిశాయి.

ప్రెస్‌వాళ్లు దిగిపోయారు.

"రండి రండి" ఆహ్వానించారు ప్రతిపక్ష నాయకులు.

ఆడవాళ్లు ఆశ్చర్యంనించి పూర్తిగా తేరుకోకముందే వాళ్ళని తీసుకెళ్లి కూర్చోబెట్టి, చిన్న చిన్న ఆడపిల్లలచేత పూలదండలు వేయించారు.

తర్వాత ఎక్కడినించి ఎలా వచ్చారోగాని, చాలామంది ఆడవాళ్లు వచ్చారు. పదిగంటలయ్యేసరికి సుమారు ఐదొందలమందిదాకా అయ్యారు. దాంతో శాంతిభద్రతల పరిరక్షణార్థం. పోలీసులు కూడా లారీలతో రంగంలోకి దిగిపోయారు.

ప్రతిపక్షనాయకులు ఒకరి తర్వాత ఒకరు మైకు పట్టుకుని రచయితల కిడ్నాప్ గురించి, రాష్ట్రంలో శాంతిభద్రతల పరిస్థితి దిగజారిపోవడం గురించి చెప్పి చెప్పి, 'కళాకారుల్ని కాపాడలేని ప్రభుత్వం వెంటనే అధికారం నుంచి తప్పుకోవాలని' డిమాండ్ చేశారు.

ఆ రచయితల భార్యల అసలు డిమాండ్‌ని మాత్రం అందరూ గాలికి వదిలేశారు.

రోడ్డున వెళ్ళేవాళ్లు, ముఖ్యంగా ఆడవాళ్లు ఏం జరుగుతుందో చూద్దామనే కుతూహ లంతో అక్కడికి చేరిపోయారు.

"ఐదుగురు రచయితల భార్యలు ఇలా సెక్రటేరియట్‌ముందు నిరాహారదీక్ష ప్రా రంభించారనే సంగతి క్షణాల్లో ముఖ్యమంత్రికి తెలిసిపోయింది.

"వాళ్ళ గొడవేమిటి?" అడిగాడాయన పర్స నల్ సెక్రటరీని.

"వాళ్ళ భర్తల్ని నక్సలైట్లు విడిచిపెట్టేవరకు రాష్ట్రంలో ఎక్కడా ఎన్‌కౌంటర్లు జరక్కుండా చూడాలని డిమాండ్ చేస్తున్నారు సార్"

"ఈ కిడ్నాప్ డ్రామా ఎన్నిరోజులు జరుగు తుంది?"

"రెండు వారాలని చెప్పి తీసుకువెళ్ళారుట సార్"

"ఓస్ ఇంతేగదా! దానికేం భాగ్యం? అలా గే ఆపేయిస్తామని హామీ ఇద్దాం. హోంసెక్రట రీకి ఫోన్‌చేసి వాళ్ళకి నిమ్మరసం ఇచ్చి ఈ హామీ ఇవ్వమన్నామని చెప్పు. అన్ని పోలీస్‌స్టే షన్లకి ముఖ్యంగా తెలంగాణా జిల్లాల్లో పోలీసు లకి వర్తమానం పంపించమని చెప్పు"

"యస్సర్"

రచయితల భార్యలు కేవలం మూడు గంటలు నిరాహారదీక్షతో తమ డిమాండ్‌ని సాధించుకుని మళ్ళీ బస్సెక్కారు.

ప్రతిపక్షాలు ఇంత హడావుడి చెయ్యడానికి ప్రభుత్వం అంత త్వరగా ప్రతిస్పందించడాని కి కారణం ఇది ఎన్నికల సంవత్సరం కావట మేనని అందరూ అనుకున్నారు.

★ ★ ★

ఐదుగురు రచయితలు, వాళ్ళని తీసుకొచ్చిన తీవ్రవాదులు భోజనాలు చేశారు.

మధ్యాహ్నం ఎండ విపరీతంగా ఉంది.

చెట్ల ఆకుల మధ్యనుంచి సూర్యకిరణాలు వాడిగా వేడిగా విచ్చుకుంటున్నాయి.

తమని తీసుకొచ్చిన నక్సలైట్లని కలుసుకో వడానికి ఎవరైనా వస్తారేమోనని రచయితలు ఆదుర్దాగా, కుతూహలంగా ఎదురుచూశారు గాని ఈ డెబ్బైరెండు గంటల్లో ఎవరూ రాలే దు. వాళ్ళు కూడా ఎక్కడికీ వెళ్లలేదు.

రచయితలు ఒకరితో ఒకరు మాట్లాడుకో వడం మానేసి ఎవరి ఆలోచనలో వాళ్లుండిపో యారు. ఈ అజ్ఞాతవాసం ఎప్పుడు ముగు స్తుందో, ఎప్పుడు తమకి విముక్తి లభిస్తుందో వాళ్లకి అర్థం కావడంలేదు. అయితే ఒక్కటే సంతోషించదగ్గ విషయం, తీసుకొచ్చినప్పటి నుంచి ఒకేచోట ఉంచారు తప్ప ప్రదేశాలు మార్చలేదు. అలా మార్చాలని నక్సలైట్లు నిర్ణయిస్తే మళ్ళీ సుదీర్ఘమైన నడక ఉంటుందని భయపడ్డారు.

"కామ్రేడ్స్... రేడియో పెడతాను. వార్తలు వినండి. ఇక్కడికి పేపర్లు రావు" అన్నాడు పులకేశి ఒక చేతిసంచీలోనుంచి రేడియో తీస్తూ.

అడవిలో ఏంతోచక ఆలోచనలతో సతమత మైపోతున్న రచయితలు ఏం మాట్లాడకుండా తలలూపారు.

వార్తలు చదువుతున్నది అంటూ కొద్దిసేపు ప్రభుత్వ కార్యక్రమాలు, మంత్రుల పర్యటనల వివరాలు, శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాల గురించి చెప్పిన తర్వాత వార్తలు చదివే ఆయన ఇలా చెప్పాడు.

నక్సలైట్లు కిడ్నాప్ చేసిన ఐదుగురి రచయి తల భార్యలు నేడు సెక్రటేరియట్‌ముందు నిరాహారదీక్ష చేశారు. తమ భర్తల్ని తీవ్రవాదు లు విడిచి పెట్టేవరకు రాష్ట్రంలో ఎక్కడా ఎన్‌కౌంటర్లు జరక్కుండా చూడాలని వారి డిమాండ్. దీనికి ప్రభుత్వం వెంటనే అంగీక రించింది. ఈమేరకు రాష్ట్రంలోని అన్ని పోలీస్ స్టేషన్లకు ఆదేశాలు జారీఅయ్యాయి"

"భేష్... మా ఆడాళ్లు ఘటికులే. చెప్పుకోద గ్గ పనిచేశారు" అన్నాడు పరబ్రహ్మం




ఆనందంగా.

"పేరుకే ఈ ఆదేశాలు మిత్రులారా! పోలీసులు మమ్మల్ని చూస్తే మీరున్నారని చెప్పి వదిలిపెట్టరు. కేవలం ఇదో కంటితుడుపు చర్య''

"ఇది ఎన్నికల సంవత్సరంకదూ. అందుకే ప్రభుత్వం మావాళ్ళ డిమాండ్‌ని వెంటనే అంగీకరించి ఉంటుంది'' అన్నాడు నాగార్జున

"అవును. కరెక్టుగా చెప్పారు'' అన్నాడు పులకేశి.

ఎప్పటిలాగానే ఒక నక్సలైట్ సెంట్రీ డ్యూటీకి వెళ్ళాడు. మిగతా ముగ్గురూ రచయతల్ని కనిపెట్టుకుని కూర్చున్నారు. ఆ ముందు రోజంతా వాళ్లు తమ పార్టీ సిద్ధాంతాలు, ఆశయాలు, తాము సాధించిన వివరాల గురించి రచయితలకి వివరించి, కొద్దిసేపు పాటలుపాడి, అందరికీ కొన్ని గ్రంథాలు ఇచ్చారు. వాళ్ళలో పరబ్రహ్మం, గురుదేవ్, కిశోర్‌కుమార్‌లకు అసలు అలాంటి పుస్తకాలున్నాయనే సంగతే తెలీదు. పైగా అలాంటివంటే ఒక విధమైన జుగుప్స, ఏవగింపు అయినా నక్సలైట్ల భయంతో చిన్నపిల్లలు బొమ్మల పుస్తకాలు చదివినట్టు కొద్దిసేపు చదివారు.

ఆ పుస్తకాలపట్ల కొద్దో గొప్పో ఆసక్తి ఉంది నాగార్జున వివేకానందలకు మాత్రమే. వాళ్లు ఆ పుస్తకాల్ని కొంత కుతూహలంగా, కొంత శ్రద్ధగా చదివారు. వాళ్లు చదివినవాటిలో ఒక పుస్తకం పేరు ఆంధ్రప్రదేశ్ ఆదివాసీల చరిత్ర.

అయితే చదివినకొద్దీ వాళ్ళకి ప్రశ్నలు ఎక్కువయ్యాయి తప్ప వేటికీ సంతృప్తికరమైన జవాబులు దొరకలేదు. జీవితంలో మానసికారోగ్యం సాధించాలంటే దేన్నో ఒకదాన్ని తప్పయినా, ఒప్పయినా దృఢనిశ్చయంతో అనుసరించడమే మార్గమని వాళ్ళకి అనిపించింది. అలా అనుసరించేవాళ్లు కష్టాలు, ఇబ్బందులు, బాధలు ఎదురైనా తాము నమ్మిన ఆదర్శాలమీద ఎనలేని గౌరవంతో అన్నింటినీ సులువుగా తేలికగా తీసుకుంటారని దేనికీ బెంబేలు పడకుండా జీవిస్తారని అనిపించింది.

అంతలో సెంట్రీగా వెళ్లిన నక్సలైట్ వచ్చి పులకేశి చెవిలో ఏదో చెప్పి మళ్ళీ వెళ్లిపోయాడు.

"మిత్రులారా! మా డివిజినల్ సెక్రటరీ రాఘవ, కొంతమంది దళసభ్యులు వస్తున్నారు గెట్ రెడీ''

రచయితలు తమ చేతుల్లోని పుస్తకాలు పక్కనపెట్టి కొంచెం కుతూహలంగా చూస్తుండగానే వాళ్లు వచ్చేశారు. లాల్‌సలామ్‌లు చెప్పుకుని కుశలప్రశ్నలు అడిగి, ఒకరినొకరు కౌగిలించుకుని కాసేపు విడిగా ఏదో మాట్లాడుకుని తిరిగివచ్చారు.

రాఘవ కొంచెం ఎడంగా ఉన్న పెద్ద బండరాయిమీద కూర్చున్నాడు. మిగతా దళసభ్యులు నేలమీద కూర్చున్నారు.

"రచయితలకు స్వాగతం! మిమ్మల్ని ఎందుకు కిడ్నాప్ చేశామని మీరు మా కామ్రేడ్స్‌ని అడిగారుట. అంత పెద్ద రచయితలై ఉండి ఈ ప్రశ్నకు జవాబు ఆలోచించలేకపోవడం విచారకరం" అని ఆపి అందరివైపు చూశాడు రాఘవ.

రచయితల్లో ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

"మీరందరూ పట్టణ ప్రాంతాల్లో నివసిస్తున్నారు. మీకు తోచిన విధంగా నచ్చిన సబ్జెక్టులమీద రాసుకుంటున్నారు. మధ్య మధ్య వాటిలో మా గురించీ ఏదో ఒకటి రాస్తున్నారు. అవి చదివితే మాకు నవ్వొస్తుంటుంది.

మీ రచనలు అచ్చవుతున్నాయి. చదివే పాఠకులు చదువుతున్నారు. అయితే ఇక్కడ మన రాష్ట్రంలోనే ఆదివాసీలున్నారనిగాని, వాళ్లు తమ హక్కుల కోసం పోరాటం చేస్తున్నారనిగాని మీలో ఎవరూ ఎప్పుడూ ఒక్క వాక్యం కూడా రాయలేదు. కేవలం నక్సలైట్లు మాత్రమే అడవుల్లో ఉంటారని మీరు అనుకుంటున్నట్లున్నారు''

"మాకు వాళ్ళ గురించి తెలియనప్పుడు ఏం రాస్తాం?"

"కరెక్ట్. మీకు వాళ్ళ గురించి తెలీదు. అందుకే మీకు ఆయా విషయాలు ప్రత్యక్షంగా తెలియాలనే మిమ్మల్ని రిస్క్ తీసుకుని ఇక్కడికి తీసుకొచ్చాం"

"అంటే...?" అన్నాడు వివేకానంద.

"ఈ అడవులు చూడండి. ఇక్కడి ఆదివాసీల్ని చూడండి. వాళ్ళ జీసనవిధానం, జీవన పరిస్థితులు గమనించండి. వాళ్ళమీద సాగుతున్న దళారీల, షావుకార్ల దోపిడీని పరిశీలించండి. పోలీసులు, అధికారులు, సాగిస్తున్న దమననీతిని చూడండి. ప్రభుత్వం అమలుచేసే కంటితుడుపు పథకాల్ని స్వయంగా వీక్షించండి. అధికారులు. మంత్రులు ఇచ్చే హామీలకు ఆచరణకు మధ్య ఎన్ని శతసహస్ర యోజనాల దూరం ఉందో చూడండి. ఆదివాసీల్లో కొందరు మా ఉద్యమంలోకి, పోరాటంలోకి ఎందుకు, ఎలా వస్తున్నారో గమనించండి. తీవ్రవాదులు ఎవరు? ఏం చేస్తారు? వాళ్ళ లక్ష్యం ఏమిటి? వాళ్ల జీవనవిధానం ఏవిటి? వాళ్ళ విజయాలు, అపజయాలేమిటి? పరిశీలించండి''

"అబ్బో దీనికి చాలారోజులు పడుతుంది'' అన్నాడు కిశోర్‌కుమార్ నీరసంగా.

"ఎన్నిరోజులైనా పరవాలేదు. మీక్కావాల్సిన సౌకర్యాలన్నీ మేం కల్పిస్తాం. మీ ప్రాణాలకు మా ప్రాణాలు అడ్డేస్తాం. చూసి, ఆలోచించి, నిశితంగా పరిశీలించి ఈ కఠోర వాస్తవాలనే మీ రచనలకు ముడిసరుకుగా మార్చుకోండి. కనీసం తెలిసీ తెలియని విషయాలు రాయకండి. ఇందుకే మిమ్మల్ని తీసుకొచ్చాం"

"అంటే రచనాపరంగా మాకున్న స్వేచ్ఛని మీరు అరికడుతున్నట్లేకదా'' అడిగాడు నాగార్జున.

"మీకు బోల్డంత సాహితీ స్వేచ్ఛ ఉంది. దీనికి తూనికలు, కొలతలు నిర్ణయించడం, తుపాకీ చూపించి భయపెట్టి మీచేత ఏదో రాయించడం మా ఉద్దేశం కాదు. మీకు తెలీని విషయాలను తెలిసినా పట్టించుకోనివాటిని, పట్టించుకున్నా ఉదాసీనంగా వదిలేసిన వాటి గురించి ఒక సదవగాహన ఏర్పడేటట్టు చూడటమే ఈ మా ప్రయత్నలక్ష్యం"

"మా ఐదుగురిలో పరబ్రహ్మం హాస్యరచయిత. కిశోర్‌కుమార్ ఏం రాస్తాడో అతనికే తెలీదు. లేటెస్టు ఇంగ్లీషు నవలల్ని, సినిమాలని తెలుగు నవలలుగా మారుస్తుంటాడు. నేను సాహిత్యం పేరుతో వ్యాపారం చేస్తుంటాను. నాకు నిజంగా రాయడంరాదు. ఏదో ఎప్పుడో నా పేరుతో అచ్చేసుకోవడం తప్ప. నాగార్జున దృష్టి గతంవైపు తప్ప వర్తమానంవైపు ఉండిచావదు. వివేకానంద ఒక్కడే కాస్త అభ్యుదయ భావాలున్నవాడు. అతను సామాజిక దృక్పథంతో కథలు, నవలలు రాస్తుంటాడు. మిగతా మా నలుగురివల్ల మీకేం ప్రయోజనం లేదు'' అన్నాడు గురుదేవ్.

ఆ మాటకి రాఘవ వెంటనే జవాబు చెప్పకుండా నవ్వి కొద్దిక్షణాల తర్వాత అన్నాడు.

"రచయిత రచయితే... జీవనపరిస్థితుల్ని పరిశీలించి, తన భావాలను, అంతస్సంఘర్షణనీ మాటల్లో పెట్టగల నేర్పు, ప్రతిభ అతనికే ఉన్నాయి. మీరు ఏరకమైన రచనలు చేస్తున్నారనేది మాకు తెలుసు. అయినా మీలో రాసే శక్తి ఉంది. అందుకే కేవలం ఒక్క వివేకానందని మాత్రమే కాకుండా మీ నలుగుర్ని కూడా కిడ్నాప్‌చేసి తీసుకొచ్చాం"

"అంటే మీతరపున మేం ప్రచారం చేసిపెట్టాలా?" అడిగాడు నాగార్జున.

"అలా అనుకున్నా మాకేం అభ్యంతరంలేదు. నిజానికి మేం కోరుకునేది దుష్ప్రచారం జరగకుండా ఉంటే చాలునని. మీకు ఇప్పటిదాకా తెలీని జీవితాల గురించి తెలుసుకుని అవాస్తవాలు రాయకుండా ఉంటేచాలు.

"మీరిక్కడ ఉంటున్నారు. ఆదివాసీలతో




కలిసి జీవిస్తున్నారు. మీ అనుభవం లోతైనది. నాలుగు రోజులు చూసి మేమేం రాస్తాం? ఒకవేళ రాసినా అందులో డెప్త్ ఉండదు'' అన్నాడు వివేకానంద.

"తెలంగాణా సాయుధపోరాట కాలంలో ఉద్యమంలో ఉన్నవాళ్ళు లేనివాళ్ళు కూడా మంచి సాహిత్యం సృష్టించారు''

"చైనాలో సాంస్కృతిక విప్లవకాలంలో ఇలాంటి ప్రయోగాలు చేశారుట. నిజమోకాదో నాకు తెలీదుకానీ అవి వాళ్ళు కోరుకున్నంత సత్ఫలితాలు ఇవ్వలేదు''

"ఇందాకే చెప్పానుగదా... మీకు తెలీని సామాజిక పరిస్థితుల్ని పరిశీలించకుండా వాటిని గురించి రచనలు చేయరాదనే మిమ్మల్ని తీసుకొచ్చామని''

"అంటే ఇదో రైటర్స్ వర్క్‌షాప్'

"అలాంటిదే! సాహిత్య పాఠశాలలు నిర్వహిస్తుంటారు చూడండి... అలాగ" అన్నాడు రాఘవ నవ్వుతూ.

ఈ కిడ్నాప్ వెనుక ఏదో పెద్ద రహస్యం, ఆశయం ఉంటాయనుకుంటే ఇదా వీళ్ళ ఉద్దేశం... తమని పదేళ్ళు ఇలా అడవిలో ఉంచినాసరే, ఇక్కడి జనం జీవనపరిస్థితులు, నక్సలైట్ల ఉద్యమంమీద ఏమీ రాయలేమని వివేకానంద తప్ప మిగతా నలుగురు రచయితలూ అనుకున్నారు. రచయితల మానసిక చలనాలు రకరకాలుగా, విభిన్నంగా ఉంటాయి. వాటిని మార్చుకోవడానికి ఏ రచయితా ఒప్పుకోడు. ఇష్టపడినా అది కష్టసాధ్యం. విప్లవరచయిత బూతుకథ ఎలా రాయలేడో, బూతుకథలు రాసేవాడు విప్లవాత్మకమైన కథ కూడా అలాగే నిజాయితీగా రాయలేడు.

సినిమాల్లో వెకిలి నటుడు ధీరోదాత్తమైన భగత్‌సింగ్, సీతారామరాజులాంటి పాత్రలు ఎలా పోషిస్తాడు? అది వాళ్ళవల్ల కాదు. కొంత కష్టపడి, సాధనచేసి సాధించవచ్చుగాని ఆ పనులు అతికించినట్టే ఉంటాయి తప్ప వాటిలో కళాపరమైన ఔన్నత్యం, సౌకుమార్యం, అందం కనిపించవు.

మానవాళిమీద, మానవత్వంమీద ప్రగాఢమైన ప్రేమ ఉన్నవాళ్ళే నిజమైన రచయితలు అవుతారు. మిగతావాళ్ళు అలావచ్చి కాసేపు వెలిగి ఇలా వెళ్ళేవాళ్ళే. వాళ్ళు డబ్బు, పేరు తప్ప ఇంకేం సాధించలేరు.

నక్సలైట్ల ఈ కిడ్నాప్ ఆలోచనలోనే లోపం ఉందని రచయితలకు అనిపించినా ఎవరూ ఎదురుమాట్లాడలేదు.

"కామ్రేడ్ పులకేశీ... రేపు వీళ్ళని వేరేచోటికి తీసుకెళ్ళు... ఎక్కువ రోజులు ఒకేచోట ఉంచడం మంచిదికాదు''

"అట్లాగే..."

"రేపు వీళ్ళకి రెండుమూడు గూడేలు చూపించి గిరిజనుల జీవన పరిస్థితుల గురించి వివరించు... ఎల్లుండి సంత... దళారీల జులుం తగ్గించడానికి మన దళ సభ్యులు కొందరు అక్కడికెళ్తారు. మిగతా అన్ని విషయాల గురించి వారంరోజులలోపల రిపోర్టు పంపించు''

"అట్లాగే..."

రాఘవ, అతనితోపాటు వచ్చిన దళసభ్యులు అందరికీ అరుణాభివాదాలు చేసి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

అప్పటికి సాయంత్రం అయింది.

టీ తయారైంది. అందరూ తాగారు.

పరబ్రహ్మం ఒక్కడే దూరంగా చెట్లచాటున కుంగుతున్న సూర్యుడివైపు చూస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

వీళ్ళబారినుంచి తప్పించుకోవడానికి అతనికో ఐడియా తట్టింది.

★ ★ ★

మంటలు పెళపెళలాడుతూ ఎగిశాయి.

కవురుకంపు వ్యాపించింది.

దాంతో ఆ వీధిలోని నారయ్యాకి, రత్నమ్మకి మెలకువ వచ్చింది. మూత్రవిసర్జనకోసం బైటి

కి వచ్చిన కామేశ్వరరావు మండుతున్న పశువుల కొట్టాన్ని చూసి రెండు నిమిషాలు ఆశ్చర్యంతో కొయ్యబారిపోయి హఠాత్తుగా తెలివి తెచ్చుకుని పెద్దగా అరిచాడు. దాంతో చుట్టుపక్కలవాళ్ళు మేలుకొని బిందెలు, కడవలు, బకెట్లతో నీళ్ళుతెచ్చిపోశారు.

కొంతమంది మంటలజోలికి వెళ్ళకుండా తమ ఇళ్ళమీదికి ఎక్కి నీళ్ళు చల్లుకోవడం ప్రాంభించారు. నీళ్ళు పోసినా మంటలు అదుపులోకి రాలేదు. పశువుల కొట్టంలోని మండుతున్న గుంజలు కూలిపోయాయి.

ఆ అరుపులు గందరగోళం విని రామానుజం బైటికి వచ్చాడు. తర్వాత ఛాయ, ఆమె తల్లి వచ్చారు. ఛాయ ఆ మంటల్ని చూసి ఎంతో సంతోషించింది. కాళీప్రసాద్‌మీద ప్రతీకారం తీర్చుకుంటున్నట్టు ఫీలైంది.

అయితే రామానుజం భార్యమాత్రం నోట మాట రాక శిలాప్రతిమలా అలా నిలబడిపోయింది. మండుతున్న పశువుల కొట్టం ఆమెలో భయాన్ని పెంచసాగింది.

ఆ మంటలు ఎందువల్లనో ఏమో తమ ఇంటినీ, ఇంట్లో అందర్నీ చుట్టుముడతాయనీ, దగ్ధం చేస్తాయనీ, అది చూసి కాళీప్రసాద్ వికటాట్టహాసం చేస్తాడని ఆవిడకి అనిపించింది.

ఊళ్ళోని షావుకారు పట్నంలోని అగ్నిమాపక దళానికి, తర్వాత కాళీప్రసాద్‌కి ఫోన్‌చేసి చెప్పాడు. అయితే వాళ్ళు మామూలుగానే ఆలస్యంగా వచ్చేసరికే పశువులకొట్టం బూడిదకుప్పగా మారిపోయింది.

తెల్లవారింది... ఆ ఊళ్ళో రోజువారీ జీవన కార్యక్రమం ప్రారంభమైంది. మంచినీళ్ళు తెచ్చుకోవడానికి వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు. కూరగాయలవాళ్ళు పెద్దగా కేకలు వేస్తున్నారు. మాలపల్లెలోనివాళ్ళు తాళ్ళుకట్టిన సీసాలతో




వెచ్చాలకొట్టుకు వెళ్తున్నారు. ఊళ్ళో పెద్దరైతులు మాలపల్లెలోకి వెళ్ళకుండా రోడ్డుమీదే నుంచుని పనులికి రమ్మని హడావుడి చేస్తున్నారు. కచేరీ సావిట్లో కుర్రాళ్ళు రాజకీయాలు వదిలేసి సినిమా కబుర్లు చెప్పుకుంటున్నారు.

రామానుజం వేపపుల్ల నోట్లో పెట్టుకుని ఇంటిముందు ఊరికే అటూఇటూ తిరుగుతున్నాడు. రకరకాల ఆలోచనలు, భయాలు అనుమానాలు ఆయన్ని చుట్టుముడుతున్నాయి.

కాశీప్రసాద్ ఊరుకోడు. ఇప్పుడెలాగూ తనని పిలిపిస్తాడు. అడుగుతాడు. ఏంచెప్పాలి? ఏంచెప్పినా నమ్మిచావడు. లాయర్ నోటీసు ఇవ్వకుండా ఊరుకుంటే పోయేది. కూతురు మాటలు విని ధైర్యసాహసాలు అరువు తెచ్చుకుని రంగంలోకి దిగితే ఏమైంది? పశువుల కొట్టం తగలడింది.

కాశీప్రసాద్‌తో తగాదా పెట్టుకుని బతకలేం. పొలానికి నీళ్ళు రానివ్వడు. మోటారుకి కరెంటు అందనివ్వడు. కోపరేటివ్ బాంకులో అప్పు దొరకనివ్వడు. ఎరువులు దక్కనివ్వడు. ఆడాళ్ళని వెకిలిమాటలు, చూపులతో వేధించిచస్తాడు.

ఇప్పుడేం చెయ్యాలి?

లొంగిపోయి, క్షమాపణ చెప్పుకుని ఇకముందు బుద్ధిగా వినయవిధేయతలతో బతుకుతానని హామీ ఇవ్వడమా?

లేకపోతే

ధైర్యం తెచ్చుకుని, ఏదైతే అదవుతుందని ఎదురు తిరగడమా?

వేపపుల్లని కసకసా నములుతూ ఆలోచిస్తున్నాడు రామానుజం.

అందుకే ఛాయ మాటల్ని ఆయన మొదట్లో పట్టించుకునేవాడు కాదు. రాజకీయాలగురించి, సాహిత్యం గురించి, సామాజిక పరిస్థితులగురించి ఛాయ చెబుతుంటే నోరు తెరు

# ఏరిన ముత్యాలు

☆ "తప్పును ఒప్పుకోవడంలో సిగ్గులేదు. అలా ఒప్పుకుంటే నిన్నటికన్నా నేడు ఎక్కువ వివేకం పొందుతారు''

-పోప్

☆ "సిగ్గుపడాల్సింది నేరం చేసినపుడు కాని శిక్ష అనుభవిస్తున్నప్పుడు కాదు''

-ఓల్టేయిర్

☆ "మానవుడి జీవితం భగవంతుడు స్వహస్తంతో రాసిన ఒక అద్భుత గాథ"

-హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్

☆ "ఎక్కడైతే చట్టం న్యాయం అంతమవుతాయో, అక్కడ క్రౌర్యం, హింస ప్రారంభమవుతాయి''

-విలియమ్ పిట్

☆ "డబ్బు అనేది మంచి సేవకుడిలాంటిదనేది నిజమేగానీ, దానంత చెడ్డ యజమాని కూడా లేడు''

-బేకన్

☆ "ఎవరైతే తమ అభిప్రాయాలు మార్చుకొనకుండా, తమ పొరపాట్లు సరిదిద్దుకోకుండా వుంటారో వారు ఎప్పటికీ వివేకవంతులు కాలేరు''

-ఎడ్వర్డ్

☆ "మన మిత్రులు చూపే మిథ్యానురాగం శ్రేయోభిలాషుల పేరుతో మనలను పాడుచేస్తుంది''

-సెనేకా

☆ "అప్పులపాలు కావడం దుర్గుణాలలో మొదటిది, అబద్ధాలాడటం దుర్గుణాలలో రెండవది''

-బెంజిమన్ ఫ్రాంక్లిన్

☆ "నీవు ఇతరుల తప్పును వేలెత్తి చూపించేటప్పుడు నీవంక మూడు వేళ్ళు చూపిస్తున్నాయనే సంగతి మరిచిపోకు''

-మహాత్మాగాంధీ

☆ "స్త్రీలు సమాజానికి ఆభరణంలాంటివారు. అన్ని దొంగతనాలలోకి స్త్రీని దొంగిలించడం అతివినాశకరం"

-రవీంద్రనాథ్‌ఠాగూర్

☆ "కోపం ఎప్పుడూ మనిషిని మందమతిగాను, నిర్భాగ్యుడిగానూ తయారుచేస్తుంది''

-ఫ్రాన్సిస్ బేకన్

సేకరణ: కె.వెంకట రామఅక్కయ్య

చుకు వినేవాడు. తన కూతురు గొప్ప మేధావని, ఆమెకి ఎన్నో విషయాలు తెలుసునని మురిసిపోయేవాడు. తన కూతురికి ఎన్ని ఆర్థిక ఇబ్బందులు వచ్చినా పట్నంలో మంచి చదువు చెప్పించినందుకు గర్వించేవాడు.

ఛాయ తండ్రికి రోజూ ఎన్నో విషయాలు ఓపిగ్గా చెప్పేది. జీవితం సంఘర్షణలమయమని, ధైర్యంగా బతకడమే ముఖ్యమని బోధించేది. దురుద్దేశంతో, దుష్టబుద్ధితో స్థలం ఆక్రమించుకున్న కాశీప్రసాద్‌కి భయపడటం అర్థరహితమని చెప్పింది. అలాంటివాళ్ళని ఏదోఒకదశలో ఆపకపోతే లాభం ఉండదని ప్రబోధించింది. దాంతో రామానుజం కొంత ధైర్యంతెచ్చుకున్నా, ఆయన రక్తంలో జీర్ణించుకుపోయిన భయశకలాలు అప్పుడప్పుడూ గుచ్చుకుంటూనే వున్నాయి.

ఆడపిల్ల అంత ధైర్యంగా, నిర్భయంగా ఉంటే తను పిరికివాడిలా ఉండిపోవడం ఆయనకే నచ్చలేదు. దాంతో తన స్థలం ఆక్రమించుకున్న కాశీప్రసాద్‌మీద కోపం వచ్చింది. తనేం వెర్రివెధవ కాదు, చూస్తూ ఊరుకోడానికి... అనే ఆత్మజ్ఞానం తెచ్చుకుని లాయర్ నోటీసు ఇప్పించాడు. బాగానే వుంది. ఇప్పుడు తన స్థలంలో ఆయన వేసుకున్న పశువుల కొట్టానికి ఎవరో నిప్పుపెట్టారు.

ఇప్పుడేంచెయ్యాలి?

"ఏంనాన్నా? ఆ వేప్పుల్ల మొత్తం నమిలేస్తావా ఏమిటి?" అడిగింది చాలా సేపటినుంచి తండ్రినే గమనిస్తున్న ఛాయ.

"అబ్బే లేదు, లేదు..."

"ఆలోచన ఆపేసి ప్రశాంతంగా ఉండు''

"అవునూ, నిన్నో ప్రశ్న అడగాలనుకుంటున్నాను ఛాయా... నిజం చెబుతావా?"

"అడగండి..."

"మనకి కాశీప్రసాద్‌తో గొడవొచ్చిందని ఆ పట్నంపిల్ల భవానికి చెప్పావుగదూ..."

"చెప్పాను..."

"నీ పెళ్ళి ఆగిపోవడానికి కారణం ఆయనేనని చెప్పావుగదూ..."

"చెప్పాను..."

"ఇప్పుడా పిల్లేకదూ పశువుల కొట్టాన్ని తగలబెట్టించింది?"

"అవునేమో..."

"ఏమో ఏమిటీ? అయితే నువ్వే తగలబెట్టుంటావు''

"నేనా... నీ అనుమానాలు, భయాలు చూస్తుంటే నవ్వొస్తోంది నాన్నా''

"వాటి సంగతి అట్లా ఉంచు... నిజంచెప్పు... పశువుల కొట్టం తగలబెట్టిందెవరు?"

"నాకు తెలీదు. నాలుగు రోజులు పోతే తెలియొచ్చు''

"ఇప్పుడు కాశీప్రసాద్‌కి ఏం జవాబుచెప్పాలి?"

"నేను చెబుతాను... నువ్వూరుకో''

"సరే నీ ఇష్టం..." అన్నాడు రామానుజం, పెరట్లో నీళ్ళతొట్టి దగ్గరికి వెళ్తూ

గుమ్మం దగ్గర నిలబడి వాళ్ళ మాటలు వింటున్న రామానుజం భార్యమాత్రం అమితంగా భయపడుతూనే ఉంది. భవాని ఆవిడకి మొదటిచూపులోనే ఝాన్సీలక్ష్మీబాయిలాగా కనిపించింది.

"అయితే ఆ పట్నం పిల్లేనన్నమాట ఇదంతా చేయించింది''

ఛాయ ఆ మాటలు విన్నదిగాని ఏం మాట్లాడలేదు.

"కాశీప్రసాద్ ఖాళీస్థలం వాడుకుంటే వాడుకుంటాడు. గడ్డివామి వేసుకున్నా, పశువులకొట్టం కట్టుకున్నా మనకేం నష్టంలేదు. పట్నంలో చదివొచ్చాననే గర్వంతో ప్లీడర్‌నోటీసు ఇప్పిస్తే ఇప్పుడేమైంది. నీ పెళ్ళి ఆగిపోయింది. ఇప్పుడాయన పశువుల కొట్టం తగలబడింది. వాడసలే మీసాలంటుకున్న పెద్దపులి. మనల్ని బతకనివ్వడు. లేనిపోని గొడవంతా కొంపమీదికి తీసుకొచ్చావు. వింటున్నావా?"

ఛాయ మాట్లాడలేదు.

"అందుకే 'ఆడముండకి చదువొద్దని పెద్దాళ్ళు చెప్పారు. చదివించినా చాకలిపద్దులు రాసేంత చదువు చెప్పిస్తే చాలని అన్నారు. నిన్ను పట్నంలో చదివించి మేం సాధించిందేంవుంది? ఆ దిక్కుమాలిన పుస్తకాలన్నీ చదివి మీ నాన్నకి లేనిపోనివన్నీ నూరిపోసి ఇంతదూరం తెచ్చావు. నేను చెప్పేది వినిపిస్తోందా?"

ఛాయ మాట్లాడలేదు.

"ఇప్పుడు పెళ్ళి ఎట్లాగూ తప్పిపోయింది. పట్నం వెళ్ళి ఉద్యోగం వెదుక్కుని అక్కడే వుండు. ఊళ్ళో రాజకీయాలు నీకెందుకు? కూటికా, గుడ్డకా? నువ్విక్కడ లేకపోతే మీ నాన్న మళ్ళీ తడిసిన అప్పడంలాగానే ఉండిపోతాడు. ఏ గొడవా ఉండదు. అయినా నిన్నని ఏంలాభంలే... కూతురు చెప్పే ప్రతిమాటకి తానతందానా అనే ఆయన్ని అనాలి. రామ, రామ... చీకటి పడితే ఒంటేలుకి వెళ్ళలేనాయన ఈ గొడవకి దిగడం ఆశ్చర్యంగా ఉంది. కాశీప్రసాద్ మనుషులు సహకార బాంకు ఎన్నికలప్పుడు గొడవలకి దిగి నలుగుర్ని తంతే ఏమైంది? ఏంకాలేదు... పోలీసులు పదిమందిని అరెస్టుచేసి తీసుకెళ్ళారు. రెండ్రోజుల తర్వాత విడిచిపెట్టారు. అప్పుడు ఊళ్ళో ఏ మగాడన్నా ఆళ్ళకి వ్యతిరేకంగా సాక్ష్యంచెప్పడానికి ముందుకొచ్చాడా? లేదు... తర్వాత కాశీప్రసాద్ కొడుకు తక్కువ కులం పిల్లని ప్రేమిస్తున్నాడని తెలిసినప్పుడు వాడేంచేశాడు? వాళ్ళని ఊర్నించి వెళ్ళగొట్టాడు. వాళ్ళు పొలంపుట్రా అమ్ముకుని పట్నం వెళ్ళారు. నువ్వూ అదేపని చెయ్యి. మాకూ నీకూ కూడా సుఖంగా ఉంటుంది. అవునూ, ఎంతసేపూ నేను మాట్లాడటం తప్ప నువ్వేం మాట్లాడవేం?"

ఛాయ నవ్వింది.

"ఊళ్ళో కిరసనాయిలు వాడుచెప్పినట్టే ఇవ్వాలి. రేషన్‌కార్డులూ అంతే. సర్పంచ్ ఎన్నికలూ అంతే. ఊళ్ళోకి పెద్దోళ్ళు ఎవరొచ్చినా స్వాగత సత్కారాలు ఆడే ఏర్పాటుచెయ్యాలి. పంచాయితీ ఆఫీసులో తాగితందనాలాడ్డానికి వాడికో గది ప్రత్యేకంగా ఉండాలి. ఊళ్ళో టీచర్లు వాడిమాటే వినాలి. లేకపోతే ట్రాన్స్‌ఫర్. చెరువులో చేపలపాట... కొబ్బరికాయల పాట తను చెప్పినవాళ్ళకే ఇవ్వాలి. అట్లా వాడు మిట్టమధ్యాహ్నం సూర్యుడుమల్లె మండిపోతావుంటే, రాజ్యం చెలాయిస్తావుంటే ఆడపిల్లవి నువ్వేం చేస్తావు? మీనాన్నేం చేస్తాడు? అందుకని ఇందాక నేను చెప్పినట్టు చెయ్. పట్నం వెళ్ళిపో'

ఛాయ ఏదో జవాబు చెప్పబోయిందిగాని అంతలో రఘురాం మెల్లిగా ఇంటిముందుకు వచ్చాడు.

అతను లుంగీ పైకి ఎగ్గట్టాడు.

భుజాన ఇస్త్రీ చేసి మడతపెట్టిన కండువా ఉంది.

కుడిచేతిలో కాలుతున్న సిగరెట్టు వుంది. ఛాయని చూసి అతను చిరునవ్వు నవ్వాడు.

"మీ నాన్న ఇంట్లో ఉన్నాడా?"

"ఆఁ ఉన్నారు"

"కాశీప్రసాద్‌గారు రమ్మంటున్నారు. అర్జెంట్..."

మళ్ళీ ఇంకోసారి చిరునవ్వు నవ్వి వెళ్లిపోయాడు రఘురాం. ఛాయ లోపలికి వెళ్ళి ఆ సంగతి తండ్రికి చెప్పి చీరె మార్చుకుని తనూ బయలుదేరింది.

"నువ్వెక్కడికే?" తల్లి అడిగింది ఆక్రోశంగా.

"నాన్నతోపాటు వెళ్తున్నాను"

"ఓర్నాయనో... నువ్వు గుండెలు తీసిన బంటువే. నదురూ, బెదురూ లేదు. సరే ఎళ్ళెళ్ళు... ఆయనకేం సమాధానం చెబుతావో చెప్పు. నేనూ చూస్తాను"

ఛాయ నవ్వి తండ్రితో కలిసి వెళ్ళిపోయింది.




"ఏం రామానుజం, బాగున్నావా?" అడిగాడు కాళీప్రసాద్.

రామానుజం తలూపాడు తప్ప మాట్లాడలేదు.

"బాగానే ఉన్నాం..." అంది ఛాయ.

"పశువుల కొట్టానికి నిప్పు పెట్టేది, తర్వాత ఏం తెలీనట్టు నీళ్ళుపోసేది..."

"నిప్పు పెట్టింది మేంకాదు'' అన్నాడు రామానుజం మెల్లిగా.

"ఎవరో పెట్రోలు పోసి నిప్పంటించారుట... నాకు తెలిసింది''

"మాకు నిజంగా తెలీదు''

"నీకేం తెలీకుండానే నీ స్థలంలో ఉన్న నా పశువుల కొట్టం తగలబడిపోయిందా? ఊరికే బుకాయించకు. నిజం చెబితే సరే, లేకపోతే ఏంచెయ్యాలో, ఎట్లా చెయ్యాలో నాకు తెలుసు''

"ఏం చేస్తారు?"

"పోలీస్ రిపోర్టు ఇస్తాను. వాళ్ళొచ్చి ఎవరు చేశారో తేల్చేస్తారు''

"మీ ఇష్టం..." అంది ఛాయ.

కాళీప్రసాద్ నవ్వాడు. ఒక ఆడపిల్ల తన మాటలకి ఏం భయపడకపోవడం, తనెదురుగా అదీ తనంతటివాడి ఎదురుగా ధైర్యంగా నిలబడి సమాధానం చెప్పడం ఆయనకెందుకో నచ్చింది. ఇలాంటి పిల్లమీద ప్రతీకారానికి దిగడంకంటె మంచిచేసుకుంటే తనకి పనికొస్తుందనిపించింది. అసలు ఇలాంటి పిల్ల దొరికితే పట్నంలో ఏకంగా బంగళా కట్టించి ఇవ్వడూ. తనకి తెలిసినవాళ్ళూ, కోరికలు తీర్చేవాళ్ళూ చాలామందే ఉన్నారుగాని ఛాయ అందంగాని, దీని మొహంలోని చైతన్యంగాని వాళ్ళకి లేవు. ముఖ్యంగా ఆ కళ్ళు... చాలా బాగున్నాయి... అయితే ఛాయమీద మోజుతో తను మరీ తగ్గిపోవడం బాగుండదు.

"చూడు రామానుజం... మనలో మనకి ఎన్ని తగాదాలున్నా ఒకేఊళ్ళో ఉంటున్నవాళ్ళం... ఉండాల్సినవాళ్ళం... పశువుల కొట్టం, గడ్డివామి తగలబడటంవల్ల నాకు ఇరవైవేలు నష్టం. అయినా నిన్ను ఒక్కపైసా కూడా అడగను. పోలీస్ రిపోర్ట్ ఇవ్వను... దిగులుపడకు''

"థాంక్స్...." అంది ఛాయ.

"థాంక్స్... గీంక్సూ ఎందుకు? మనంమనం కావాల్సినవాళ్ళం" అని ఆగి "జరిగిపోయిందేదో జరిగిపోయింది. దాన్ని తవ్వుకుని లాభంలేదు. అందుకని మనం రాజీకి వద్దాం"

"ఏంచేద్దామో చెప్పండి'' అన్నాడు రామానుజం, ఆయన మాటలధోరణి అంతుబట్టక.

"ఆ స్థలం నాపేరున రాసెయ్... డబ్బిస్తాను... నువ్వు చేసిన తప్పులన్నీ క్షమిస్తాను. నీ కూతురికి పట్నంలో మంచి ఉద్యోగం ఇప్పిస్తాను. ఇల్లు ఇప్పిస్తాను... నేను అప్పుడప్పుడూ వెళ్ళి చూసొస్తుంటాను... ఏమంటావ్?"

రామానుజం మాట్లాడలేదు. కాళీప్రసాద్ ఇంతమంచిగా ఎందుకు మాట్లాడుతున్నాడో ఆయనకి మొదట అర్థంకాలేదు. ఎంత రాతి లాంటి మనిషిలోనైనా మానవత్వం ఉంటుందని తాత్వికులు, మానవతావాదులు, భావవాదులు చెబుతుంటారుగదా అలాగే కాళీప్రసాద్‌లో కూడా మానవత్వం మేల్కొందని రెండుక్షణాలు సంతోషించాడు. అయితే ఆయన మాటలతో ఆ సంతోషం మంచులా కరిగిపోయింది. వీడి అసలు ఉద్దేశం ఇదన్నమాట. ఛాయమీద కన్నేశాడు. ఉద్యోగం, ఇల్లూ ఇప్పించి అప్పుడప్పుడు వెళ్ళొస్తాననడంలో వాడి ఉద్దేశం తెలిసిపోవడంలేదూ.

రామానుజానికి కోపం వచ్చింది.

క్షణాల్లో అతను ఆగ్రహోదగ్రంగా మారిపోయాడు. ఉంటే ఉంటాం, పోతేపోతాం. కాళీప్రసాద్‌కి లొంగివుండే ప్రసక్తిలేదు. తను చూస్తూ ఊరుకుంటే ఇవాళ కూతుర్ని అడిగినవాడు రేపు తన భార్యని అడగడని గ్యారంటీ ఏవుంది?"

పోలీసుల్నే దించుతాడో, సైన్యాన్ని దించు తాడో ఆయన ఇష్టం. తను భయపడే ప్రసక్తిలే దు. ఒక నిర్ణయానికి వచ్చేశాడు రామానుజం.

"ఏం కాళీప్రసాద్‌గారూ... నేనాస్థలం మీపేర రాసిస్తే డబ్బిస్తారుగదూ''

"అవును'' అన్నాడు కాళీప్రసాద్ ఆనందంగా.

"నా కూతురికి ఉద్యోగం, ఇల్లూ ఇప్పిస్తారు గదూ''

"నిరభ్యంతరంగా''

"మీరు అప్పుడప్పుడూ వెళ్ళొస్తుంటారుగ దూ''

జవాబు చెప్పకుండా సగర్వంగా నవ్వాడు కాళీప్రసాద్, ఛాయవైపు చూస్తూ.

"ఆ స్థలం ఊరికే రాసిస్తాను. మీరు పైసా ఇవ్వక్కర్లేదు. అయితే ఒక్కటే షరతు''

"ఏవిటది?"

"ఒక రాత్రికి నీ పెళ్ళాన్ని పంపించు, నా దగ్గరికి''

ఆమాట అనేసి ఛాయ చెయ్యి పట్టుకుని చకచకా వెళ్లిపోయాడు రామానుజం.

కాళీప్రసాద్‌కి రెండుక్షణాలు ఆ మాటల అర్థం బోధపడలేదు. అర్థమయ్యాక ఆవే శంతో, ఆగ్రహంతో నిలువెల్లా వణికిపోయాడు. ఆయనలో అహం పడగవిప్పి, బుసలు కొ ట్టడం ప్రారంభించింది.

రఘురాంని కేకేసి పట్నంవెళ్ళి యస్.ఐ. రవిరాజాని వెంటనే యమఅర్జెంటుగా తీసుకు రమ్మని చెప్పిపంపించాడు.

ఛాయ కూడా పట్నానికి బయలుదేరింది, ఆ ఖాళీస్థలం 'హెల్ప్' సంస్థకి రాసిస్తామని చెప్పడం కోసం.

సూర్యోదయమైంది.

నిద్రలేచిన రచయితలు ఒక్కొక్కళ్ళే కాల కృత్యాలు ముగించుకుని వచ్చారు.

"ఇహ బయల్దేరుదామా?" అడిగాడు పుల కేశి.

రచయితలు తలలూపి, లేచి బ్రీఫ్‌కేసులు తీసుకున్నారు.

అడవి నిశ్శబ్దంగా ఉంది.

రచయితల కళ్ళు మనుషుల కోసం వెతుకు తున్నాయి.

"ఎంత దూరం నడవాలి?" అడిగాడు కి శోర్‌కుమార్.

"ఎక్కువదూరం లేదు. మహా అయితే మూడు మైళ్లు''

రచయితలకి ఒక్కసారిగా ఎక్కడలేని నీరసం ముంచుకొచ్చింది.

"అంతదూరం నడవలేం''

"మధ్యలో విశ్రాంతి తీసుకునే నడు ద్దాంగాని దిగులుపడకండి''

అందరూ మౌనంగా నడవడం ప్రా రంభించారు. ముందు పులకేశి, పుల్లయ్య మధ్యలో రచయితలు వాళ్ళ వెనక మరో ఇద్దరూ అలా సాగిపోతున్నారు.

"ఆ గూడెంలో ఎంతసేపుండాలి?" అడిగా డు పరబ్రహ్మం.

"మీ ఇష్టం వచ్చినంతసేపు''

ఈలోపు పోలీసులు వస్తే?"

"దిగులేంలేదు. మీమీద ఈగవాలకుండా చూసుకుంటా''

నడిచి నడిచి రెండుచోట్ల కాసేపు విశ్రాంతి తీసుకుని ఒక గూడెం పొలిమేరల్లోకి వచ్చారు వాళ్లు. మొత్తం యాభై ఇళ్లు కూడా లేవు. ఒకటి రెండు పెంకుటిళ్లు. మిగతావన్నీ పూరిళ్ళే. చుట్టూదళ్లు. చిన్న పశువుల పాకలు. చూ స్తుండగానే చిన్నపిల్లలు వాళ్ళని చుట్టుముట్టా రు. పులకేశి వాళ్ళని దగ్గరికి తీసుకుని పలక రించాడు. వాళ్ళలో ఎవరికీ వంటిమీద బట్టలు సరిగ్గా లేవు. కాళ్లూ చేతులకి దుమ్ము, సన్నగా బలహీనంగా ఉన్నారు. రచయితలకి ఇంగ్లీష్ సినిమా 'క్లోజ్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్




క్లైండ్ లో ఆఫ్రికన్ పిల్లలు గుర్తొచ్చారు.

ఒకచోట బోరింగ్ పంపు దగ్గర కొందరు ఆడవాళ్లు నీళ్లు పట్టుకుంటూ వాళ్ళవైపు చూశారు. అంతే వెంటనే బుంగలు వదిలేసి నవ్వు మొహాలతో దగ్గరకి వచ్చారు.

"రాం, రాం దాదలూ''

"రాం, రాం"

"శనాదినాలైంది మీరు రాక. గీసార్లెవ్వరు చూస్తంటే మనోళ్లమల్లె కనిపియ్యటంలేదు''

"కతలు రాసేటోళ్లు''

వాళ్లు అర్థం కానట్టు చూశారు.

"బొక్కులు, పుస్తకాలు రాసేటోళ్లు''

"వామ్మో... ఆళ్లని గీడికెందుకు తీసుకొచ్చిన్రు?"

"మీ బతుకులన్నీ చూయించడానికి''

"ఈడేవుంది చూట్టానికి? పారెస్టోళ్ళ దౌర్జన్యం. జీబుల్లో వచ్చే అదికారుల పెత్నలు. అయ్యి జేత్తాం: ఇయ్యి జేత్తాం అని సెప్పటం. మొన్నీమజ్జె కరంటుస్తంభాలు పాతిపోయిన్రు. ఇంతమట్కు దీపాలు ఎలగలేదు. సంతల్లో దళారీనాకొడుకులు దోసుకుతింటున్నరు''

"ఈ యేడు పంటలెట్లున్నయ్''

"అట్లనే ఉన్నయ్. వర్షాలు సరింగలేవుగదా. అయినా మమ్ముల్ని అడగాల్నా మీకు తెల్వదూ''

"తెలుసు. ఈళ్లకోసం అడిగిన" అన్నాడు పులకేశి రచయితలవైపు చూస్తూ.

"వీళ్లు సంతలోకి ఏవేం తీసుకెళ్తారు?" అడిగాడు నాగార్జున.

ఆ పూరిల్లు, అక్కడి పిల్లలు, పెద్దల్ని చూసి అతనికెందుకో బాధేసింది.

నగరంలో పుట్టి నగరంలో నివసిస్తున్న నాగార్జునకి గ్రామాల గురించి, అక్కడి మనుషుల గురించి, వాళ్ళ సమస్యల గురించి ఏమీ తెలీదు. ఎప్పుడన్నా బస్సులోనో, రైల్లోనో వెళ్తున్నప్పుడు చిన్న చిన్న గ్రామాన్ని గ్యాలరీలో పెట్టిన రంగురంగుల చిత్రపటాల్లా చూడటం మినహా.

"చింతపండు, జిగురు, ఇప్పపూలు, కాయలు పళ్లు... కోళ్లు, గొర్రెలు, మేకలు, గేదెలు... ఇలా అన్నీ తీసుకెళ్ళి అమ్ముకుంటారు. గిరిజనాభివృద్ధి సంస్థకి అమ్ముకుంటే బాగానే ఇస్తారుగాని వీళ్లు అంత దూరం వెళ్ళలేరు. సంతలో దళారీలు మింగేస్తారు. అక్కడన్నీ తప్పుడు కొలతలే''

"వీళ్ళ అమాయకత్వం, అజ్ఞానం ఆసరాగా చేసుకుని దోచేస్తున్నారు'' అన్నాడు వివేకానంద.

అతను గిరిజన జీవితాలకు సంబంధించిన కొన్ని పుస్తకాలు చదివాడు. పత్రికలో అప్పుడప్పుడూ వచ్చే వార్తావ్యాసాలు ఆసక్తిగా చదువుతుంటాడు. వాళ్ళమీద రాద్దామని ఎంతోకాలంనించి అనుకుంటున్నాడుగాని శ్రుతపాండిత్యంవల్ల ఉపయోగంలేదని, ఒకవేళ రాసినా పేలవంగా ఉంటుందని అనుకుని ఆగిపోయాడు.

ఇప్పుడు తనకా అవకాశం రావచ్చు. గిరిజన జీవితాల గురించి మరింత తెలుసుకోవాలని అనుకున్నాడు.

"మేం వచ్చాక పరిస్థితిలో కొంతమార్పు వచ్చింది. రోడ్లు పడ్డాయ్. కరెంటు వచ్చింది. అంగన్‌వాడి స్కూళ్ళొచ్చాయి. అయితే జరిగింది చాలా తక్కువ. జరగాల్సింది ఇంకా చాలా ఉంది'' అన్నాడు పులకేశి.

"మరి వ్యవసాయం..."

"అదీ అంతే. పోడువ్యవసాయం పనికిరాదని, అడవులు ధ్వంసమై పోతాయని ప్రభుత్వం గొడవ చేస్తోంది. ఒకవైపు ఫారెస్ట్ కంట్రాక్టర్లు వందల ఎకరాల్లో కలపని తరలిస్తున్నా ఏం మాట్లాడదు. అడుగడుగునా అవినీతి, లంచాలు. గిరిజనులు నాలుగు పుల్లలకోసం అడవికెళ్తే ఫారెస్టోళ్లు పీడించేస్తారు. ఆ పన్ను కట్టమని, ఈ పన్ను కట్టమని వేధిస్తారు. కంట్రాక్టర్ల దగ్గర ముడుపులు మింగి వదిలేస్తారు. అదీగాక ప్రభుత్వం ప్రతిఏడూ సామాజికా

వసరాలకోసం రిజర్వ్ ఫారెస్టు ఏరియాని పెంచుతోంది. దాంతో వీళ్ళకి జీవనాధారం పోతోంది''

"దానికితోడు సవాలక్ష చట్టాలు''

"అవును. గిరిజనుల భూముని మైదాన ప్రాంతంవాళ్లు కొనుక్కోకూడదని చట్టం ఉంది గాని అది ఆచరణలో అమలు కావడంలేదు. వీళ్లు డబ్బుకోసం అమ్మేస్తారు. మళ్ళీ వాళ్లు వీళ్ళకి అతితక్కువ కూలీరేట్లిచ్చి పనీపాటా చేయించుకుని ఆస్తులు, అంతస్థులు పెంచుకుంటున్నారు. మేం వచ్చి అది బంద్ చేయించాం. అలాంటివాళ్ళమీద కోర్టుల్లో కేసులు పెట్టించాం. అవి తెగవు, ముడిపడవు. వీళ్లు ఏళ్ళకి ఏళ్లు కోర్టుల చుట్టూ తిరగడంతోనే సరిపోతోంది. అయితే వీళ్లు ఈమాత్రమైనా వేళకి రెండుముద్దలు తింటున్నారంటే దానిక్కారణం మేమే. గిరిజనుల్లో ఐక్యత, చైతన్యం తీసుకొచ్చాం. ధైర్యం నేర్పాం, పోరాడే శక్తి పెంచాం'' చెప్పాడు పులకేశి. అలా చెబుతున్నప్పుడు అతని కళ్ళలో ఆత్మవిశ్వాసంతో నిండిన కాంతిరేఖలు కనిపించాయి.

కష్టాల్లో, నష్టాల్లో, బాధల్లో ఉన్నవాళ్ళని ఆదుకోవడంలో, వాళ్ళకి సహాయపడటంలో గొప్ప ఆత్మసంతృప్తి ఉంది. ఆ సంతృప్తిని పూర్తిగా అనుభవిస్తున్నవాడిలా కనిపించాడు పులకేశి.

"అయితే దీనికోసం మీరు ఎన్నో త్యాగాలు చేయాల్సివచ్చింది. ఎంతోమందిని బలి ఇవ్వాల్సివచ్చింది''

"అవును'' అన్నాడు పులకేశి.

"ఎంతోమంది పోలీస్‌స్టేషన్లలో, జైళ్లలో మగ్గుతున్నారు''

"అవును... ఇంకా ఎన్ని కష్టాలైనా ఎదుర్కొంటాం. ఎన్ని నష్టాలొచ్చినా భరిస్తాం. మా ఊపిరి పోరాటం. మా ప్రాణం పోరాటం,







మా రక్తం పోరాటం. వీళ్ళ శ్రమఫలితం వీళ్ళకి పూర్తిగా దక్కేవరకు, అన్నిరకాల పీడనల నుంచి, దోపిడీలనుంచి విముక్తి సాధించేవరకు మేం విశ్రమించం"

"కాని..." ఆగిపోయాడు వివేకానంద. మిగతా రచయితలందరూ దగ్గరికి వచ్చి ఆసక్తిగా వినసాగారు.

"మీ అనుమానాలు నాకు తెలుసు వివేకానందగారూ... గిరిజనుల సమస్యలు పరిష్కరించడానికి ఆయుధం పట్టుకోవాలా అనేకదూ''

"అవును''

"ఆయుధం అవసరమయ్యే పట్టుకున్నాం తప్ప మాకు దానిమీద మోజుండి కాదు. అయినా గజచర్మంగాళ్ళకి ఆయుధం చూపిస్తే తప్ప దారికిరారు. హితవచనాలు, నీతిబోధలు విని మనుషులు మంచిగా మారతారని అనుకోవడం బుద్ధిహీనత తప్ప మరోటికాదు''

"కాని''

"దీనికోసం ప్రాణాలు పణంగా పెట్టడం ఎందుకనికదూ మీ ప్రశ్న?" నవ్వుతూ అడిగాడు పులకేశి.

"అవును''

"అందరం ఏదోరోజు పోయేవాళ్ళమే. సంసారాలు చేసి ఆస్తులు పెంచుకుని రోజువారీ జీవితంలో మునిగిపోయి, కూరుకుపోయి చనిపోవడంకంటే ఇది మంచిదని, సమాజానికి మేలు చేస్తుందని, మమేకం చేస్తుందని మా నమ్మకం. విశ్వాసం. ఇంతకంటే మీకేం చెప్పలేను''

వివేకానంద మళ్ళీ 'కాని' అనబోయి ఆగిపోయాడు. ఇది ఇలాంటి ఘాటైన, తీవ్రమైన చర్చలకి అనువైన స్థలంకాదు, పైగా సమయంకాదు. అయినా ఇలాంటి సీరియస్ విషయాలు గురించి పులకేశిలాంటి చిన్న నాయకు

డితో చర్చించి లాభంలేదు. ఈదితే మహాస ముద్రమే ఈదాలి.

"అయితే ఇలాంటి పరిస్థితులు కేవలం గిరిజన గ్రామాల్లోనే కాదు, దేశంలో అన్ని హరిజనవాడల్లో కూడా ఉన్నాయికాని వాళ్లు ఆయుధాలు పట్టుకోలేదు'' అన్నాడు గురుదేవ్.

"ప్రభుత్వం ఏదో ఒరగబెడుతుందనే భ్రమలో ఉన్నారు వాళ్లు. ప్రభుత్వం వోట్లకోసం రిజర్వేషన్ సౌకర్యం కల్పించిందనే సంగతి మరిచిపోతున్నారు. వాళ్లు కూడా ఏదోరోజు మా మార్గానికి రాకతప్పదు''

"వాళ్లు మీ మార్గానికి వస్తారనుకోకపోతే, మీరే వాళ్ల మార్గానికి వెళ్లకూడదూ''

"అంటే బెదిరింపులు, బతిమిలాటలు, వినయవిధేయతలతో అణిగిమణిగి వుండటం. దానివల్ల ఒక్క సమస్య కూడా పరిష్కారం కాదు. ఇంకా అణచివేత, దోపిడీ ఎక్కువ కావడం తప్ప''

కిశోర్‌కుమార్ ఏదో అడగబోయాడు గాని అంతలో ఓ గిరిజనయువతి అంది.

"సోవయ్యా తన బిడ్డని రాతిరంతా కొట్టిండు. బువ్వ పెట్టకుండా లోపలేసి తాళం పెట్టిండు''

"దేనికి?" అడిగాడు పులకేశి.

"కిందటోరం సంతకెళ్లినప్పుడు అది సింత పండమ్మి వచ్చిన పైసల్తోని పోడరు, సునో, చమక్‌చమక్ గాజులు కొనుక్కుందట. అయెందో మొహాన పెట్టుకునే బిల్లలు కూడా కొనుక్కుందంట. ఈడసలుకే తిండికి లేక చస్తాఉంటే నీకు సోకులు కావాల్సొచ్చినయ్యా అని సితగ్గొట్టిండు. అది ఏడుస్తా కూకున్నాది''

"సర్లె మేం వెళ్ళి మాట్లాడతం ఇంకేవన్నా పంచాయతీలున్నయ్యా?"

"ఇంకేం లేవు. పారెస్టోళ్లు, దొంగసారా కంట్రాక్టర్లు మామూలుగనే వచ్చిపోతాఉన్నరు''

"పోలీసోళ్లు''

"ఆళ్ళీమజ్జె కనిపియ్యడంలేదు. ఏదోదినం అర్ధరేత్రి వచ్చి నానాగొడవచేసి వెళ్తరు. ఆళ్ళ సంగతి మీకూ మాకూ ఎరికేగందా''

"అవునవును. మేం వెళ్తాం. ఆ సివర అంగన్‌వాడి ఇస్కూలు కోసం కడుతున్న ఇంట్ల ఉంటం. తిండి పంపిచండ్రి.

"అట్లనే''

సుకుమారంగా, కోమలంగా ఉన్న రచయితలవైపు ఆశ్చర్యంగా చూస్తూ మళ్లీ బోరింగ్ పంపుగగ్గరికి వెళ్లారు గిరిజన మహిళలు. వాళ్ళలో ఎవరి వంటిమీద సరైన బట్టలేదు. ఎవరూ ఆరోగ్యంగా లేరు. జీవితం అనుక్షణం కొడుతున్న దెబ్బలకి కుంగిపోయిన మనుషుల్లా ఉన్నారు వాళ్లు. ఇంట్లో పనిచేసుకుని, అడవికెళ్లి, రకరకాల సరుకులు సేకరించి, వాటిని సంతలో అమ్మి వచ్చే డబ్బుతో వెచ్చాలు కొనుక్కుని, పొలాల్లో పగలూ రాత్రి కష్టపడుతూ... రచయితలకి ఒక్కసారి నగరాల్లో, పట్నాల్లోని ఆడవాళ్లు గుర్తొచ్చారు. కుక్కర్‌తో గ్యాస్ స్టౌమీద వంటచేస్తూ, గ్రైండర్, ఫ్రిజ్‌లతో కాలక్షేపంచేస్తూ అరగంట వంటకే అలిసిపోయి తెగ ఆయాసపడుతూ జలుబుచేసినా డాక్టర్ దగ్గరికి పరిగెత్తే వాళ్లెక్కడ? వీళ్లెక్కడ?

"పదండి వెళ్దాం" అన్నాడు పులకేశి.

అందరూ అతన్ని అనుసరించారు.

"అమెరికన్ సంస్కృతి వీళ్ళ దగ్గరిదాకా వచ్చేసింది'' అన్నాడు తను.

"అదేవిటి?" అడిగాడు పరబ్రహ్మం.

"వీళ్ళక్కూడా పౌడర్, స్నో కావాలని పిస్తోంది. సినిమాలు చూస్తున్నారు. పట్నాల్లో దొరికే సుఖాలకోసం ఎగబడుతున్నారు. పెట్టుబడిదారీ విషం ఇక్కడిదాకా వ్యాపించింది''

"దీన్ని ఆపడం ఎలా?" అడిగాడు వివేకానంద.

"అదే మాకూ అర్థం కావడంలేదు'' అన్నాడు తను నవ్వుతూ.

పులకేశి ఒక ఇంటిముందు ఆగడంతో




రచయితలు కూడా ఆగారు. ఇద్దరు నక్సలైట్లు లోపలికివెళ్లి సోమయ్యని తీసుకొచ్చారు.

"రాం రాం దాదలూ... శాయ్ ఇయ్యనా?"

"ఇప్పుడేం వద్దుగాని... సంతలో నీ బిడ్డ అయ్యేవో కొనుక్కున్నాదని కొడుతున్నావట ఏంది కత?"

"అయ్యి కొనుక్కున్నాదని కాదు కామ్రేడ్లూ, దానికి సినిమాలు, షికార్లు కావల్సొచ్చినయ్. ఆడెవుడితోనో సైకిల్ మోటారు మీదెళ్లి ఒక దినం గడిపొచ్చినాది. ఏడికెళ్ళావే అంటే ఖామోషీగుంటది. నేను సంతకెళ్ళి వాకబు చేస్తే దాని బాగోతం బైటికొచ్చినాది. ఆడెవుడో దీనికి సిలుకు చీరెకొనిచ్చిండు. గిప్పుడేం జెయ్యమంటరో మీరే సెప్పున్రి"

"ఆడెవుడో కనుక్కుని మేం ఇరగ్గొడుతంలే. నీ బిడ్డని జాగర్తగా చూసుకో. కొట్టమాక. వస్తం"

అందరూ కలిసి గూడెం చివరికి వెళ్ళారు. అక్కడ నిర్మాణదశలో ఉన్న ఓ ఐదుగదుల ఇల్లుంది. పైన స్లాబ్ వేశారుగాని లోపల ప్లాస్టరింగ్ వగైరాపనులు పూర్తికాలేదు.

అప్పటికే అక్కడో గిరిజనుడు వాళ్లకోసం ఎదురుచూస్తున్నాడు. అతను నీటిచుక్క ఎరగని మోడు చెట్టులాఉన్నాడు. సగం తెల్లబడిన గడ్డం, పొడుగాటి మొహం, తలగుడ్డ, రంగు మారిన ధోవతి. అతని మోహంలో ఆదుర్దా, ఆందోళన స్పష్టంగా కనిపిస్తున్నాయి. అతను పులకేశిని చూడగానే ముందుకొచ్చి నమస్తే చెప్పాడు.

"మీరు గూడెంకి వచ్చిన్రని తెలిసి వచ్చిన. శనాసేపట్నించి ఎదురుజూస్తున్న"

"ఏందికత? ఎట్లున్నవ్?"

"ఏదో ఇట్లేడుస్తున్న చేతికందొచ్చిన కొడుకుని పోలీసోళ్లు సంపిన్రుగదా"

"మాకెరికే పీడితజనం కోసం ప్రాణత్యాగం చేసిండు కామ్రేడ్ లచ్చన్న. ఏడిసి ప్రయోజనంలేదు. గుండె రాయి చేసుకుని బతకడమే"

"నా కుటుంబంమీద పగబట్టిన్రు పోలీసులు. కిందటేడాది నా మేనల్లుణ్ణి ఏస్కబోయిన్రు. ఆడిమీద ఆళ్లకి తోచిన కేసులన్నీ బనాయించి జైలుకి పంపించిన్రు. ఆడికి నిజంగా ఏ పాపం తెల్వద్. బినామీగాడు"

"ఎరికేనన్నా. మాకన్నీ ఎరికే. బాదపడమాక. మనకీ మంచిరోజులొస్తయ్"

"ఆడికీ గ్రామంలో కట్టే స్మారకస్తూపానికీ ఏం సంబంధంలేదని ఎన్ని ఇదాల, ఎన్ని తీర్లుగ సెప్పినా పోలీసుల ఇనకపోయిరి. ఆణ్ణి లాక్కుపోయిన్రు. ఈసారి అన్నలకి కూడు, గుడ్డా ఇస్తున్నాడని నా కొడుకుని అన్యాయంగా ఏసేసిన్రు. ఇదేవని అడిగేటోడు లేడు. జమానా ఆళ్లది. ఆళ్లు సెప్పిందే న్యాయం. సేసిందే దర్మం. గిప్పుడేం జూసుకుని బతకాలె. ఇంట్ల మాయాడది ఒక తీర్గ ఏడుస్తాంది. కొడుకు మీద దిగులుతో ఇదీ సచ్చేటట్టే ఉంది. నన్ను ఇన్ని ఇదాల బాదలు పెట్టిన ఆడు మాత్తరం తినితాగి బేఫికర్‌గ తిరుగుతుండు"

"ఆ మల్లికార్జునంగాడేనా?"

"ఔ... ఆడే..."

"ఆడికి శనాసార్లు మంచిగ జెప్పిజూసినంగాని ఇగ లాభంలేదు. ఆడికి సిచ్చపడిపోవలసిందే"

"ఆ మల్లికార్జునంగాడు నిన్న రాత్తిరే ఈడికొచ్చిండు. ఆడ తినుడికి, తాగుడికి పైసలెవరిస్తరు? శనాదినాలు ఆడా ఈడా తలదాసుకుని ఏడా బతకలేక ఈడకొచ్చిండు"

"వచ్చిండా?"

"వచ్చిండు. మల్లేశం గుడిసెలో ఉన్నడు. ఊరికూరికే భయపడుతుండు. ఏమాటా చెప్పకుండా ఏడుస్తుండు. అన్నలు బతకనివ్వరని కనిపించిన ప్రతోడితో సెబుతుండంట"

"ఊర్లకి రావటం ఎందుకు? పోలీసోళ్ళతోనే ఉండమను. బద్మాష్‌గాడు. ఆడిమూలాన మనోల్లు, అదే నీ కొడుకు, ఇంకోడు ఖతమైపోయిన్రు. నీ మేనల్లుడు జైలుకెళ్లిండు"

"పోలీసోళ్లు రెండు మూడుదినాలు తిండిపె

ట్టి ఆమాటా ఈమాటా జెప్పి ఖుషీ చేసి(న్రంట. ఈడు తనకి యాదికొచ్చిన సంగతులన్నీ జెప్పిండంట. తర్వాత ఆళ్ళొదిలిపెడితే వోరం దినాలు ఆడా ఈడా తిరిగి బువ్వదొరక్క ఈడికొచ్చిండంట"

"ఈడ కూడా బువ్వ దొరకనివ్వం.ఆడినేవన్నా తుపాకీ పట్టమన్నామా? మాతోపాటు రమ్మన్నామా? మేం ఎక్కడెక్కడ తిరుగుతున్నామో, ఏమేం జేస్తున్నామో పోలీసోళ్లకి చెప్పడం ఎందుకు? ఇంతదూరం తెచ్చుకోవటం ఎందుకు?"

"కామ్రేడ్స్... ఆణ్ణి లాక్కురండి'' ఆదేశించాడు పులకేశి.

ఇద్దరు నక్సలైట్లు వెంటనే వెళ్ళిపోయారు. ఆ వచ్చిన గిరిజనుడు తనపని దిగ్విజయంగా పూర్తయిందనే ఆనందంతో మరోసారి అభివాదంచేసి వెళ్లిపోయాడు.

పదినిమిషాల తర్వాత వాళ్లు మల్లికార్జునాన్ని తీసుకొచ్చారు. పులకేశిని చూసీ చూడగానే అతడు గజగజా వణికిపోయాడు.

"తప్పుచేసిన నన్ను వదిలెయ్ అన్నా''

"ఎన్నిసార్లు చెప్పినంరా నీకు. మూడుసార్లు పోనీలే అని చిన్న చిన్న శిచ్చలేసి వదిలిపెట్టినంగదా. నువ్వు మళ్ళీ పోలీసోళ్ళ దగ్గరకెళ్ళి ఎందుకు జెప్పినవు?"

"ఆళ్ళు బెదిరించి నిజం జెప్పకపోతే తంతమన్నరే అన్నా... నేను ఎదురు దిరిగిన... ఇరగొట్టిం(డు... ఆ బాధలు పడలేక కక్కేసిన"

"నువ్వు జెప్పిన దినం రాత్తిరే పోలీసొళ్లొచ్చి మా వాళ్ళిద్దర్నీ కాల్చి పారేసి(ను. మర్రాడు పేపరోళ్ళతో మామూలుగనే ఎన్‌కౌంటర్ కథ చెప్పి(ను... దీనికేం జవాబు చెబుతవ్?"

"నన్ను వదిలెయ్ అన్నా... ఇగ బుద్ధిగుంట"

"ఈసారి ఆళ్ళు మళ్ళీ బెదిరించి, కొంచెం ఖుషీచేస్తే మళ్ళీ చెబుతవ్... ఆళ్ళు నీకు పైసలిచ్చి(నా''

"లే... ఇయ్యలే..."

"మంచిగ జూసుకున్నరా?"

"చూసుకున్నరు... నే సెప్పింతర్వాత"

"ఈసారి పైసలిచ్చి ఇంకా మంచిగ జూసుకుంటామంటే ఇంకెన్ని సంగతులు చెబుతవో... అందుకని నీకు శిచ్చ తప్పదు. ఆర్నెల్లు ఇంట్ల ఉండేటట్టు శిచ్చిస్తం... అనుబగించు''

ఆ నలుగురు తీవ్రవాదులు మల్లిఖార్జునాన్ని బైట చెట్టు దగ్గరికి తీసుకువెళ్ళాడు.

తర్వాత దెబ్బలమోత...

అరుపులు, కేకలు, బతిమిలాటలు, మూలుగులు... ఊళ్ళో వాళ్ళు ఆ కేకలు విని అక్కడ గుమికూడారుగాని ఎవరూ ఏం మాట్లాడలేదు. కొందరు ఆడాళ్ళు ఆ దృశ్యం చూడలేక కొద్ది క్షణాలుండి వెళ్ళిపోయారు.

తర్వాత ఎవరో వచ్చి మల్లిఖార్జునాన్ని ఇంటికి మోసుకుపోయారు.

రచయితలు చూస్తూ ఊరుకున్నారు తప్ప ఏం మాట్లాడలేదు. సోమయ్యని శిక్షించడం తప్పో ఒప్పో వాళ్ళకి అర్ధంకాలేదు. చెప్పకపోతే పోలీసులు హింసిస్తారు. చెబితే విప్లవకారులు తంతారు. మల్లిఖార్జునంలాంటివాళ్ళ పరిస్థితిచూసి వాళ్ళకి జాలేసింది.

మిగిలిన నలుగురు రచయితలు ఆ సంఘటన గురించి ఆలోచిస్తున్నారుగాని, పరబ్రహ్మం ఆలోచన వేరే విధంగా ఉంది. ఇందాక గిరిజన స్త్రీలు చెప్పినదాన్నిబట్టి ఇక్కడకి దగ్గర్లోనే ప్రతివారం సంత జరుగుతుంది.

రెండోది ఇందాక మల్లికార్జునం గురించి ఆ గిరిజనుడు చెప్పిందానిబట్టి పట్నం అనేదేదో ఇక్కడికి దగ్గర్లోనే ఉంది. కాబట్టి తను తొందరపడటం అత్యవసరం, శ్రేయస్కరం. ఏమిటో వెధవలు పట్నం, పట్నం అంటారు తప్ప దానిపేరు చెప్పిచావరని విసుక్కున్నాడతను.

కొంచెం చీకటిపడేదాకా ఆగి పులకేశికి చిటికెనవేలు చూపించి బైటికి వెళ్ళాడు పరబ్రహ్మం, అంతకుముందే జేబులో పెట్టుకున్న




బిస్కెట్ పాకెట్‌ని తడువుకుంటూ, అటూ ఇటూ చూస్తూ ముందుకు వెళ్ళి ఒకచోట దుమ్ములో ఆడుకుంటున్న పిల్లల్ని చూసి ఆగిపోయాడు.

పట్నం వెళ్ళే దారి గురించి ఈ పిల్లల్ని అడిగితే మంచిదా లేక పెద్దవాళ్ళని అడిగితే మంచిదా ఒక్కక్షణం సదసత్సంశయం వచ్చింది పరబ్రహ్మానికి. ఇందాక ఇన్‌ఫార్మర్ గురించి చెప్పింది పెద్దవాడే. తనిలా ఎస్కేప్ మార్గాల గురించి అడిగితే వాడు వెళ్ళి విప్లవకారులికి చెప్పాడంటే చాలా ఇబ్బంది. అందుకని పిల్లలే బెటరు.

"ఇదుగో ఇలా రండి'' అన్నాడు పరబ్రహ్మం.

ఆడుకుంటున్న పిల్లలు ఆగిపోయి అతని వైపు విచిత్రంగా, అపనమ్మకంగా చూశారు పాంటూ, చొక్కా, బూట్లు, కళ్ళజోడు పెట్టుకున్న వీడెవడా అన్నట్టు.

"మిమ్మల్నే... ఇలారండి''

పిల్లలు అలా చూస్తుండిపోయారు తప్ప అంగుళం కూడా కదలలేదు...

"ఇదుగో, మీకు బిస్కెట్లిస్తాను... రండి'' అన్నాడతను జేబులోంచి బిస్కెట్ పాకెట్ తీసి చూపిస్తూ, వాళ్ళు అప్పటికీ కదలలేదు. దాంతో పరబ్రహ్మం వాళ్ళలో నమ్మకం పుట్టించడానికి పాకెట్ విప్పదీసి ఒకటి తను తిని, మిగతా పాకెట్ ముందుకుచాచాడు.

వాళ్ళు దగ్గరికొచ్చారు, అప్పటికీ అనుమానంగానే.

పరబ్రహ్మం వాళ్ళకి తలా ఒక బిస్కెట్ ఇచ్చి అడిగాడు.

"ఇదుగో, ఇక్కడ సంతెప్పుడు జరుగుతుంది సంత, సంత"

"పున్నమినాడు'' చెప్పాడో పిల్లవాడు. పౌర్ణమి, ఏకాదశి చతుర్ధి, సప్తమిలాంటి గొడవలు ఎప్పుడో మరిచిపోయిన పరబ్రహ్మానికి ఆ కుర్రాడు చెప్పింది సరిగ్గా అర్ధం కాలేదు.

"ఏవారం?"

"పున్నమినాడే''

"వారంరా, వారం... ఏవారం?"

ఆ కుర్రాళ్ళు పెద్దగా నవ్వి ముక్తకంఠంతో 'తెల్వద్' అన్నాడు. పరబ్రహ్మానికి విసుగుపుట్టింది. అయినా ప్రయత్నం మానడం వీరపురుషుల లక్షణంకాదని మళ్ళీ ప్రయత్నించాడు.

"అదొదిలేయండిగాని... పట్నం ఇక్కడికెంత దూరం?"

"శానా దూరం"

"ఎటు వెళ్ళాలి?"

"ఇటు..." అడవివైపు చూపించాడో కుర్రాడు. అడవిలోంచి వెళ్తే పట్నం ఎలా వస్తుందో పరబ్రహ్మానికి అర్ధంకాలేదు.

"బాట ఉందా?"

"నడవాల... శనా దూరం... ఆణ్ణించి బస్సెక్కితే పట్నం వస్తాది''

"ఎంత దూరం?"

"శనా దూరం"

"నీ మొహం దూరం, సరిగ్గా చెప్పేడువ్"

మళ్ళీ ఆ కుర్రాళ్ళు పెద్దగా నవ్వి ముక్తకంఠంతో 'తెల్వద్' అని ప్రకటించాడు.

"అది సరేగాని, రోడ్డుందా దగ్గర్లో"

వాళ్ళు ఏం అర్ధం కానట్టు చూశారు...

"అదేరా 'సడక్, సడక్'"

"ఉంది గాని శనా దూరం నడవాలె"

రోడ్డు లేదు, బస్సుల్లేవు, రాత్రిపూట లైట్లు లేవు. ఎక్కడికి వెళ్ళాలన్నా మైళ్ళకిమైళ్ళు నడిచి చావాలి... పరబ్రహ్మం గిరిజనులమీద కంటే తనమీద తనే ఎక్కువ జాలిపడ్డాడు. ఏది అడిగినా వాళ్ళు శనా దూరం అని చెప్పడం, నవ్వడం తప్ప ఏ సమాచారం చెప్పలేదని అతనికి అర్ధమైపోయింది.

దాంతో నిరాశగా వెనక్కిదిరిగాడు.

నిదానంగా నడుస్తుంటే అతనికో పథకం తట్టింది. అయితే ఆ పథకాన్ని అమల్లో పెట్టాలంటే అన్నలు తమని ఏదో ఒక గూడెంలోనే

ఉంచాలి. వాళ్ళలా ఉంచుతారో మళ్ళీ అడవుల్లోకి తీసుకెళ్తారో తెలీడంలేదు. ఎలా చావడం?

పరబ్రహ్మం అంగన్‌వాడి భవనంలోకి వెళ్ళాడు. పులకేశి అతనివైపు చూసి ఎందుకో నవ్వాడు.

పెందలాడే భోజనాలు వచ్చాయి. అందరూ భోంచేసి పక్కలు పరుచుకున్నారు. చుట్టూ చీకటి, నిర్మాణంలో ఉన్న ఒంటరి భవనం, ఎక్కడా అలికిడిలేదు. రచయితల్లో ఒకరికీ నిద్రపట్టలేదు.

సరిగ్గా అప్పుడే...

ఆ గ్రామానికి కొంచెం దూరంగా గుడ్డి వెన్నెల్లో ఓ ఎడ్లబండి వెళ్తోంది. బక్కచిక్కిన ఎడ్లు భారంగా, నిదానంగా కదులుతున్నాయి. అందులో పరిచిన గడ్డిమీద మల్లికార్జునం పడుకుని ఉన్నాడు. అతనికి స్పృహలేదు. అతనిచుట్టూ నలుగురు కూర్చుని ఉన్నారు.

మల్లికార్జునాన్ని ఆస్పత్రిలో చేర్చడానికి టౌనుకు తీసుకువెళ్తున్నారు వాళ్ళు.



చీకటి పడుతుండగా దుమ్ము రేపుకుంటూ రామచంద్రాపురం వచ్చింది పోలీసుజీపు. ఆ జీపుని చూడగానే అమ్మలక్కలు ఎక్కడ పని అక్కడే వదిలేసి గుమ్మాలకి అతుక్కుపోయారు కుతూహలంగా, ఆసక్తిగా చూస్తూ.

చిన్నపిల్లలు పోలీసులకి సెల్యూట్ చేశారు. కొందరు దానివెంటపడి పోలీసులు లాఠీలు చూపడంతో ఆగిపోయారు.

ఆ జీపొచ్చి రామానుజం ఇంటిముందు ఆగింది.

ఇద్దరు కానిస్టేబుళ్ళు భారంగా దిగి లోపలికి వెళ్ళారు... యస్.ఐ. రవిరాజా దిద్దీలాసంగా సిగరెట్ పొగ వదులుతూ జీపులోనే కూర్చుండిపోయారు.

"రామానుజం ఉన్నాడా?" అడిగాడో కానిస్టేబుల్ దర్పంగా.

"ఉన్నారు" చెప్పింది ఛాయ.

"పిలువ్... యస్.ఐ.గారు రమ్మంటున్నారు"

"దేనికి?"

"ఆయనే చెబుతారు. పిలువ్"

ఆ మాటలు విని రామానుజం బైటికి వచ్చాడు. కాశీప్రసాద్ పోలీసుల్ని రంగంలోకి దించుతాడని, తనని ఇంకా చిత్రహింసలు పెడతాడని ఆయన ముందే ఊహించాడు. దాంతో ఆయనకి ఇదమిద్ధంగా తెలీని ధైర్యం వచ్చింది. ఏదిఏమైనా తల దించకూడదని, కాశీప్రసాద్‌మీద సమరం సాగించాల్సిందేనని ఒక నిర్ణయానికి వచ్చాడు. తను ఏమైపోయినా పరవాలేదనే మొండితనం ఆయన్ని ఆవహించింది.

"నేనే రామానుజాన్ని"

"మిమ్మల్ని యస్.ఐగారు రమ్మంటున్నారు."

"ఏమిటీ కేసు?"

"స్టేషన్‌లో చెబుతారు రండి" అన్నాడు రెండో కానిస్టేబుల్ అదోలా నవ్వుతూ.

"పదండి"

"ఛాయతల్లి మెల్లిగా గుమ్మంలోకి వచ్చి కానిస్టేబుళ్ళవైపు భయంభయంగా చూసి ఆ సంభాషణ విని బిగుసుకుపోయింది. ఆవిడకి మెదడు, శరీరం మొద్దుబారిపోయినట్టు అనిపించింది. మామూలు పరిస్థితుల్లో అయితే కాశీప్రసాద్‌ని శాపనార్థాలుపెట్టి, పోలీసుల్ని




బతిమిలాడేదేమో కాని ప్రస్తుతం ఆవిడకేం చెయ్యాలో తోచడంలేదు. ఆవిడలా స్థాణువులా నిలబడి చూస్తుండగానే రామానుజం ఎక్కిన జీపు వెళ్ళిపోయింది.

దాంతో ఆవిడకి ఒక్కసారి వంటిమీదికి తెలివి వచ్చింది.

"మీనాన్నకి ఏవేవో నూరిపోస్తున్నావ్ గదా, ఇప్పుడేం చేస్తావో చెయ్యి'' అందావిడ ఆక్రోశంగా, ఛాయ వైపు చూస్తూ.

"గొడవ చెయ్యకే అమ్మా... మాట్లాడకుండా కూర్చో''

"ఏం మాట్లాడకుండా ఎట్లా ఉంటాను... ఇవాళ ఇప్పుడే అటో ఇటో తేలిపోవాలి... నువ్వసలు మీనాన్నని బతకనిచ్చేటట్టులేవు... పోలీసులు లాకప్పుల్లో జనాన్ని చంపేస్తున్న రోజులు... ఇప్పుడీయన్ని ఏం చేస్తారో ఏమిటో... ఆయనకి ఏదన్నా అయితే దానిక్కారణం నువ్వే. నీమూలానే ఈ గొడవ ఇంత దూరం వచ్చింది. లేకపోతే మేం చూసీ చూడనట్టు పోయేవాళ్ళం"

"ఇప్పుడూ అలాగే ఉండు... నష్టమేంలేదు''

"నీకేం ఎన్ని కబుర్లయినా చెబుతావ్... నీ దిక్కుమాలిన భావాలవల్ల మేం దిక్కులేని చావు చచ్చేటట్టున్నాం"

"ఏం చావనే... కొత్త జీవితం ప్రారంభమవుతుంది''

"అవునవును... కొత్త జీవితం. ఉన్న ఊళ్ళో ఇల్లూ పొలమూ తెగనమ్మి పట్నం వెళ్ళి కొత్తజీవితం ప్రారంభించడమే మిగిలింది.. నువ్వు ఇంతపని చేస్తావని ముందే అనుకున్నాను. ఇంత రభస జరిగినా, ఆయన్ని పోలీసులు జీపులో ఎక్కించుకుని తీసుకెళ్ళినా, ఇంత మంది ఉన్న ఊళ్ళో ఏ గాడిదకొడుకైనా అడ్డొచ్చాడేమో చూడు. ఆ కాళీప్రసాద్‌కి ఎదురు తిరగడం ఎందుకు? లేనిపోని తలనొప్పి తెచ్చుకోవడం ఎందుకు? పదపద వెళ్ళి వాడి కాళ్ళమీద పడదాం... ఆ స్థలం మొత్తం వాణ్ణే తీసుకోమను. వాడి పేరునే రాసిద్దాం... వాడిక్కావాల్సింది అదే కదా పద పద"

"నోర్ముయ్''

"నన్నే నోర్ముయ్యమంటావులే... ఏం చూసుకుని ఇంత విర్రవీగుతున్నావో, ఇంత అహం పెంచుకుని ధీమాగా ఉన్నావో నాకర్థం కావడంలేదు. ఏది ఏమైనా సరే నా భర్తని నేను రక్షించుకుంటానే ఛాయా... వెళ్ళి కాళ్ళమీద పడతాను''

"కాళ్ళమీద కాదే అమ్మా... ఆయన పడగ్గదిలోకి వెళ్ళి ఈ రాత్రి గడపితే చాలు''

"ఛీ...'' ఆపుకోలేని కోపంతో కూతుర్ని లాగిపెట్టి చెంపమీద కొట్టింది.

ఛాయ తెరలు తెరలుగా విరగబడి నవ్వింది. హఠాత్తుగా ముందుకెళ్ళి తల్లిని ముద్దుపెట్టుకుంది.

"నేనీ మాటంటేనే ఇంత కోపం వచ్చింది... కాళీప్రసాద్ నీ కూతుర్ని ఉంచుకుంటానంటే నాన్నకి ఎంత కోపం వచ్చుంటుందో ఆలోచించు''

"ఆс... అంత మాటన్నాడా?"

"అన్నాడు... నువ్వు బాధపడతావని, తెల్లార్లూ నిద్రపోకుండా ఏడుస్తావని నీకు చెప్పలేదు. అందుకని నిబ్బరంగా ఉండు. నాన్నకి ఏం కాదు... ఒకవేళ ఏదన్నా జరిగితే' ఆపేసింది ఛాయ.

ఆవిడ ఏం మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

★ ★ ★

రామానుజం లాకప్‌లో గోడకి ఆనుకుని కూర్చుని ఉన్నాడు. అక్కడ అతనితోపాటు ముగ్గురున్నారు.

లోపల ఓ మూల రెండు ప్లాస్టిక్ గ్లాసులు, ఒక చిన్న బొచ్చె ఉన్నాయి. మూత్రం వాసన ముక్కు పుటాల్ని అదరగొట్టేస్తోంది. రామానుజానికి ఎన్నడూ అలాంటి పరిస్థితులు అనుభ

వంలోకి రాకపోవడంవల్ల కొంతసేపు చాలా ఇబ్బందిపడ్డాడు.

"ఏ వూరు మంది?" అడిగాడొకడు.

రామానుజం మాట్లాడలేదు. ఒక విధమైన నిరామయస్థితి సాధించేసిన వాడిలా అతని వైపు నిరాసక్తంగా చూశాడు.

"రేయ్ బచ్చా... ఏ వూరు మంది?"

"ఈ ఊరేరా... గురూగారు చెప్పడంలేదు"

"కాదనుకుంటా... ఎక్కడా చూసినట్టు గుర్తులేదు"

"ఈ ఊరా, పొరుగూరా?"

రామానుజం మెల్లిగా తలెత్తి వాళ్ళవైపు చూసి నవ్వాడు.

"ఏవూరైతే మీకెందుకు?"

"తెలుసుకుందామని గురూగారూ... చెబితే మీ సొమ్మేంపోతుంది?"

"రామచంద్రాపురం"

"ఆ ఊరా... అక్కడోసారి దొంగతనం చేశా" చెప్పాడొకడు ఆనందంగా, సగర్వంగా.

"కేసేమిటి?"

"దొమ్మీ కేసేమో అనుకుందాం అంటే వీసెడు బరువులేవు. నువ్వేం దొమ్మీకి దిగుతావు. దొంగతనం కేసేమో అనుకుందాం అంటే మొహం చూస్తే అట్లా అనిపించడంలేదు. ఆ తెగింపూ లేదు. ధైర్యంలేదు. మానభంగమా అనుకుంటే అది నీవల్ల కాదని తెలుస్తూనే ఉంది. చీటింగ్ అనుకుందాం అంటే నిన్ను ఛీట్ చెయ్యడం తప్ప, నువ్వెవణ్నీ ఛీట్ చేసేటట్టు కనిపించడంలేదు. ఆస్తి తగాదాలా అనుకుందాం అంటే నీకు అరెకరం తప్ప లేనట్టు కనిపిస్తోంది. రాజకీయాల గొడవా అనుకుందామంటే ఎవడు పిలిస్తే వాడి జెండా పట్టుకుని చూపించిన లారీ ఎక్కేటట్టున్నావు తప్ప ఏం చేసేటట్టు కనిపించడంలేదు.




ఇంతకీ నీ కేసేంటి గురూ''

రామానుజం జవాబు చెప్పకుండా నవ్వాడు

అంతలో ఓ కానిస్టేబుల్ వచ్చి లాకప్ తలుపుమీద లాఠీతో టకటకా కొట్టాడు.

''ఏరా లాకప్‌లో కబుర్లేంటి నోర్మూసుకోండి... యస్.ఐగారు వస్తున్నారు''

దాంతో అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

యస్.ఐ. రవిరాజా పోలీస్‌స్టేషన్ ఆవరణలో మోటారు సైకిల్ స్టాండేసి లోపలికి వచ్చాడు.

రవిరాజా దొరికినంతా సంపాదించుకుందామనే ఈ ఉద్యోగంలో చేరాడు కాబట్టి అతన్ని నీతి, నిజాయితీలాంటి విలువలు మొదట్నించీ పెద్దగా బాధించలేదు. ప్రపంచం ఎప్పుడూ ఇలాగే అతలాకుతలంగా, అస్తవ్యస్తంగా ఉంటుందనీ, తను దీన్ని మార్చడానికి పుట్టిన ప్రవక్త కాదుకాబట్టి వచ్చినంతవరకు గుంజుకుని హాయిగా బతకడమే మంచిదనీ అతడెప్పుడో ఓ నిర్ణయానికివచ్చాడు. ఊళ్ళో రాజకీయ నాయకులు, వారివారి క్రియాశీలక కార్యకర్తలపట్ల ఉదాసీనంగా, ఔదార్యంగా ప్రవర్తించాలని ఉద్యోగంలోకి వచ్చిన కొత్తలోనే గ్రహించాడు.

అయితే వాళ్ళ విషయంలో అంత ఉదారంగా ప్రవర్తించడం ఒక్కసారి మనసులో ముల్లులాగా గుచ్చుకుంటూ ఉంటుంది. ఒక్కోసారి ఈ దగుల్బాజీ రాజకీయాలు నడిపే వాళ్ళని విరగ్గొడదామా అని కూడా అనిపిస్తు ఉంటుంది. అయితే అది తనలాంటి వాడికి ఎలాగూ సాధ్యంకాదు కాబట్టి ఆ కసిని, కోపాన్ని లాకప్‌లో వచ్చిపడిన వాళ్ళమీద చూపించి ఆనందిస్తుంటాడతను.

అతనిలో ఒక ప్రత్యేకత ఏవిటంటే అప్పుడ

ప్పుడు లాకప్‌లో పడినవాళ్ళనుద్దేశించి హితోక్తులు చెప్పడం, అవి విని ఎవడూ బాగుపడలేదు గాని రవిరాజా తన ప్రయత్నంమాత్రం చేస్తుంటాడు. ఇప్పుడు ఆ మూడ్‌లోనే ఉన్నాడతను.

"ఆ రామానుజాన్ని ఇటు తీసుకురారా! చెప్పాడతను కుర్చీలో జారగిలబడి కూర్చుని. కానిస్టేబుల్ లాకప్ తాళం తీశాడు. రామానుజం మెల్లిగా వచ్చి అతని ముందు నిలబడ్డాడు.

"నువ్వు చాలా అదృష్టవంతుడివి రామానుజం" అన్నాడు రవిరాజా.

రామానుజం అర్థంకానట్టు అయోమయంగా చూశాడు.

"నేను రాత్రి స్టేషన్‌లో ఉంటే నిన్ను విరగ్గొట్టి ఉండేవాణ్ణి. కానీ నీ అదృష్టంకొద్దీ పక్కూళ్ళో దొమ్మి జరిగితే, వెళ్ళాను. కాళీప్రసాద్‌గారు నాకు అన్నీ చెప్పారు. ఆయన పెళ్ళాన్ని పంపించమనేంత మగాడివిరా నువ్వు?"

రామానుజం ఏం మాట్లాడలేదు.

"ఏమిటి మాట్లాడవ్? నీతో ఎక్కువసేపు కొట్లాడే టైం లేదు నాకు. అందుకని ఓ మంచి సలహా చెబుతా విను... విని బాగుపడతావో, వినకుండా నాశనమైపోతావో తేల్చుకో"

"చెప్పండి"

"నీ ఖాళీస్థలం కాళీప్రసాద్ కావాలంటున్నాడు. అందుకని అది ఆయనకి రాసిచ్చెయ్... నీ కూతురు ఛాయ ఆ హెల్ప్ వాళ్ళ దగ్గరికి వెళ్ళిందిటగా... ఆ దివాలాకోరు పని మానేయమని చెప్పు... ఇక్కడ మనకి మూడు కోట్ల మంది దేవుళ్ళుంటే ఆ విదేశీ దేవుణ్ణి కొలిచే వాళ్ళకి మనం స్థలం ఇవ్వడం ఏమిటి? పిచ్చి పని కాకపోతే... ఏవంటావ్?..."

"ఆ స్థలం ఆయనకివ్వకపోతే?"

"నానా తిప్పలు పడతావ్... ఆయన పశువుల కొట్టాన్ని తగలబెట్టించావని రిపోర్ట్ ఇచ్చాడు.. మేం చార్జిషీటు పెడతాం... సాక్ష్యాలు తీసుకొస్తాం... జైలుకెళ్తావు. ఆలోచించుకో"

"ఆ పశువులకొట్టాన్ని నేను తగలబెట్టలేదు, పెట్టించలేదు. నాకేం తెలీదు"

"నీకు తెలీకపోతే, నీ కూతురికి తెలుసు. దాని ఫ్రెండుకి తెలుసు. ఆ ఫ్రెండు ఫ్రెండెవడో మాకు తెలుసు. వాడే పెట్రోలు పోసి తగలబెట్టాడు. నువ్వు కాళీప్రసాద్ మాట వింటే మేం చూసీ చూడనట్టు పోతాం... కాదు కూడదంటే నువ్వూ, నీ కూతురు, దాని ఫ్రెండ్స్ అనుభవిస్తారు"

"కేసు పెట్టుకోమనండీ... జైలుకే వెళ్తాను"

"జైలంటే అదేవన్నా ఏసీ హొటల్ అనుకుంటున్నావా ఏంట్రా వెళ్తాను వెళ్తానని చంకలెగరేస్తున్నావు... అదీగాక కాళీప్రసాద్‌గారు నీ కూతురంటే మోజుపడుతున్నాడు. శుభ్రంగా వచ్చిన అవకాశం వాడుకో"

"ఛీ..." అన్నాడు రామానుజం.

"ఛీ... ఛా... అంటే లాభంలేదు రామానుజం. ఆలోచించుకుని జవాబు చెప్పు"

"ఇందులో ఆలోచించుకోడానికేంలేదు. నేను అప్పుడే వాణ్ణి చెప్పుతీసుకుని తన్నాల్సింది... తప్పు చేశాను"

"అయితే ఒప్పుకోవా?"

"ముమ్మాటికీ ఒప్పుకోను. నా కంఠంలో ప్రాణం ఉండగా ఒప్పుకోను. ఆయన ఇష్టం... ఏం చేసుకుంటాడో చేసుకోమనండి"

"అయితే నువ్వెళ్ళొచ్చు"

"అదేమిటి ఇప్పటిదాకా రిపోర్టులు, లాకప్‌లు, చార్జిషీట్లు, జైళ్ళు అన్నారు..."

"అన్నాననుకో... చదరంగంలో పావుల్ని జరపడానికి కొంత టైమ్ పడుతుంది. ఈసారి ఒకేసారి మూడు పావుల్ని జరుపుతాం. ఇక నువ్వెళ్ళొచ్చు"

రామానుజం నమస్కారం చేసి బైటికి వచ్చి పోలీస్‌స్టేషన్‌ముందు నిలబడ్డాడు. ఇప్పుడేంచెయ్యాలి? కాళీప్రసాద్‌కి లొంగిపోవడం ఇష్టంలేదు. అయితే ఆయన్ని ఎలా ఎది




రించాలో తెలీడంలేదు. ఏంచెయ్యాలి? పోనీ యస్.పి. దగ్గరికి స్వయంగా వెళ్ళి తన గోడంతా వినిపించి ఒక వినతిపత్రం ఇస్తే ఏదన్నా ఉపయోగం ఉంటుందా? ఉండొచ్చు. ఉండకపోవచ్చు... ఇలాంటి సందర్భాల్లో రాజకీయనాయకులైతే కొంత సాయం చేస్తారేమో గాని తనకి ఎవరూ తెలీదు. ఏ పార్టీతోనూ సంబంధాలు లేవు. ఎప్పుడన్నా రామచంద్రాపురానికి మంత్రులొస్తే దూరంనుంచి చూడటం తప్ప...

లేకపోతే భవాని దగ్గరికి వెళ్తే... ముందు అమ్మాయికి అన్ని సంగతులు చెప్పి, తర్వాత యస్.పి. దగ్గరికి వెళ్ళాలి.

మధ్యాహ్నం ఎండ మండిపోతోంది. రోడ్లన్నీ దాదాపు నిర్మానుష్యంగా ఉన్నాయి. తెరిచి వున్న షాపులదగ్గర కూడా జనం ఎక్కువగా లేరు. అక్కడక్కడా సోడాబళ్ళు, చెరుకురసం బళ్ళున్నాయి.

రామానుజం మెల్లిగా నడుస్తున్నాడు. రోడ్డుపక్క తలొంచుకుని. అంతలో ఓ మినీలారీ విసురుగా మలుపు తిరిగి, అంతే వేగంతో దూసుకువచ్చింది. పరిసరాల్ని పట్టించుకునే స్థితిలో లేని రామానుజాన్ని ఆ మినీలారీ రోడ్డుపక్కకి వచ్చి గుద్దేసి వెళ్ళిపోయింది. రామానుజం రబ్బరుబొమ్మలా అల్లంత దూరం ఎగిరిపడ్డాడు. వళ్ళంతా రక్తమయం... కళ్ళముందు ఏవో అడ్డుతెరలు... క్షణాల్లో అతని ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయింది.

అప్పటిదాకా ఎక్కడెక్కడో ఉన్న జనం యాక్సిడెంట్, యాక్సిడెంట్ అని అరుస్తూ దగ్గరికి వెళ్ళారు.

★ ★ ★

ప్రభుత్వాసుపత్రిలో బెడ్‌మీద పడుకుని పైన నిదానంగా, బద్ధకంగా తిరుగుతున్న ఫ్యాన్ వైపు చూస్తున్నాడు 'తెలుగుసీమ' రిపోర్టర్ లాంటి కంట్రిబ్యూటర్ రామాంజనేయులు.

మూడురోజులక్రితం బాత్‌రూంలో కాలు జారి పడ్డాడతను. పడినప్పుడు నొప్పనిపించలేదుగాని మర్నాడు తుంటి ఎముకదగ్గర నొప్పిచేసి వాచింది. దాంతో తనకు తెలిసిన ప్రైవేట్ డాక్టర్‌దగ్గరికి వెళ్దామా ప్రభుత్వాసుపత్రిలో ఉచిత చికిత్స చేయించుకుందామా అనే మీమాంసలో పడి. ప్రైవేట్ డాక్టర్ ఎక్కువ గుంజుతాడనే భయంతో ప్రభుత్వాస్పత్రిలో చేరాడు. పైగా ప్రభుత్వాస్పత్రిలో నర్సులు, ఆయాలదగ్గర్నించి పెద్దడాక్టర్లవరకు అందరూ తనకి తెలిసినవాళ్ళే. సరిగా వైద్యం చెయ్యకపోతే 'ప్రభుత్వాస్పత్రి - నరకానికి నకలు' శీర్షికతో ఏదో ఒకటి రాసేస్తాడనే భయంతో మంచివైద్యం చేస్తారని అనుకున్నాడు. దాంతో డబ్బుతినేసే ప్రైవేట్ డాక్టర్‌దగ్గరికెళ్ళడం మానేసి ప్రభుత్వాసుపత్రిలో చేరిపోయాడు.

ప్రభుత్వాసుపత్రి డాక్టర్ ఎక్స్‌రే తీశాడు.

తుంటి ఎముక బాగానే ఉంది, విరగలేదు. కొంచెం వాపు, నొప్పి అంతే... ఇంజక్షన్లు చేసి, టాబ్లెట్లు ఇచ్చి నాలుగురోజులు రెస్ట్ తీసుకోమని చెప్పాడు.

ఊరికే పడుకోవడం రామాంజనేయులికి చిరాగ్గా, విసుగ్గానే ఉన్నా వార్తలకోసం అడ్డమైనవాళ్ళ చుట్టూ తిరిగే పని తప్పినందుకుమాత్రం సంతోషించాడు. ప్రభుత్వాస్పత్రిలో ఫినాయిలు, మందులు, రకరకాల రోగాలవాళ్ళ వాసనలకి అతను అలవాటుపడిపోయాడు.

అతన్ని ఒక్కటే బాధిస్తోంది.

'తెలుగుసీమ' కంట్రిబ్యూటర్‌గా రెండేళ్ళనించి పనిచేస్తున్నా అతని ఉద్యోగం ఇంకా పర్మినెంట్ కాలేదు. అలా పర్మినెంట్ కావడంకోసం మేనేజిమెంట్‌కు వినయవిధేయతలు చూపించడం, ఆఫీసుకి వెళ్ళిన ప్రతిసారీ అవసరం ఉన్నా లేకపోయినా వాళ్ళని కలుసుకుని పదేపదే నమస్కారాలుచేయడం, జనవరి ఒకటినాడు, ఉగాదినాడు శుభాకాంక్షలు పంపడంలాంటివి చేస్తున్నాడు. కాని వాళ్ళకింకా రామాంజనేయులు మీద దయకలగలేదు.

ఈ మార్గం లాభంలేదనుకుని పనిమీద శ్రద్ధ పెంచుకుని విరివిగా వార్తలు పంపడం మొదలుపెట్టాడు. పైగా ప్రతి వార్తతో ఒక ఫోటో కూడా. వాటిలో పడేవి పడుతున్నాయ్... లేనివి లేదు. అయితే వార్తలు మిస్ కాకుండా పంపిస్తాడనే పేరుమాత్రం సంపాదించాడు. రామాంజనేయులికి ఇది కొంత సంతృప్తి ఇచ్చింది. దాంతో ఉత్సాహం బాగా పెరిగిపోయి పరిశోధనాత్మక వార్తలు కూడా పంపడం ప్రారంభించాడు. రొయ్యల చెరువు భూఆక్రమణలో ఎమ్మెల్యే హస్తం, ఎరువుల పంపిణీ కుంభకోణం, హత్యకేసులో పోలీసుల ఉదాసీనత, రోజ్‌గార్ యోజన నిధులు ఏమయ్యాయి, గిరిజనులమీద అటవీ అధికారుల జులుం, పోలీసుల స్వైరవిహారం... అలా వచ్చినవే.

అయితే రామాంజనేయులు ఇలా విచ్చలవిడిగా రాయడం స్థానిక అధికారులికి, పోలీసులకి కోపం తెప్పించింది. వాళ్ళు ఒకటిరెండుసార్లు అతన్ని హెచ్చరించారు కొంచెం జాగర్తగా ఉండమని.

దాంతో రామాంజనేయులు తల విదిలించి, కలం చేతబట్టి రొయ్యల చెరువు భూఆక్రమణలో ఎమ్మెల్యే హస్తం లేదు, అది కేవలం కొందరి అపోహ, ఆరోపణమాత్రమేనని ఒక వార్త రాసేశాడు. ఎరువుల పంపిణీ సక్రమంగానే జరిగిందని, హత్యకేసును పోలీసులు పరిష్కరించేశారని, రోజ్‌గార్ నిధులుతో ఫలానా, ఫలానా రోడ్లు వేశారని, గిరిజనుల అభ్యున్నతి కోసం అటవీశాఖ ఎంతో ప్రశంసనీయమైన కృషి చేస్తోందని, పోలీసులు వాళ్ళని ఏమాత్రం వేధించడంలేదని రాసేశాడు.

అయితే తనిలా మార్గం మార్చడం అతనికే ఏమీ నచ్చలేదు. అధికారుల అవినీతిని, అక్రమాలని, అన్యాయాన్ని బాధ్యతాయుతంగా ఎండగట్టాల్సిందిపోయి తనూ వాళ్ళలో చేరిపోవడం అతన్ని చాలా బాధించింది. దీనికి ఏంచేయాలో అతనికేం తోచలేదు. ఏదైతే అదే అవుతుందని ఉన్నది ఉన్నట్టుగా రాసేయడమే మంచిదని అప్పుడప్పుడూ అనిపిస్తోందిగాని తీరా మొదలుపెట్టాక ఏదో భయం, బెరుకు అతన్ని పీడించసాగాయి.

అయితే మొత్తంమీద ఈ నొప్పించిక తానొవ్వక సిద్ధాంతాన్ని అమలుచేయడం ప్రారంభించాక జీవితం మరీ భేషుగ్గా మారిపోయింది. అందుకే ఈమధ్య డీయస్పీ 'నువ్వు చాలా మారిపోయావయ్యా... బాగుపడే లక్షణాలు బాగా కనిపిస్తున్నాయి' అని ప్రశంసాపత్రం ఇచ్చాడు కూడా.

అదంతా గుర్తుకొచ్చేసరికి రామాంజనేయులి పెదాలమీదకి చిరునవ్వు వచ్చింది. మొహంలో నీరసం తగ్గి ఉత్సాహం పెరిగింది. లేచి కాసేపు అలా వరండాలో తిరుగుదాం అనుకుంటూ ఉండగా ఎవరో నలుగురు గిరిజనులు ఒక యువకుణ్ణి తీసుకుని లోపలకి రావడం చూసి ఆగిపోయాడు.

ఆ వచ్చిన నలుగురు ఆ యువకుణ్ణి హెడ్‌నర్స్ సూచనలు సలహాల ప్రకారం బెడ్ మీద పడుకోబెట్టి తప్పుకున్నారు. డాక్టర్ నిదానంగా నిమ్మళంగా వచ్చి అతన్ని పరీక్షించాడు.

"తర్వాత డ్రస్సింగ్ చెయ్యొచ్చు... ముందు సెలైన్ పెట్టి ఇంజక్షన్ చెయ్యి" అని నర్సుకు చెప్పి వెళ్ళిపోయాడు. గిరిజనులు డాక్టర్‌వైపు అయోమయంగా చూసి హెడ్‌నర్సుని చుట్టుముట్టారు.

హెడ్‌నర్స్ సెలైన్ బాటిల్ తీసుకొచ్చి స్టాండ్‌దగ్గరికి జరిపి, ఆ బాటిల్ దానికి తగిలించి, సూదిని చేతి నరంలోకి గుచ్చింది. తర్వాత రెండో చేతికి ఇంజక్షన్ చేసి, ఆ యువకుడివైపు సుదీర్ఘంగా చూసి, నిట్టూర్చి వెళ్ళిపోయింది.

"అన్నల సేతులిరగ... ఆళ్ళింట్ల పీనిగలెల్ల... ఎట్ల కొట్టిండ్రో బిడ్డని... అసలుకి ఆడు సేసిన తప్పేందంట... సెప్పకపోతే సెబుతావా, సస్తవా అని పోలీసోళ్ళు కొట్టిరి, దాంతో




సెప్పిండు. గిప్పుడు మా గురించి సెబుతవురా బద్మాష్ అని అన్నలు కొట్టిన్రు... ఎట్ల సావటం" అని బైట ఆ యువకుడి తండ్రి ఏడుస్తున్నాడు ఆక్రోశంగా.

"ఊకో... ఊకో... లొల్లి బెట్టకు" ఇంకోఅత ను ఆపాడు.

"లొల్లిబెట్టక ఏంజెయ్మంటవ్. నిన్న మా పిటేలనుంచి వాడికి స్పృహలేదు. నానా కష్టా లుపడి ఈడికి తీసుకొచ్చినం. అసలు బతుకు తడో. లేదో..." అన్నాడతను దుఃఖిస్తూ.

"మాట్లాడమాక... బిడ్డని ఈడకి తీసుకొచ్చి నామని తెలిస్తే పోలీసోళ్ళు మళ్ళీ వస్తరు. ఎవరు కొట్టిన్రు. ఎప్పుడు కొట్టిన్రని అడుగుత రు. ఉన్నమాట సెప్పినామంటే ఆళ్ళెళ్ళి అన్న లమీద పడతరు..."

"గీసారి అన్నలసలు ఊర్కోరు. మన నలు గుర్ని సంపి పాతేస్తారు... ఊకో... ఊకో..."

"ఇంట్ల ఆడోల్లకి గీ ముచ్చట తెల్వదే... తెలిస్తే దాని గుండె ఆగిపోతాది"

"సర్లె సర్లె... ఊకో..."

"బిడ్డట్లు ఈకలు పీకిన కోడితీర్గ పడుంటే కడుపు తరుక్కుపోతాంది. నాలుగు నెలలు ఏడేడో తిరిగిండు. ఇంటికి తిరిగొచ్చిండుగ దాని మురిసిపోతుంటే గిదీ జరిగింది. ఈ నాలుగు మాసాలు నాకు కంటిమీద కునుకు లేదు. అన్నం సయించటంలేదు"

'ఊకోమని సెప్పినా ఇనవేందిరా... సీకటి పడంగనే నాలుగు సుక్కలు కల్లుతాగితే నిద్దర అదే పడతాది" ఈసారి తీవ్రంగా హెచ్చరించా డు పక్కనున్నవాడు. దాంతో ఆ సంభాషణ ఆగిపోయింది.

ఆ సంభాషణంతా ఆసక్తిగా విన్న రా మాంజనేయులు పక్కబెడ్‌మీద స్పృహలే కుండా పడున్న యువకుడివైపు చూసి నిట్టూర్చాడు. అతను ఇన్‌ఫార్మరని, నక్సలైట్లు అతన్ని కొట్టారని గ్రహించాడు. ఇలాంటి తీవ్ర మైన విషయాల్లో తను చేసేదేం లేదుకాబట్టి కొంచెం సానుభూతి ప్రకటించి కళ్ళు మూసు కున్నాడు.

టైమ్ ఎంతైందో తెలీదుగాని ఒక రాత్రివేళ ఎవరిదో మూలుగు వినిపించి మెలకువ వచ్చింది రామాంజనేయులికి. అతను మోచే తిమీద పైకి లేచి చుట్టూ చూశాడు. పక్క బెడ్‌మీదున్న గిరిజన యువకుడే మూలుగుతు న్నాడు. అతనికి స్పృహ వచ్చిందని గ్రహించి రామాంజనేయులు లేచి గుమ్మందగ్గరికి వెళ్ళి చూశాడు. గిరిజనులు ఎక్కడా కనిపించలేదు. పీకలదాకా కల్లు తాగేసి ఎక్కడో నిద్రపో యుంటారని అనుకున్నాడతను.

వెనక్కి వచ్చి ఆ యువకుడి దగ్గరకెళ్ళి ముందుకు వంగి అతని మొహంలోకి చూశా డు.

"నీల్లు... నీల్లు..." అన్నాడతను. రామాంజ నేయులు ఆ పక్కనున్న కుండదగ్గరకెళ్ళి మంచినీళ్ళు తెచ్చి, పక్కమీద కూర్చుని మెల్లి గా తాగించాడు.

"నేనేడున్నను?"

"దవాఖానల..." చెప్పాడు రామాంజనే యులు. గిరిజనులతో తెలంగాణావాళ్ళతో మా ట్లాడేటప్పుడు వీలైనన్ని ఉర్దూపదాలు వాడా లని తెలుసుగనుక.

"మావోళ్ళెవురూ రాలేదా?"

"వచ్చిన్రు... బైట ఏడోపన్నరు... వంట్లో ఎట్లున్నది?"

"మంచిగలేదు... వళ్ళంతా నొప్పులే... కా ళ్ళు సేతులు వశంలో లేవు"

"అన్నలు కొట్టిన్రా...?"

"ఔ... నీకెట్ల తెలిసినాది?"

"మీవోళ్ళు అనుకుంటుంటే ఇన్న... ఏవూరి మీది?"

"... గూడెం..."

"ఆడికి ఎళ్ళకుండ ఉండాల్సింది. ఎళ్ళి అనవసరంగా దెబ్బలు తిన్నవ్" అన్నాడు రామాంజనేయులు సానుభూతిగా.

"ఎళ్ళక ఏంచెయ్యమంటవ్. కూలీ దొర



కల... పట్నంల బతుకుతెరువు కనిపించల... తిండికి లేక అల్లల్లాడిన... అందుకే ఏదైతే అదే అవుద్దని మా గూడెం వెళ్ళిన"

"నీ నసీబ్ బాగాలేక అన్నలు ఆరోజే వచ్చిన్రు"

"ఔ... ఎంటనే నన్ను పిలిపించి తన్ని న్రు... ఆడ నలుగురైదురుగురు కొత్తోళ్ళున్నా రు. ఆళ్ళయినా ఆపుతారనుకున్నగాని ఆళ్ళేం మాటాడలేదు"

కొత్తోళ్ళు అనే మాటతో అప్పటిదాకా యథా లాపంగా మాట్లాడుతున్న రామాంజనేయులు ఆసక్తిగా ముందుకు వంగాడు.

"ఎవరాళ్ళు?"

"ఏవో నాకేం ఎరిక?"

"ఎట్లున్నరు?" అడిగాడు రామాంజనేయు లు. తనకా విషయంమీద ఏమంత ఆసక్తి లేనట్లు.

"పాయింట్లు, అంగీలు ఏస్కున్నారు. కళ్ళ ద్దాలు పెట్టుకున్నారు"

"ఫారెస్టోళ్ళేమో.."

"కారు... ఆళ్ళయితే నాకెర్కేగదా.... ఆళ్ళ అడావుడి, జీబులు ఎప్పుడూ సూత్తానే ఉంటంగదా... ఈళ్ళు కాదు. అన్నలే ఆళ్ళని తీసుకొచ్చినట్లున్నారు"

"సర్లె... నువ్వు నిద్రపో... నేనీ పక్కబెడ్మీ దే ఉంటాను... ఏదన్న కావాలంటే పిలువ్... నేన్నీ దోస్త్నే..." చెప్పాడు రామాంజనేయులు.

అతను మెల్లిగా వచ్చి తన బెడ్మీద పడుకున్నాడు. ఆ గిరిజన యువకుడు చెప్పిన దాన్నిబట్టి ఆలోచిస్తే ఆ కొత్తవాళ్ళు ఎవరోకా దు, తీవ్రవాదులు ఐదురోజులక్రితం కిడ్నాప్ చేసిన రచయితలే. లేకపోతే తనే అనవస రంగా ఇలా ఊహిస్తున్నాడేమో... కిడ్నాప్ చేసినవాళ్ళని మరీ ఇలా బహిరంగంగా గూడే లవెంట తిప్పరు. ఈ యువకుడు ఎవర్నో చూసి ఏదో అనుకున్నట్లున్నాడు.

కాదు... కాదు... గిరిజనులు కొత్తవాళ్ళని క్షణంలో పసిగడతారు. ఆ యువకుడు పొరపా టుపడే అవకాశం లేదు. అయినా ఆ కొత్తవా ళ్ళు రచయితలే అనే కోణంనించి ఆలోచిస్తే తప్పేముంది? ఫలానాచోట లేదా ఫలానాచోటి కి దగ్గర్లో రచయితలు ఉన్నారని తనూ ఓ వార్త రాసుకోవచ్చు...

అలా రాస్తే విప్లవకారులు ఈ యువకుణ్ణి తన్నినట్లు తననీ తంతారేమో! అం పెద్ద భయమేంలేదు. ఈ దెబ్బతో పోలీసుల హృద యాలు ఎలాగూ దోచేస్తాడు. కాబట్టి పోలీస్ ప్రొటెక్షన్ ఏర్పాటు చేసుకోవచ్చు.

'ఆ రచయితలు ఎక్కడున్నారు?' అనే శీర్షికతో మర్నాడు తను రాయబోయే వార్తని తలుచుకుంటూ అత్యుత్సాహంగా నిద్రపోయా డు జర్నలిస్ట్ రామాంజనేయులు.



**ఆ**రోజు మధ్యాహ్నం ఎవరో వచ్చి చెప్పా రు ఛాయతో - "మీ నాన్నకి పట్నంలో యాక్సిండెంటైందిట"

ఆమె ఉన్నపళంగా బయల్దేరింది తల్లితో, వణుకుతున్న గుండెతో, తడబడుతున్న అడు గులతో

తండ్రిని పోలీసులు తీసుకెళ్ళి ఒక్కరోజే అయింది. ఆయన్ని లాకప్లో పడేసి పశువుల కొట్టం దహనం కేసులో కోర్టులో హాజరు పరుస్తారని, అప్పుడు తను బెయిల్ పిటీషన్ పడేయొచ్చని అనుకుంది. తను ఎక్కువసార్లు





పోలీస్ స్టేషన్‌చుట్టూ తిరిగితే పోలీసులకి మరీ కోపం వస్తుందని వెళ్ళకుండా ఆగిపోయింది. అదీగాక తల్లి ఒక్కతే ఇంట్లో ఒంటరిగా ఉండా ల్సి వస్తుందని కూడా అనుకుంది ఛాయ.

కాని ఇదేమిటి ఇలా జరిగింది?

తల్లిని పోలీస్‌స్టేషన్ బైటే ఉండమని చెప్పి తనొక్కతే లోపలికి వెళ్ళింది ఛాయ.

మధ్యాహ్నం ఒంటిగంట అవుతుందేమో.. యస్.ఐ. స్టేషన్‌లో లేడు. లోపల ఇద్దరు కానిస్టేబుళ్ళున్నారు, ఏవో కాగితాలు చూసు కుంటూ.

"మాది రామచంద్రాపురం... మా నాన్నని నిన్న సాయంత్రం ఇక్కడికి తీసుకొచ్చారు"

"పేరేమిటి?"

"రామానుజం..."

"లాకప్‌లో లేడు... వదిలేసినట్టున్నారు"

"ఆయనకి యాక్సిడెంటైందిట... ఎవరో చెప్పారు"

"యాక్సిడెంటు కేసులన్నీ ప్రభుత్వాసుపత్రిలో ఉంటయ్. నువ్వక్కడికెళ్ళి చూసుకో"

ఛాయ బైటికి వచ్చి ఆ సంగతి తల్లికి చెప్పింది. ఇద్దరూ ప్రభుత్వాస్పత్రికి రిక్షాలో వెళ్ళి అక్కడ కనిపించిన ఒక నర్సుకి తమ గోడు వినిపించారు.

"యాక్సిడెంట్ కేసులన్నీ పైన రెండోవార్డులో ఉంటయ్... వెళ్ళి వెదుక్కోండి"

ఇద్దరూ గాభరాగా మెట్లెక్కి పైకివెళ్ళి ఆ వార్డులో బెడ్‌లమీద పడుకున్నవాళ్ళని పరిశీలించారుగాని రామానుజం కనిపించలేదు. దాంతో ఛాయకి అనుమానం వచ్చింది, బహుశా తన తండ్రి చనిపోయుంటాడేమోనని. అదే విషయం ఒక తోటీతో మెల్లిగా చెప్పింది. అతను ఆకాశమంత విశాలంగా నవ్వాడు.

"బతికుంటే బెడ్‌మీద ఉండేవాడు. లేడు కాబట్టి చచ్చుంటాడని తెలీడంలేదూ... అందుకని మార్చురీలో వెదుక్కోండి, వెళ్ళండి..." అన్నాడతను ఛాయవైపు 'ఇది'గా చూస్తూ.

అతను తెలుగు సినిమాలు చూడటం, ద్వంద్వార్థాలు స్ఫురించేటట్టు మాట్లాడి ఆనందించడం తప్ప ఇంకేపనీ చెయ్యడు.

"మార్చురీ ఎక్కడుంది?"

"నేను చూపిస్తారా..." అని అతను ఛాయని, ఆమె తల్లిని ప్రభుత్వాసుపత్రి వెనక్కి తీసుకెళ్ళి అక్కడ మార్చురీ చూపించి మాయమైపోయాడు.

అక్కడున్న ఇంకో తోటీకి మళ్ళీ అసలువిషయం చెప్పి లోపలికి వెళ్ళింది ఛాయ. శవాలనన్నింటినీ వరసగా చూస్తూ తన తండ్రిని గుర్తుపట్టి బిగ్గరగా ఏడ్చేసింది. దాంతో ఆమె తల్లి కూడా లోపలికి వచ్చి చూసి రోదిస్తూ కూలబడిపోయింది.

తర్వాత శవాన్ని బైటికి తియ్యడానికి, టాక్సీలో ఎక్కించడానికి ప్రభుత్వాస్పత్రి సిబ్బంది ఎవరి మామూళ్ళు వాళ్ళు పుచ్చుకుని ఛాయని, ఆమె తల్లిని పంపించేశారు.

ఆ సాయంత్రం రామచంద్రాపురంలో రామానుజం దహనసంస్కారం పూర్తయింది. ఆడవాళ్ళు శ్మశానానికి వెళ్ళకూడదనే ఆచారాన్ని పక్కనపెట్టి వాళ్ళిద్దరూ అక్కడికి వెళ్లారు. ఛాయ తనే తలకొరివి పెట్టింది.

ఇద్దరూ సమస్తం కోల్పోయినవాళ్ళలా విషణ్ణ వదనాలతో ఇంటికి వచ్చారు. కొంతమంది వచ్చి ఇద్దర్నీ పరామర్శించి, కాసేపు కూర్చుని వెళ్ళిపోయారు.

చీకటిపడింది.

ఛాయ తల్లి మెల్లిగా లేచి గడపమీద దీపంపెట్టి కూచుంది. ఛాయ గోడకి జారగిలబడి కూర్చుని ఆలోచిస్తోంది. తండ్రిని పోలీసులు ఉదయాన్నే విడిచిపెట్టారంటే ఆయనమీద కేసేం పెట్టలేదని అర్థమవుతూనే ఉంది. కేవలం బెదిరించడానికే అలా తీసుకెళ్ళివుంటారు. అదీ కాళీప్రసాద్ ఆజ్ఞానుసారం.

మరి అలా బైటికి వచ్చినవాడు యాక్సిడెంట్‌లో చావడం ఏవిటి? ఇదేదో కాకతాళీ

యంగా జరిగిందికాదు. బహుశా కాళీప్రసాదే కక్షకొద్దీ చేయించివుంటాడు.

"ఏవే ఛాయా... నీ పోరాటం ఇంతటితో ముగిసినట్టేనా?" అడిగింది తల్లి. ఆరోజు ఉదయంసించి ఆమె ఒక్కమాట కూడా మాట్లాడలేదు. మొదటిసారి ఇప్పుడే పెదవి విప్పింది.

"ప్రస్తుతానికి"

"తగుదునమ్మా అంటూ బైల్దేరావు. ఆయనకి లేనిపోనివి నూరిపోసి రెచ్చగొట్టావు. ఇప్పుడేమైంది? పండంటి మనిషి కాస్తా చనిపోయాడు" అందావిడి కళ్లు తుడుచుకుంటూ.

"బాధపడకమ్మా. ఏడిస్తే పోయినవాళ్ళొస్తారా?"

"రారే... నాకు తెలుసు. ఎంత మంచి మనిషి ఎంత అన్యాయంగా పోయాడో తలుచుకుంటేనే గుండె చెరువైపోతోందే నాకు. నువ్వు రాతిమనిషివి. నీకు బంధాలు, అనుబంధాలు, మమతానురాగాలు ఏంలేవు. ఇప్పటికీ నిబ్బరంగానే ఉన్నావు"

ఛాయ ఏదో అనబోయేంతలో వీధి గుమ్మం దగ్గరికి ఎవరో వచ్చినట్టు అలికిడి వినిపించింది. ఛాయ లేచి వెళ్ళి తలుపు తీసిచూసి ఆశ్చర్యపోయింది. ఎదురుగా కాళీప్రసాద్.

ఛాయ మాట్లాడకుండా పక్కకి తప్పుకుంది. ఆయన హుందాగా లోపలికి వచ్చి వరండాలో ఒక పక్కనున్న కుర్చీ తీసుకుని తనే వేసుకుని కూర్చున్నాడు.

"రామానుజంగారు పోయారుట. నాకు ఇందాకే తెలిసింది. ఒక్కసారి మీ ఇద్దర్నీ పలకరించిపోదామని వచ్చాను" అన్నాడు కాళీప్రసాద్.

"మేం ఈ ఊళ్లో ఉండదల్చుకోలేదండీ. మీక్కావాలంటే ఆ ఖాళీస్థలం"

"అమ్మా..." గదమాయించింది ఛాయ. దాంతో ఆవిడ ఆగిపోయిందిగాని కాళీప్రసాద్





తనకి కావాల్సిన అసలు సమాచారం తెలుసుకున్న ఆనందంతో తృప్తిగా నవ్వాడు.

"నేను చెప్పదల్చుకుందీ ఇదేనండి. ఇంతవరకు జరిగిందేదో జరిగిపోయింది. ఇద్దరం తప్పు చేశామో, ఒక్కరే చేశామో వదిలేద్దాం. మీ ఖాళీస్థలం నాకెందుకు? మీది మీరే ఉంచుకోండి. దాన్ని ఎవరికిచ్చుకున్నా నాకేం అభ్యంతరం లేదు. మీరు లాయర్‌నోటీసు ఉపసంహరించుకోండి. నేను పశువులకొట్టం దహనం కేసు విత్‌డ్రా చేసుకుంటాను. ఎలా ఉంది?"

"బాగుంది నాయనా బాగుంది"

"ఇహపోతే మీరు ఇల్లూ పొలం తెగనమ్ముకుని ఇక్కడినుంచి వెళ్లిపోవాల్సిన అవసరమేంలేదు. ఈ ఊళ్లోనే హాయిగా ఉండొచ్చు"

అంతకంటే మాకేం కావాలి?" అంది ఛాయ తల్లి.

"అయితే ఒకమాట. మీరు ఈ ఇంట్లోనే ఉంటే రామానుజంగారి జ్ఞాపకాలు మిమ్మల్ని అనుక్షణం వేధిస్తుంటాయ్. అయినా ఈ పాతకాలపు ఇంట్లో కరంటూ, కనీసవసతులు లేకుండా ఎలా ఉంటారు?"

"అవున్నాయనా... బాగా చెప్పావు"

"అందుకని మీ ఖాళీస్థలంలో మీ పేరు మీదనే ఒక ఇల్లు కట్టిస్తాను"

"దేనికి?" అడిగింది ఛాయ. ఆమెకి పులి-బాటసారి-బంగారు కంకణం కథ గుర్తొచ్చింది. ఊసరవెల్లి రంగు ఎలాగూ బైటపడుందని ముందుగానే అనుకుంది.

"దేనికేవిటి ఛాయా... మనిద్దరికీ, మీ అమ్మగారికీ"

"ఛీ..." అంది ఛాయ తల్లి.

ఛాయ మహోగ్రంగా లేచింది. గడపమీదున్న దీపం వెలుతురులో ఆమె కలకత్తా కాళికలా కనిపించింది, కాళీప్రసాద్‌కి.

"మీరు తక్షణం ఇక్కడినించి వెళ్ళండి"

కాళీప్రసాద్ అసంకల్పితంగా లేచి నిలబడ్డాడు.

"రామానుజం పోయాడు. ఇద్దరూ ఆడవాళ్ళే, నిస్సహాయులు. మనం ఏం చెప్పినా వింటారనేకదూ మీ ధీమా. జాగర్తగా వినండి. మేం చావనన్నా చస్తాంగాని మీకు లొంగం"

"బాగా ఆలోచించుకో ఛాయా. లేకపోతే పోలీస్‌స్టేషన్, కోర్టు కేసులు. జైలు. నీమంచి కోరే చెబుతున్నాను"

"చావడానిక్కూడా సిద్ధపడ్డవాళ్లని నువ్వేం చెయ్యలేవు. మర్యాదగా వెళ్లు. ఎన్నిసార్లు చెప్పినా కుక్కలా వెంటపడుతున్నావు. సిగ్గూ, అభిమానం, రోషం ఉంటే ఇన్నిసార్లు అడిగేవాడివి కాదు. ఇప్పుడు మా ఇంటిగుమ్మం తొక్కేవాడివి కాదు"

"ఎంత పొగరే నీకు. నన్నే కుక్కంటావా?" లాగిపెట్టి చెంపమీద కొట్టాడు కాళీప్రసాద్.

అంతే...

ఛాయ గభాలున ముందుకెళ్లి గుమ్మం పక్కనున్న చెప్పు అందుకుని ఎడాపెడా కొట్టింది.

కాళీప్రసాద్ ఒక్కక్షణం అచేతనంగా నిలబడిపోయాడు.

తర్వాత బుసలుకొడుతూ విసవిసా వెళ్లిపోయాడు.



హాస్యరచయిత పరబ్రహ్మం కళ్లు తెరిచిచూశాడు.

ఆకాశం ముత్యాల పందిరిలా కనిపించింది. కీచురాళ్ళ ధ్వని. దూరంగా అడవి జంతువుల అరుపులు వినిపించాయి.

అలాగే పడుకుని తలతిప్పి చుట్టూ చూశాడు. రచయితలందరూ గాఢసుషుప్తిలో ఉన్నారు. కొంచెం ఎడంగా పడుకున్న విప్లవకారుల్లో కూడా కదలికలేదు.

చేతివాచిని కళ్ళకి దగ్గరగా పెట్టుకుని టైమ్ చూశాడు. 4.40 అయింది.

ఒక అరగంట ఇలా కాలక్షేపం చేస్తే మెల్లిగా లేచి తనదారి తను చూసుకోవచ్చు. అందర్నీ తీసుకెళ్ళడానికి తనేం సినిమా హీరో కాదు. పైగా తనకా విశాలహృదయం లేదు. తీవ్రవాదులు ఎప్పుడు వదిలేస్తే అప్పుడు వాళ్లు వస్తారు.

ఈ రెండు రోజుల్లోనూ తనూ, మిగతా రచయితలు ఇంకో మూడు గ్రామాలు చూశారు. గిరిజనులతో మాట్లాడటానికి ప్రయత్నించారుగాని వాళ్లు దూరం దూరంగానే ఉండిపోయారు భయంగా అనుమానంగా చూస్తూ. ఒక గూడెంలో జీవితంలో ఎప్పుడూ ఎరగని జొన్నంబలి రుచిచూశారు. కారణం మరేం లేదు. అది తప్ప ఇంకేం లేదట ఆకలి తీర్చుకోవడానికి.

తనకి చాలా జాలేసింది. ఇంటికి వెళ్ళాక తన అనుభవాలను ఏదైనా పత్రికకి రాద్దామా అనిపించింది. వీళ్ళ ప్రధానమైన పంటలు వరి, జొన్న, మొక్కజొన్నలే. వాటిని తీసుకెళ్ళి సంతల్లో అమ్ముకుని కావాల్సిన వస్తువులు తెచ్చుకుంటారు.

మిగతా రచయితలందరూ తనలాగానే నీరసంగా అలసటగా ఎప్పుడు ఇక్కడినుంచి బైటపడుదామా అని ఆతృతగా ఎదురుచూస్తున్నారుగాని వివేకానంద అలా కనిపించడంలేదు. అతను అన్ని విషయాల్ని పరిశీలనగా చూస్తూ తెలీనివి తెలుసుకుంటూ, మధ్య మధ్యలో ఏదో రాసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు, మొత్తానికి చాలా విచిత్రమైన మనిషి.




ఈ రెండురోజుల్లో కూడా ఎక్కడా ప్రభుత్వాధికారులుగాని. ఉద్యోగులుగాని. పోలీసులుగాని కనిపించలేదు. ప్రభుత్వం సంగతి సరే ఎలాగూ పట్టించుకోదు. పోలీసులు రౌండ్స్‌కి రావాలిగదా మానేశారేవిటి? బహుశా ఏ తెల్లారుజామునో దిగి నానా గందరగోళం. బీభత్సం సృష్టించి అనుమానం వచ్చిన వాళ్ళందర్నీ లాక్కుపోతారేమో!

తను పరిశీలించినంతవరకు వీళ్ళకి ప్రభుత్వంమీద. పోలీసులమీద పూర్తి ద్వేషం ఉంది. ఆమాటే పులకేశి కూడా చెప్పాడు. నిన్న సాయంత్రం.

"అభివృద్ధి కార్యక్రమాల అమలు పేరుతో వాళ్ళు చేసేది నిజంగా అభివృద్ధికాదు. వీళ్ళని ఇంకా ఇబ్బంది పెట్టడం. రోడ్లు. విద్యుచ్ఛక్తి ఇంకా ఇతర సౌకర్యాలు కల్పిస్తే తమకి ఇప్పుడున్న రక్షణ కవచం కూడా పోతుందని వీళ్ళ భయం. పైగా అప్పుడు ప్రభుత్వాధికారులు. ఉద్యోగులు మాటిమాటికి వస్తారని. తమని ప్రశాంతంగా బతకనివ్వరని హరిజనులు అనుకుంటున్నారు"

"అది తప్పని మీరు వివరించొచ్చుగదా" అన్నాడు వివేకానంద.

"నిజంగా జరిగేది అదే. కాబట్టి తప్పని ఎలా చెబుతాం?"

"వీళ్ళ విశ్వాసం సంపాదించడానికి ప్రభుత్వం ముక్కుతూ. మూలుగుతూ ఏదో చేస్తుంటుంది. అధికారులు. ఉద్యోగుల్లో ఎక్కువమంది అవినీతిపరులు కావచ్చు. కొందరు మంచి వాళ్ళుంటారు. వాళ్ళు నిజంగానే గిరిజనులకు ఏదో మేలు చేయాలనే సత్సంకల్పంతోనే వస్తారు. అలాంటివాళ్ళకి మీరు సహకరించొచ్చుగదా!"

"ప్రభుత్వం విసిరేసే ముష్టికి వీళ్ళని అలవాటు పడనివ్వం.

"మరి రేపు ఈ ప్రాంతాలన్నీ విముక్తి సాధించి, సమసమాజం ఆవిర్భవించినా మీరు చేసేది అదేగదా! మంచి పని ఎవరు చేసినా తప్పేంలేదు. మీరు ఒకవేళ అధికారంలోకి వచ్చినా కూడా వీళ్ళని మైళ్ళకిమైళ్ళు వెళ్ళి నీళ్ళు తెచ్చుకోవాల్సిన దుస్థితిలోనే ఉంచేస్తారా?"

పులకేశి మాట్లాడలేదు. ఈ సంభాషణ నిన్న జరిగింది. మళ్ళీ ఇవాళ.

మధ్యాహ్నందాకా నడిచి ఒకచోట భోంచేసి విశ్రమించారు. పులకేశి సంచీలోంచి రేడియో తీసి ఆన్ చేశాడు. ప్రాంతీయవార్తలు వినిపించాయి.

రేడియో వార్తల ప్రకారం రాష్ట్రం అంతా ఎప్పుడూ సస్యశ్యామలాం. సుజలాం, సుఫలాంగానే ఉంటుంది కాబట్టి అదే పద్ధతిలో వార్తలు సాగాయి. చివర్లో మాత్రం నిజామాబాద్ జిల్లాలో ఆరోజు తెల్లారుజామున జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఐదుగురు తీవ్రవాదులు మరణించారని. వారి వద్దనించి పోలీసులు కొన్ని తుపాకులు. తీవ్రవాద సాహిత్యం స్వాధీనం చేసుకున్నారని చెప్పింది.

పులకేశి. మిగతా ముగ్గురు విప్లవకారులు కొద్దిసేపు మౌనంగా ఉండిపోయారు. వాళ్ళ మొహాల్లో విషాదం కనిపించింది. తర్వాత పులకేశి లేచి చనిపోయిన తమ కామ్రేడ్లకి జోహార్లు చెప్పాడు.

అందరూ మళ్ళీ బయల్దేరారు.

"ఈ పదిహేనురోజుల్లో రెండు ఎన్‌కౌంటర్లలో మా కామ్రేడ్లు పదిమంది అమరులయ్యారు" అన్నాడు పులకేశి.

"రెండూ బూటకపు ఎన్‌కౌంటర్లేనా?" అడిగాడు నాగార్జున.

"అవును. ఆ ఆయుధాలు విప్లవసాహిత్యాన్ని పోలీసులే మా కామ్రేడ్లు శవాల దగ్గర పడేస్తారు. ఎన్‌కౌంటర్‌లో చనిపోయారని పేపరోళ్ళకి చెబుతారు. వాళ్ళు పోలీసులు చెప్పిందే రాసి చేతులు దులుపుకుంటారు"

"మీరు ఏ రూల్సూ పాటించరు కాబట్టి మేం కూడా ఏ రూల్సూ పాటించనక్కరలేదని

పోలీసులు అంటున్నారు'' అన్నాడు గురుదేవ్. వివేకానంద పులకేశితో అప్పుడప్పుడు చర్చలకు దిగుతుండటంతో మిగతా రచయితలకి కూడా భయం, అనుమానం తగ్గాయి.

"మేం ఏ రూల్సు పాటించడంలేదు?"

"విధ్వంసకాండకి దిగడం. బస్సులు, రైళ్లు, టెలిఫోన్ ఎక్స్‌చేంజీలు, మైక్రో వేవ్‌స్టేషన్లు తగలెట్టడం ప్రజాకోర్టుల పేరుతో అమాయకుల్ని నిర్దాక్షిణ్యంగా శిక్షించడం, ఇన్‌ఫార్మర్లని హత్యచెయ్యడం కిడ్నాపులు ఇలాంటివన్నీ సాగిస్తున్నారు కాబట్టి మేం కూడా నిర్దాక్షిణ్యంగానే వ్యవహరిస్తామని అంటున్నారు వాళ్లు. దీనికేం చెబుతారు?"

"మా అసమ్మతిని తెలియచేయడానికి ఇంతకంటే మరో మార్గం కనిపించడంలేదు'' అన్నాడు పులకేశి సాలోచనగా.

"దీనివల్ల ప్రజలు మీకు దూరమైపోవడంలేదూ? ఆయుధం మీ శత్రువునే కాదు కామ్రేడ్, మిత్రుల్ని కూడా భయపెడుతుంది'' అన్నాడు కిశోర్‌కుమార్ ఉత్సాహంగా.

"రేపు ఒకవేళ సమసమాజం వచ్చినా ఈ సౌకర్యాలన్నీ కావాల్సిందే. అందువల్ల వీటిని ధ్వంసం చేయడంకంటే జనసమీకరణ కోసం వేరే మార్గాలు ఆలోచించడం మంచిది''

"నిజమే. మేం ఈ ప్రభుత్వం పెట్టిన ఏ రూల్సూ ఒప్పుకోం. చట్టాలు శాసనాలు గౌరవించం. మా అసమ్మతిని, అసహనాన్ని ఎప్పటికప్పుడు తెలియచేస్తూనే ఉంటాం. మీరిక్కడ పరిస్థితులన్నీ చూశారుగదా. మీరే చెప్పండి. మేం ధర్మంవైపు ఉన్నామో, అధర్మంవైపు ఉన్నామో''

"ధర్మంవైపే ఉన్నారు పులకేశిగారూ. ఇందులో సందేహం ఏమీలేదు. ఈమాట మేం ఒప్పుకునేదేంవుంది? హోంమంత్రి, డిజిపియే అంటున్నారు. అయితే ఈ విధ్వంసకాండే వాళ్ళకీ, మధ్యతరగతి జనానికీ కూడా నచ్చడంలేదు'' అన్నాడు వివేకానంద.

"దానికేం చెయ్యాలి?"

"ఇందాకే మా మిత్రుడు చెప్పాడుగదా. ఒక సమస్యమీద వీలైనంత ఎక్కువ మందిని సమీకరించడం, ఆ సమస్య పరిష్కారం అయ్యేవరకు వాళ్ళని అలా ఉంచగల్గడం''

"మాకా పద్ధతి ఇష్టమేగాని, సాయుధపోరాటమే అన్ని సమస్యలకి పరిష్కారమని మనసా, వాచా, కర్మణా నమ్ముతున్నాం''

వివేకానంద పెద్దగా నవ్వాడు.

"మనిషే ఆయుధం కామ్రేడ్. మనిషిని ఆయుధంగా మలచాలి. వేరే ఆయుధాలెందుకు? ఇప్పుడు మీరు అనుసరిస్తున్న పద్ధతి ప్రకారం తుపాకీయే పార్టీని, పంథాని శాసిస్తోంది. అలాకాకుండా పార్టీయే తుపాకీని శాసించాలి. ఆయుధాలు పట్టాలో అక్కర్లేదో పరిస్థితులు నిర్ణయిస్తాయి. మీరు ముందే ఆయుధాలు పట్టి రంగంలోకి దిగడంవల్ల పరిస్థితి రానురాను జటిలం అవుతోంది తప్ప సానుకూలం కావడంలేదు'' అని ఆగి.

"ఐయాం సారీ. మీకు కోపం వచ్చిందా?" అడిగాడు వివేకానంద.

"అబ్బే ఏంలేదు. మా సిద్ధాంతాన్ని, నిబద్ధతని మేం అంత తేలిగ్గా మార్చుకోం"

"ఒకవైపు ఈ చట్టాలు, శాసనాలమీద నమ్మకం, గౌరవం లేవంటూనే అరెస్టయిన మీ వాళ్ళని వెంటనే కోర్టులో హాజరుపరచాలని డిమాండ్ చేస్తున్నారు''

"మీరు పోలీసుల తరపున మాట్లాడుతున్నారు'' అన్నాడు పులకేశి.

"మేం పోలీసుల తరపున, ప్రభుత్వం వకాల్తా పుచ్చుకుని ఇక్కడికి వచ్చిన వాళ్ళంకాదు. జనరల్‌గా పబ్లిక్‌లో ఉండే ధర్మసందేహాలనే మీముందు ఉంచుతున్నాం. మేం ఎన్‌కౌంటర్లనీ సమర్థించం, మీ విధ్వంసకాండనీ మెచ్చుకోం. అంతే. అదీగాక మాకు తెలిసిన నాలుగు సంగతులు పేపర్ల ద్వారా తెలిసినవే తప్ప మేం స్వయంగా పరిశీలించి గ్రహించినవి కావు''

"ఆ పరిశీలన కోసమే మిమ్మల్ని తీసుకొ

 

చ్చాం"

అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది.

మిట్టమధ్యాహ్నం సూర్యుడు తన ప్రతాపం చూపిస్తున్నాడు. అందరికీ చెమటలు పడుతున్నాయి.

రచయితలు రాళ్లు ముళ్లూ జాగర్తగా చూసుకుంటూ నడుస్తున్నారు.

అంతలో కొంచెం దూరంగా పొదలచాటున కలకలం వినిపించడంతో అందరూ ఆగిపోయారు. ఆలివ్ గ్రీన్ దుస్తులు ధరించిన వేరే దళంసభ్యులు పదిమంది ఇవతలికి వచ్చారు.

వాళ్ళలో ఇద్దరు ఆడవాళ్ళు కూడా ఉన్నారు. అరుణాభివాదాలు, పలకరింపులు, పరామర్శలు పూర్తయ్యాక రచయితల్ని పేరుపేరునా పరిచయం చేశాడు పులకేశి.

"నీతో ఒక విషయం జరూర్‌గ మాట్లాడాలె" అన్నాడు ఆ దళ నాయకుడు. దాంతో ఇద్దరూ కొంచెం దూరంగా వెళ్ళారు.

దళంలోని ఆ ఇద్దరు యువతులవైపు రచయితలు విచిత్రంగా, ఆశ్చర్యంగా చూశారు. ఎప్పుడూ పేపర్లలో చదవడం తప్ప మహిళా తీవ్రవాదుల్ని ప్రత్యక్షంగా వాళ్ళు చూడలేదు.

"ఏం తమ్ముళ్ళూ... ఎట్లున్నాది దళజీవితం?" అడిగిందో మహిళా కామ్రేడ్.

"బాగానే ఉంది'' అన్నాడు కిశోర్‌కుమార్.

"మీర్లు రచయితలంటగా... మా జనాన్ని గురించి రాయుండ్రి''

"రాస్తాం..."

"ఇంకా పుస్తకాలెందుకు? మీరూ మాతోపాటు ఆయుధాలు పట్టండి'' అంది ఒకామె. మిగతా దళసభ్యులు నవ్వారు.

"మాకంత ధైర్యంలేదు... ఓపిక లేదు'' అన్నాడు గురుదేవ్.

"అవసరం లేదనండి... అదీ సరైనమాట" ఒకదళం సభ్యుడు అన్నాడు.

వివేకానంద వాళ్ళ మాటలు వింటూ ఆలోచిస్తున్నాడు. కవి, రచయిత ఒకచేత్తో కలం, మరోచేత్తో ఆయుధం పట్టాలని నినాదాలు చేసి, క్రియాశీలక విప్లవ కార్యక్రమాల్లోకి దిగి, కోర్టు కేసుల్లో ఇరుక్కుని, జైళ్ళపాలై బైటపడ్డ కొందరు కవులు, రచయితలు అతనికి గుర్తొచ్చారు.

అయితే కొద్దోగొప్పో విప్లవ రాజకీయాల మీద అవగాహన ఉన్నవాళ్ళే అందులో ఇమడలేక వచ్చేస్తుంటే ఈ ఆడవాళ్ళు ఎందుకు చేరుతున్నారు? వీళ్ళని ఏ శక్తులు కదిలిస్తున్నాయి? ఏ సామాజిక పరిస్థితులు ప్రోత్సహిస్తున్నాయి? కేవలం వ్యక్తిగత సమస్యలవల్లే విప్లవకారులుగా మారుతుంటే వీళ్ళకి అంతిమలక్ష్యం గురించి సరైన అవగాహన ఉంటుందా? వాళ్ళవైపే చూస్తూ ఆలోచిస్తున్నాడు వివేకానంద.

"ఏంటన్నా... ఆలోచన చేస్తున్నవ్?" అడిగిందో మహిళా కామ్రేడ్.

"అబ్బే, ఏంలేదు..." అన్నాడు వివేకానంద తెప్పరిల్లుతూ.

"ఈ ఆడోళ్ళు దళంలో చేరిండ్రేంటబ్బా అనా?"

"అహఁ..."

"నువ్వదే ఆలోచన చేస్తున్నవ్... నాకెరికే... మాకున్న సమస్యలే జనానికున్నయ్ అని తెలుసుకుని వచ్చినం"

"హాయిగా పెళ్ళి చేసుకుని... సుఖజీవనం సాగించక" ఆపేశాడు గురుదేవ్.

"పెండ్లంటూ చేసుకోదల్చుకోలేదు. సుఖజీవనం అనేదే మాకులేదు. అందుకని ఈదారి ఎంచుకున్నం. మీకు ఆడది అనగానే పెండ్లాక్కటే గుర్తుకొస్తాంది. మాలసుమంటి ఆడోళ్ళు శానామంది ఉన్నరు. ఒకయేళ చేసుకోదలిస్తే దళంలోవాళ్ళనే చేసుకుంటాం"

"ఇబ్బంది ఉండదూ'' అన్నాడు కిశోర్‌కుమార్. అతని ఉద్దేశం కనిపెట్టినట్టు ఆమె పెద్దగా నవ్వింది.

"సంసారం చెయ్యడానికి టైముండదు. ఎప్పుడోతప్ప కలుసుకోవటం కుదర్దు. ఒకవేళ

నెలతప్పితే ఇంకా ఇబ్బంది''

వివేకానంద కూడా చిరునవ్వు నవ్వాడు. అతనికి ఈమధ్యే తను చదివిన ఒక నవల గుర్తొచ్చింది. అందులో ఒక గిరిజన యువతి ఇష్టంలేని పెళ్ళి తప్పించుకోవడంకోసం దళంలో చేరుతుంది. ఆమె దళసభ్యుల్లో ఎవరికీ తన సమస్య గురించి చెప్పదు. చెబితే వాళ్ళు అరగంటలో పరిష్కరించి ఉండేవాళ్ళు. పైగా వాళ్ళు కూడా ఆమెను ఏం ప్రశ్నించకుండా దళంలో చేర్చుకుంటారు. అది చదివాక తనకో అనుమానం వచ్చింది. తనకొచ్చిన వ్యక్తిగత సమస్యని పరిష్కరించుకోలేక అజ్ఞాతంలోకి వెళ్ళడం అంటే అదోరకమైన పలాయనత్వం కదూ! పైగా ఆ గిరిజన యువతికి ఏవిధమైన సైద్ధాంతిక జ్ఞానం ఉన్నట్టు కనిపించలేదు. కేవలం 'ఎస్కేప్' అవడం తప్ప. అలాంటివాళ్ళవల్ల పార్టీకి, ఉద్యమానికి వచ్చే లాభం ఏముంటుంది? ఆమెకి సైద్ధాంతిక జ్ఞానం అందించడానికి ఎవరూ ప్రయత్నించినట్టు కూడా కనిపించలేదు. వచ్చిందే చాలన్నట్టు కనిపించారు. బాగా ఆలోచిస్తే తమలాంటి రచయితలకి కాదు పునశ్చరణ తరగతులు అవసరం... వీళ్ళకే... ముఖ్యంగా వ్యక్తిగత సమస్యల్ని పరిష్కరించుకోలేక పారిపోయి వచ్చినవాళ్ళకి...

అంతలో అప్పటిదాకా దూరంగా వెళ్ళి మాట్లాడుకున్న పులకేశీ, రెండో దళ నాయకుడూ వచ్చారు. అందరూ మళ్ళీ అరుణాభివాదాలు చేసుకుని విడిపోయారు.

"మన ప్రోగ్రాం మారింది. మనం ఇప్పుడు ఆ గూడేనికి వెళ్ళడంలేదు. ఇలా అడవిలోకి వెళ్తున్నాం"

"దేనికి?"

"తర్వాత మీకే తెలుస్తుంది'' అన్నాడు పులకేసి నవ్వుతూ.

సాయంత్రం నాలుగున్నర, ఐదుమధ్య తెలిసింది రచయితలకి. భూకంపం వచ్చినట్టు పెద్ద విస్ఫోటనం వినిపించింది దూరంగా. అడవిలో పక్షులు, కోతులు కొంతసేపు గందరగోళం చేశాయి. అంతా కాసేపట్లో సద్దుమణిగింది.

"మందుపాతర పేల్చి పోలీసుల్ని మట్టుబెట్టాం. కిందటి పున్నమినాడు మా కామ్రేడ్లని బలితీసుకున్నారు. రేపు పున్నమికదా... మేం ప్రతీకారం తీర్చుకున్నాం'' ప్రకటించాడు పులకేశి ఆనందంగా.

రచయితల్లో ఎవరూ ఏం మాట్లాడలేదు.

ఆలోచనల్లోంచి బైటపడి, తల విదిల్చి మళ్ళీ టైమ్ చూశాడు పరబ్రహ్మం. ఐదూఇరవై అయింది.

తూర్పు తెల్లబడుతోంది.

అతను మెల్లిగా లేచి అందరివైపూ చూశాడు. ఈ ఆర్రోజుల్లో విప్లవకారులు ఎప్పుడూ ఇంత ఆదమరపుగా లేరు. బహుశా తమమీద గౌరవం, విశ్వాసం అయ్యుండొచ్చు. తీరా తప్పించుకు పోలేరన్న ధీమాకావచ్చు.

పరబ్రహ్మం సెంట్రీగా వెళ్ళిన తీవ్రవాది కోసం ముందుకు వెళ్ళి పరిశీలనగా చూశాడు. అతను కనిపించలేదు.

ఇదే సరైన సమయం...

తన సూట్‌కేస్ తీసుకెళ్దామా వద్దా అని ఒక్కక్షణం ఆలోచించి దాన్నలా వదిలేయడమే మంచిదనుకున్నాడు.

అంతే...

ఇంకే ఆలోచనా పెట్టుకోకుండా పగటిపూట తను పెట్టుకున్న గుర్తులప్రకారం చకచకా నడవడం ప్రారంభించాడు పరబ్రహ్మం...

★ ★ ★

ఏజెన్సీ ప్రాంతంనుంచి రెగ్యులర్ కంట్రిబ్యూటర్ రామాంజనేయులు పంపించిన 'ఆ రచయితలు ఎక్కడున్నారు?' అనే వార్తని 'తెలుగుసీమ' మొఫసిల్ డెస్క్ ఇన్‌చార్జి చదివాడు.

చదివాక ఆ వార్త వేస్తే మంచిదా కాదా అనే




ఆలోచనలో పడిపోయాడు. దినపత్రిక ప్రయో జనందృష్ట్యా మంచిదేగాని కిడ్నాప్ చేయబడి నవాళ్ళ గురించి ఆచూకీ ఇస్తున్నట్టు వార్త వేస్తే ఎలా? ఈ వార్త చదివి పోలీసులు రంగంలోకి దిగితే విప్లవకారులు రామాంజనేయుల్ని చిత కొట్టరూ?

అలా ఆలోచించి, ఆలోచించి చివరకు న్యూసెడిటర్‌కిచ్చి చెప్పాడు

"ఇదోసారి చూడండి''

ఆయన దాన్ని నిర్వికారంగా చదివాడు.

"రామాంజనేయులికి అసలు బుద్ధిలేన ట్టుంది''

"అవును..." అన్నాడు ఇన్‌ఛార్జి, ఆయన కూడా తనలాగానే ఆలోచిస్తున్నందుకు ఆనందంగా.

"ఈ వార్త మన ఎడిషన్‌లో వస్తే తీవ్రవాదు లు మా ఇల్లు వెదుక్కుంటూ వచ్చి తన్నిపోతా రు. సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకో వడం ఎందుకు? ఆపేయండి'' అన్నాడాయన.

"యస్సర్'' అన్నాడు ఇన్‌ఛార్జి. ఆయన తనకంటే పైస్థాయిలో 'స్వధర్మం' గురించి ఆలోచించినందుకు విచారంగా.

ఇన్‌ఛార్జి ఆ న్యూస్‌ఐటమ్ తీసుకొచ్చి వేస్ట్‌బా స్కెట్‌లో పారేసి మిగతా వార్తలు చూడటంలో నిమగ్నమైపోయాడు.

★ ★ ★

నరసింహం మాట్లాడలేదు. ఏదన్నా మాట్లా డితే మళ్ళీ లాఠీతో స్వైరవిహారం చేస్తాడని ఆగిపోయాడు. భవాని ఏదో చెప్పబోయి ఆపే సింది.

"నీమీద ఈ ఒక్క కేసేకాదు వొరేయ్... ఒక బస్సుదహనం కేసు, బెదిరింపులేఖల కేసు కూడా ఉన్నయ్... నిజమా కాదా?"

"బెదిరింపు లేఖలు నేను రాయలేదు''

దాంతో రవిరాజా విజయగర్వంతో కకావిక లుగా నవ్వాడు.

"అంటే... రామకృష్ణానగర్ దగ్గర జరిగిన బస్సుదహనంలో తమరికి సంబంధం ఉన్న ట్టేగా సార్?"

నరసింహం మెల్లిగా అవునన్నట్టు తలూపా డు.

"మరింకా తమరు ఇక్కడే ఉన్నారేమిటి సార్? అజ్ఞాతంలోకి వెళ్ళి ఆయుధం పట్టక..."

నరసింహం మాట్లాడలేదు.

"ఒహో... ఇంకా పైనించి గ్రీన్‌సిగ్నల్ వచ్చినట్టు లేదు. ఇక వస్తుందిలే... రెండుమూ డేళ్ళు జైల్లో ఉంటే ఈ విప్లవం జలుబు తగ్గిపోతుంది. విడుదలయ్యాక జనజీవితంలో కలిసిపోతావు. ఒకవేళ అజ్ఞాతంలోకి వెళ్తే మేం వేటకుక్కల్లా వేటాడతాం. దాంతో హడలి పోయి ఏ మంత్రి సమక్షంలోనో, యస్.పి.ముందో లొంగిపోయి పునరావాసాని కి మాకే అప్లికేషన్ పెట్టుకుంటావు'' అన్నాడు రవిరాజా. దాంతో మిగతా కానిస్టేబుళ్ళందరూ నవ్వారు.

నరసింహం వాళ్ళవైపు నిర్లిప్తంగా చూశా డు తప్ప ఏం మాట్లాడలేదు. రవిరాజా అతని దగ్గరకొచ్చి కొద్దిక్షణాలు ఏదో ఆలోచిస్తూ చూసి మోకాళ్ళమీద కూర్చుని అతని భుజంమీద చెయ్యేశాడు.

"ఒరే నరసింహం... ఇప్పటిదాకా చేసిన వేవో చేశావురా... కాని అడవుల్లోకెళ్ళి ఆయు ధంమాత్రం పట్టకు. నీ మంచికోరి చెబుతున్నా ను, విను. అయినా చక్కగా చదువుకుని, ఉద్యోగం సంపాదించుకుని, పెళ్ళి చేసుకుని పిల్లాపాపలతో సుఖంగా ఉండక ఆయుధాలు పట్టి సమాజాన్ని మార్చే పనిలోకి దిగడం ఎందుకురా? ఒరే... నేను చెబుతోంది నీకిప్పు డు నచ్చకపోవచ్చు. పోవచ్చేమిటి నచ్చిచావ దు. ఉడుకునెత్తురు... విప్లవం, సమాజాన్ని మార్చిపారేయడం... ఇలాంటి నానా చెత్తంతా నీ బుర్రలో చేరిపోయింది. కాలేజీలో చదివేరో జుల్లోనే చెడిపోయి వచ్చావు. అప్పుడు యూని యన్ ఎన్నికల్లో ఇద్దర్ని కొట్టావుకదూ... దెబ్బ లు తిన్నవాళ్ళు గుర్తుపట్టకపోవడంవల్ల బతికి

పోయావు. అప్పుడే లాక్కొచ్చి చితక్కొట్టేసుంటే ఈ జలుబు తగ్గుండేది. తప్పుచేశాం... అయినా ఇప్పుడు కొంప మునిగిపోయిందేంలేదు... యూహేవ్ గాట్ ఎ గుడ్‌ఛాన్స్... ఇదుగో... నీక్కావాలంటే కానిస్టేబుల్ ఉద్యోగానికి అప్లైచేసుకో... కమీషనర్‌కి చెప్పి ఆ ఉద్యోగం వచ్చేటట్టు చూస్తాను... ఏమంటావ్?"

"నాకా ఉద్యోగం ఇష్టంలేదు'' అన్నాడు నరసింహం మెల్లిగా.

"అది కాకపోతే ఇంకోటి. ఈ పశువుల కొట్టం, బస్సు దహనం కేసుల్లో రెండేళ్ళు జైలుశిక్ష పడుతుందిరోయ్... శుభ్రంగా అనుభవించేసి బైటికిరా... మిగతా సంగతి నేను చూసుకుంటాను''

"నామీద మీకింత ఇంట్రస్టేమిటి?"

"తెల్లారుజామున లాకప్‌లో పడేసి విరగ్గొట్టి ఇప్పుడీ నీతిసూక్తులు చెబుతున్నాడేమిట్రా అనా నీ ఆశ్చర్యం? ఒరే... మేంకూడా మనుషులమే. మాక్కూడా పెళ్ళాం, పిల్లలు, చెల్లెళ్ళు, తల్లులు, వదినెలు ఉన్నారు. నిజాయితీగా చెప్పాలంటే మేమీ బట్టలు వేసుకోంగానే జాలి, దయ, సానుభూతి వదిలేస్తాంగాని, అప్పుడప్పుడూ అవి గుర్తొస్తూనే ఉంటయ్‌రోయ్. అందుకని నీలాంటివాళ్ళు ఎప్పుడన్నా లాకప్‌కొస్తే నాలుగు మంచిమాటలు చెప్పడం నేర్చుకున్నాను. పంజాబ్‌లో గిల్ టెర్రరిజాన్ని అణిచేయడానికి రకరకాల పద్ధతులు అమలుచేస్తున్నాడు. అవన్నీ మేం చేసిచావలేంగాని... కనీసం ఇలా చెయ్యొచ్చుకదా... కాని.... ఇంతవరకు ఒక్కడూ నా మాట వినిచావలేదు''

"మీరు మొదటే కాళీప్రసాద్‌ని అదుపులో పెట్టుంటే ఇదంతా జరిగేది కాదు. ఆయన్ని వెనకేసుకురావడంవల్లనే ఇదంతా జరిగింది''

"నిజమేరా! ఆయన్ని మేమేం అరెస్టుచే




స్తాం? చేసినా ఉపయోగం ఏముంది? కేసు పెట్టినా సాక్ష్యం చెప్పడానికి ఎవరొస్తారు? వాడంటే మాకేభయం. అందుకని నువ్వు వాడితో తగాదాకి దిగకుండా చూసీచూడనట్టు పోవడమే మంచిది''

"అదే మంచిపద్ధతా?"

"మంచిపద్ధతో కాదో నువ్వే ఆలోచించుకో. వాడిమీద పోరాటం ప్రారంభించి నువ్వు సాధించిందేముంది? అనవసరంగా జైలుకెళ్ళడం తప్ప. సరే... జరిగిపోయిందేదో జరిగిపోయింది. జైలునుంచి వచ్చాకమాత్రం అడవుల్లోకి వెళ్ళకు. అదొక్కటే నేను చెప్పదలుచుకుంది''

"అప్పటి పరిస్థితుల్నిబట్టి ఆలోచిస్తాను'' అన్నాడు నరసింహం.

"అంటే వెళ్ళాలనే ఉందన్నమాట... దొంగనాకొడక... ఇంతసేపు నేను చెప్పిందంతా విని సాయుధపోరాటంలోకి వెళ్తానంటావా?"

నరసింహం ఏం మాట్లాడలేదు. రవిరాజా భయానకంగా నవ్వాడు. అతనిలోని పోలీసు లక్షణాలు బైటికి వచ్చాయి ప్రస్ఫుటంగా.

"ఒరేయ్... సాయుధపోరాటంతో నువ్వు సాధించి చచ్చేదేమిట్రా? ఏంలేదు బూడిద తప్ప. నువ్వు తుపాకులకోసం నానా బాధలుపడాలి. ప్రభుత్వం తలుచుకుంటే గంటలో లక్ష తుపాకులు తయారుచేయించి పదిలక్షలమంది పోలీసుల్ని రిక్రూట్ చేస్తుంది. ఫైట్ చేస్తావురా మాతో... ఏదీ చెయ్ చూద్దాం. నీవల్ల ఏంకాదు... నీ అన్నలవల్ల ఏంకాదు. ఇంతమంది పోలీసులు, సైనికులతో మీరు గుప్పెడుమంది పోరాటం చేస్తార్రా. చెయ్యండి చూద్దాం. ఎన్‌కౌంటర్లలో లేపిపారేస్తాం. మమ్మల్ని అడిగే దమ్ము ఎవరికీ లేదు. ఒకవేళ ఏదన్నా అయితే పోలీసుల్లో ఆత్మస్థైర్యం తగ్గిపోతుందని చెప్పి ప్రభుత్వం ఏచర్య తీసుకోకుండా ఊరు

కుంటుంది. సర్కార్‌కి కళ్ళూ, చేతులూ, చెవులూ, ముక్కూ, మొహం మేమేరా! నువ్వేం చేస్తావు? అందుకని నోర్మూసుకుని కూర్చో... ఏదన్నా మాట్లాడినా, విప్లవ కార్యక్రమం మొదలుపెట్టినా లేపేస్తాం... జాగర్త..." అని ఆపి నిలబడి మళ్ళీ అన్నాడు రవిరాజా. "అందుకని ఫైనల్‌గా నీకు చెప్పేదేంటంటే..."

"ఏంలేదు... మళ్ళీ చెప్పిందే చెబుతారు. అయినా ఈ సమాజంలో అసమానత్వం ఉంది. అన్యాయాలు, అక్రమాలు, అత్యాచారాలు జరుగుతున్నయ్. వాటిని మీరు అరికట్టగలిగితే ఎవరూ పోరాటంలోకి వెళ్ళరు. మేం కూడా మీరు చెప్పినట్టే హాయిగా ఉంటాం" అన్నాడు నరసింహం.

"ఉన్నయ్‌రా... నేను కూడా ఒప్పుకుంటున్నాను. వాటిని అణిచిపారేయాలంటే శాంతియుత పద్ధతుల్లో ఉద్యమాలు నిర్వహించాలి. మనోళ్ళు ఉట్టి బడుద్దాయిల్రా... కళ్ళముందు హత్య జరిగినా సాక్ష్యం చెప్పడానికి ఎవడూ రాడు. ఏవో కొన్ని కేసుల్లో తప్ప''

"జాతికి ఆ ధైర్యసాహసాలు నేర్పడానికే పోరాటం సాగిస్తున్నాం"

దాంతో రవిరాజా అత్యుత్సాహంగా నవ్వాడు. ఆర్గ్యుమెంట్‌లో తనదే పైచేయి అవుతున్నందుకు.

"ఓహెూ... బ్రహ్మాండమైన స్టేట్‌మెంట్‌రా... కాని ఇన్నేళ్ళు పోరాటం సాగించి, సాగించి నువ్వు సాధించిందేముందిరా... బొచ్చు... ఏంలేదు. రష్యాలో నీలాంటివాళ్ళందరూ పోరాటం సాగించి ఏదో సామ్యవాద వ్యవస్థ అంటూ తీసుకొస్తే ఏమైందిరా... ఇప్పుడక్కడ ఎర్రజెండాయే కనపించకుండా పోయింది. ఒకవేళ అదే అంత మంచి వ్యవస్థ అయితే అది పోతుందంటే జనం ప్రాణాలకు తెగించి అడ్డుపడి ఉండేవాళ్ళు. అక్కడ అన్ని తూర్పుయూరోపియన్ దేశాల్లో కమ్యూనిజం ఏమైంది? అందుకని ఇదే మంచి వ్యవస్థ... అర్థమైందా?"

"అక్కడ నాయకులు తప్పుచేశారు. అందుకని పతనమైపోయింది''

"ఇక్కడి నాయకులు ఊడబొడుస్తారా...? వీళ్ళు అంతకంటె దగుల్బాజీలు. కమ్యూనిజం మతాన్ని మత్తుమందు అంటుందిగాని కమ్యూనిజమే పెద్ద మత్తుమందు. అది ఒక్కసారి తలకెక్కితే జీవితాంతం దిగదు. ఎన్నిసార్లు ఓడిపోయినా అదేదో అలా జరిగింది. ఈసారి విజయం మాదేనంటారు. ఇంతవరకు ఎక్కడా ఒక్క విజయం సాధించకపోయినా..."

"మేం నిరాశావాదులం కాదు... ఏదోనాటికి అనుకున్నది సాధించి తీరుతాం"

"ఆ సంగతేమోగాని ఆ సామ్యవాద వ్యవస్థ ఏదో వచ్చేనాటికి అసలు నువ్వే ఉండవు... ఎప్పుడో వందేళ్ళ తర్వాత వచ్చేదానికోసం నువ్వు ప్రాణాలు పోగొట్టుకోవడం ఎందుకు?"

"ఎన్నో త్యాగాలు చేస్తే తప్ప ఆ వ్యవస్థ రాదు. దానికోసం మేం బాధపడం. మీ లాఠీలకి, తుపాకులకి బెదరం, భయపడం. ఎప్పటికైనా విజయం మాదే. మీరుమాత్రం ప్రభుత్వం వేసే ముష్టికోసం ఇలాగే ఉండిపోతారు''

"మేం ముష్టివెధవలమా? ఏరోయ్... నేన్నీకేదో నాలుగు మంచిమాటలు చెబుదాం అనుకుంటే నువ్వే నాకు నీతిపాఠాలు మొదలెట్టావా? విరగ్గొడతాన్రోయ్ జాగర్త..."

"విరగ్గొట్టినా, కాల్చిపారేసినా నిజం నిజమే''

"అంటే నీ పద్ధతేం మార్చుకోవా?"

"మీరే మీ పద్ధతి మార్చుకోండి''

"మార్చుకుంటాను, మార్చుకుంటాను'' అని ఆపి బల్లదగ్గరికి వెళ్ళి లాఠీ అందుకుని తిరిగొచ్చి నరసింహంవైపు చూసి చిరునవ్వు నవ్వాడు

"మేం ముష్టివెధవలంరా... నువ్వు త్యాగశీలివా... నీ త్యాగాలు, ధర్మాల జలుబంతా ఇప్పుడే ఇక్కడే దిగిపోవాలి'' అంటూ లాఠీతో





ఆపకుండా రెండునిమిషాలు కొట్టి తర్వాత ఆయాసపడుతూ వచ్చి కుర్చీలో కూర్చుని, కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని, పెద్దగా అరిచాడు.

"ఏమే! నీసంగతేమిటి?"

"ఏవే, గీవే అనొద్దు... నాపేరు భవాని"

ఆ మాటతో రవిరాజా తెరలు తెరలుగా నవ్వాడు.

"ఓహో... నువ్వు ఫెమినిస్టువుకదూ... గౌరవంగా సంబోధించాలి కాబోలు..."

"ఎవరినైనా అలాగే పిలవాలి"

"అహాc... మీకు అంటే మీ ఫెమినిస్టులకి ఎక్స్ట్రా గౌరవం ఇవ్వాలి. సర్లే... మీ సిద్ధాంతాల గొడవేదో మీరు చూసుకోండి... అయినా నాకు తెలీకడుగుతాను... ఆడ ముండవి... తప్పుతప్పు... మహిళామణివి నీకెందుకీ రాజకీయాలు చెప్పు... హాయిగా పెళ్ళిచేసుకుని నలుగురు పిల్లల్ని కనక... తగుదునమ్మా, అంటూ బైల్దేరావు!"

భవాని మాట్లాడలేదు.

"ఓహో! అది మీ సిద్ధాంతానికి విరుద్ధం కదూ! పెళ్ళి చేసుకోకుండానే పిల్లల్ని కనొచ్చు. ఇష్టం వచ్చినవాడితో తిరగొచ్చు. అవున్లే... సంసారం ఉంటే వెధవలంపటం..." అన్నాడు రవిరాజా కళ్ళెగరేసి నవ్వుతూ. మిగతా కానిస్టే బుళ్ళు కూడా నవ్వారు.

"అసహ్యంగా మాట్లాడకండి"

"సరే... మహిళామణిగా నీ మాట గౌరవిస్తాను. ఇప్పుడు చెప్పు... కాళీప్రసాద్‌గారి పశువులకొట్టాం తగలబెట్టమని వీడికి చెప్పావా లేదా?"

"చెప్పాను"

"ఎందుకని?"

"కాళీప్రసాద్ నా స్నేహితురాలి పెళ్ళి చెడగొట్టాడు"

"అదా, ఆ రామానుజం కూతురు, ఛాయ..."

"అవును..."

★ ★ ★

పరబ్రహ్మం వెనక్కి తిరిగి చూడకుండా నడక ప్రారంభించాడు - అడవులు, కొండలు, నదీనదాలు, ఎడారులూ మనకడ్డంకావనుకుంటూ. అతను అప్పుడెప్పుడో ఆ గేయానికి ప్యారడీ కూడా రాశాడు. అడవిలో ఏదారీ ఉండదనీ, ఒకవేళ తప్పిపోతే చాలా ఇబ్బందులు పడాల్సి వస్తుందని అతనికి తెలీదు. పారిపోయే హడావుడిలో అవన్నీ పట్టించుకోలేదు.

అంతకుముందు తను పెట్టుకున్న గుర్తుల ప్రకారం ఆ బండరాళ్ళ దగ్గరనుంచి కుడివైపుకి తిరగాలి, ఈ పెద్దచెట్టు దగ్గరనుంచి ఎడమవైపుకి తిరగాలి... అనుకుంటూ గబగబా నడవసాగాడు. అతనికి మామిడి, జామ, వేపలాంటి చెట్లు తప్ప మిగతా చెట్లపేర్లేం తెలీవు. అయితే అలవాటు లేకపోవడంవల్ల పైగా అనుమానం, భయంవల్ల అడుగులు అతననుకున్నంత వేగంగా పడటంలేదు.

సూర్యుడు బారెడుపైకెక్కాడు.

పరబ్రహ్మంకి ఆమాత్రం వేడికే చెమటలు పడుతున్నాయి. నడిచీ నడిచీ చాలాదూరం వెళ్ళాక తాము అంతకుముందు చూసిన గూడెం కనిపించింది. అతను గూడెంలోకి వెళ్ళకుండా ఒక జొన్నచేలో మామిడిచెట్టు వెనక నిలబడి పరిశీలించాడు. ఈపాటికి గిరిజనులు సంతకి వెళ్ళుంటారేమో! తన ప్రయత్నం వృధాప్రయాస అవుతుందేమో! ఇంతా శ్రమపడివస్తే ఏం సాధించలేక వెనక్కి తిరిగిపోవడమే అవుతుందేమో! అనిపించింది.

పరబ్రహ్మం అలాగే కదలకుండా నిలబడి గూడెంవైపు చూడసాగాడు. క్షణాలు మెల్లిగా దొర్లుతున్నాయి. అతని నిరీక్షణ అరగంట తర్వాత ఫలించింది.

నలుగురు గిరిజన స్త్రీలు తట్టాబుట్టలతో బైటికి వచ్చి వాళ్ళలో వాళ్ళు ఏదో మాట్లాడుకుంటూ మెల్లిగా నడవసాగారు. పరబ్రహ్మం చెట్టువెనకనుంచి ఇవతలికి వచ్చి వాళ్ళని అనుసరించసాగాడు. పరబ్రహ్మంకి అలసట,

ఆయాసం, దాహంతో వళ్ళు తూలుతోంది. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా నడవ సాగాడు. మధ్యలో ఒక వాగు వస్తే నీళ్ళు స్వచ్ఛంగా లేకపోయినా దాహం తీర్చుకున్నాడు.

గంటన్నర నడిచాక ఎర్రమట్టిరోడ్డు కనిపించింది. పరబ్రహ్మం ఆ రోడ్డుమీద అడుగు పెట్టి ఘనవిజయం సాధించినవాడిలా ఫీలయ్యాడు. అలా నడిచి నడిచి సంతకి చేరేసరికి మధ్యాహ్నం రెండుగంటలైంది.

పరబ్రహ్మం సంతకి కొంచెందూరంలోనే ఆగిపోయాడు. చింతపండు, జిగురు, ఇప్పపూలు, జొన్నలు, సజ్జలు, రాగులు గుట్టలుగా పోసివున్నాయి. కోళ్ళు, మేకలు, గేదెలు... అమ్మకానికి వచ్చాయి. గిరిజన స్త్రీపురుషులు వరుసగా కూర్చుని ఉన్నారు. దళారీలు వాళ్ళతో బేరం ఆడుతున్నారు. తినుబండారాలు, టీ అమ్మేవాళ్ళు హడావుడిగా తిరుగుతున్నారు. ఒక కుర్రాడు, సిగరెట్ పెట్టెలున్న బాక్స్‌తో తిరగడం చూసి పరబ్రహ్మానికి ప్రాణం లేచొచ్చింది. కొంచెం ఎడంగా రెండు ట్రాక్టర్లు, పదిపన్నెండు ఎడ్లబళ్ళు కనిపించాయి.

ఆ దృశ్యం చూసేసరికి పరబ్రహ్మానికి ఉత్సాహం పొంగుకొచ్చింది. ముందు ఏదోఒకటి తిని, దాహం తీర్చుకుంటే తప్ప తను సజావుగా ఇంటికి వెళ్ళలేనని అనిపించింది. ఎవరైనా పోలీసు కనిపిస్తాడేమో, తన గోడు విన్నవించుకుందామని చూశాడుగాని కనుచూపు మేరలో ఎవరూ కనిపించలేదు.

పరబ్రహ్మం మెల్లిగా సంతలోకి ప్రవేశించాడు.

ఒకరిద్దరు అతనివైపు చూశారుగాని అతను మొహం తిప్పుకున్నాడు.

అంతలో దూరంగా మోటారు సైకిల్‌మీద కూర్చుని చిద్విలాసంగా సిగరెట్ కాలుస్తున్న 'తెలుగుసీమ' రిపోర్టర్ రామాంజనేయులి చూపులు అతనిమీద పడ్డాయి. దళారీలను ప్రోత్సహించరాదని తన దినపత్రికలో చాలా వార్తా వ్యాసాలు రాసిన అతను సంతలో చౌకగా చింతపండు, ఎండుమిర్చి కొనుక్కోవడానికి వచ్చాడు.

వెంటనే తొందరపడి లేచిరాకుండా పరబ్రహ్మం కదలికల్ని గమనించసాగాడు. గడ్డం పెరిగివుంది, జుట్టు రేగివుంది. బట్టలు మట్టికొట్టుకునిపోయాయి. మొహంలో అలసట కనిపిస్తోంది.

ఎవరతను?

కొద్దిక్షణాలు ఆలోచించాడు రామాంజనేయులు. ఏవన్నా కొనడానికి వచ్చాడేమోనని చూశాడుగాని అతను అటూ ఇటూ చూడటం తప్ప ఏమీ కొనేప్రయత్నం చెయ్యడంలేదు. పోనీ మఫ్టీలో ఉన్న పోలీసా అనుకుందామనుకుంటే ఆ అవతారం అలా కనిపించడంలేదు. ఇంకా రకరకాల ఊహలు వచ్చాయిగాని అవి ఏవీ అతని ప్రస్తుత పరిస్థితికి సరిగ్గా అతకడంలేదు. దాంతో రామాంజనేయులు ఆలోచన విరమించి మోటారు సైకిల్ దిగి మెల్లిగా అతనిదగ్గరికి నడిచాడు. పరబ్రహ్మం అతన్ని గమనించలేదు, ఏం తిందామా అనే ఆలోచనలో ఉన్నాడు.

"హలో..." పలకరించాడు రామాంజనేయులు. పరబ్రహ్మం తల పక్కకి తిప్పి చూసి "హలో..." అన్నాడు అనుమానంగా.

"నా పేరు రామాంజనేయులు. తెలుగు సీమ డైలీకి ఈ ప్రాంతం విలేఖరిని''

"గ్లాడ్‌టు మీట్‌యూ'' అన్నాడు పరబ్రహ్మం చెయ్యి అందిస్తూ.

"మీ పేరు...?"

"పరబ్రహ్మం"

"ఎక్కడనుంచి వస్తున్నారు?"

"అడవిలోంచి''

"ఎందుకెళ్ళారు?"

"నేను వెళ్ళలేదు. విప్లవకారులు కిడ్నాప్ చేశారు. నేనో రచయితను''

"ఎప్పుడు?"




"వారంరోజులైంది"

"అంటే... వాళ్ళు కిడ్నాప్ చేసి తీసుకెళ్ళిన ఐదుగురు రచయితల్లో మీరొకరా....? పేరు పర(బ్రహ్మం అని చెప్పారుగదూ... అంటే హాస్యరచయిత... నైస్‌టూ మీట్‌యూ సర్" అన్నాడు రామాంజనేయులు అమితా నందంతో అతని చెయ్యి పట్టుకుని ఊపేస్తూ. పర(బ్రహ్మం అతి కష్టంమీద ఆ చెయ్యి విడి పించుకుని అన్నాడు.

"నేను తప్పించుకొచ్చాను"

"వెరీగుడ్... తీ(వవాదులు కిడ్నాప్ చేస్తే వాళ్ళంతట వాళ్ళు విడిచిపెట్టేవరకు దిక్కుండదు. సో, యూ ఆర్ ది ఫస్ట్‌మాన్ టు హావ్ ఎస్కేప్డ్ (ఫమ్ ది క్లచస్ ఆఫ్ ది నక్సల్స్... (బహ్మాండం సార్... మహా ద్భుతం... బాక్స్‌వార్త రాసేస్తాను. మీ ఫొటో... ఇంటర్వ్యూ అన్నీ ఫస్ట్ పేజీలోనే... నాకు చాలాకాలానికి బైలైన్ దొరికింది. థాంక్స్... మన పలుకుబడి ఈ దెబ్బతో జానెడు ఎత్తు పెరిగిపోతుంది. అదృష్టమండీ... అదృష్టం ఉండాలి దేనికైనా. ఎప్పుడో తప్ప సంతకి రానివాణ్ణి ఇవాళ రావడం ఏమిటి? మీరు నాకు కనిపించడం ఏమిటి?" హుషారుగా అన్నాడు రామాంజనేయులు.

పర(బ్రహ్మానికిమా(తం అతని వ్యవహారం ఏం నచ్చలేదు. తను చచ్చిచెడి ఇన్నిమైళ్ళు నడిచి ఇక్కడికి చేరుకుంటే ఇతనేమిటి బాక్స్ వార్తలూ, పతాక శీర్షికలూ, ఫొటోలూ, ఇంట ర్వ్యూ అని హడావుడి చేస్తాడు? చిరాకుపడ్డాడ తను.

"నేను చాలామైళ్ళు నడిచి ఇక్కడికి చేరు కున్నాను. ఆకలి దంచేస్తోంది"

"అవునుగదూ... ఆ సంగతే మరిచిపోయా ను. వెంటనే పట్నం వెళ్దాం పదండి. భోంచేసి మా ఇంటికెళ్ళి కూర్చుందాం. అన్నట్టు ఆ గడ్డం కూడా గీయించేద్దాం. వద్దొద్దు... ఫొటో పేపర్లో వేయిస్తాంగదా... సహజంగానే ఉండాలి. అందుకని ఇలా ఒక్కరోజు ఉంచేసు కోండి. రేపు చూద్దాం. రండి వెళ్దాం"

పర(బహ్మం మౌనంగా అతన్ని అనుస రించాడు. రామాంజనేయులు మోటారుసైకిల్ స్టార్ట్‌చేసి అతన్ని ఎక్కించుకుని అత్యుత్సా హంగా ముందుకు దూకించాడు.

వాళ్ళు కొద్దిదూరం వెళ్ళగానే ఒక పోలీసు జీపు ఎదురొచ్చింది. అందులో ముందుసీట్లో కూర్చున్న డి.ఎస్.పి. రామాంజనేయుల్ని చూసి ఆగమన్నట్టు చెయ్యెత్తాడు.

మోటారుసైకిల్ ఆగింది.



కాళ్ళు నొప్పెడుతున్నాయా?" అడిగాడు ముందు నడుస్తున్న పులకేశి ఆగి వెనక్కి చూస్తూ.

"అవును..." అన్నాడు కిశోర్‌కుమార్.

"కాసేపు ఆగుదామా?" ఆశగా అడిగాడు గురుదేవ్.

"కుదర్దు... గమ్యం చేరేవరకూ మహా(పస్థా నమే. నో రెస్ట్ ప్లీజ్"

"జీవితంలో ఇంతదూరం ఏకబిగిన ఎప్పు డూ నడిచి ఎరగం" అన్నాడు నాగార్జున సణుగుతున్నట్టు.

"ఏంచేస్తాం? ఈ సమస్య మీ మి(తుడు తెచ్చిపెట్టిందే... రచయితలనే గౌరవంతో, అడ వుల్లో దారి తెలీదనే ధీమాతో కొంచెం ఆదమర పుగా ఉన్నాం. పర(బహ్మం తప్పించుకున్నా డు. అతనికోసం వెదకడం పట్టుకోవడం,

మళ్ళీ ఇక్కడికి తీసుకురావడం మాకు సమస్యకాదుగాని పోనీలే అని వదిలేశాం. మీ రచయితల సామాజిక చైతన్యం ఆస్థాయిలో ఉంది... ఏంచేస్తాం?'' అన్నాడు పులకేశి.

ఆరోజు ఉదయాన్నే అందరూ నిద్రలేచి ఒకరినొకరు చూసుకున్నారు. ఎప్పుడో ఆలస్యంగా, బద్ధకంగా నిద్రలేచే పరబ్రహ్మం అప్పుడే లేచి ఎక్కడికి వెళ్ళాడోనని ఆశ్చర్యపడ్డారు. బహుశా కాలకృత్యాలు తీర్చుకోడానికి వెళ్ళాడేమోనని కొంతసేపు అనుకున్నారుగాని అతను ఎంతసేపటికీ రాకపోవడంతో పులకేశికి అనుమానం వచ్చింది. దాంతో ఆ చుట్టుపక్కల అంతా గాలించి వచ్చి చెప్పాడు.

''మీ పరబ్రహ్మం తప్పించుకున్నాడు''

''వాడిమొహం... మా సిటీలో ముప్పావువంతు తెలీదు వాడికి. ఏదన్నా కొత్త అడ్రసు చెప్పేటప్పుడు దానిదగ్గర్లో ఉన్న బార్‌పేరు చెబితే తప్ప కనుక్కోలేడు'' అన్నాడు గురుదేవ్.

ఆ మాటకి అందరూ నవ్వారు.

''మొన్న గూడెంలో చీకటి పడేవేళ బైటికి వెళ్ళినప్పుడే కొంచెం అనుమానం వచ్చింది నాకు. ఎక్కడికెళ్తాడులే అని ధీమాగా ఊరుకున్నాను''

సరిగ్గా వెళ్ళాడో, అడవిలో దారి తెలీక తిరుగుతున్నాడో'' అన్నాడు కిశోర్‌కుమార్. అతనెప్పుడూ అడవిమొహం చూడకపోయినా చాలా నవలల్లో అడవుల్ని అద్భుతంగా వర్ణించాడు.

''వెళ్ళే ఉంటాడు. ముందునించి ప్లాన్‌మీద ఉన్నాడుగదా! డోన్ట్‌వర్రీ...'' అన్నాడు పులకేశి ఓదార్పుగా.

''నాలుగు రోజులు ఆగితే మీరే పంపించేవాళ్ళు... అనవసరంగా తొందరపడ్డాడు'' అన్నాడు వివేకానంద.

''ఆగలేక పారిపోయాడు''

వెళ్ళేవాడు తనొక్కడే వెళ్ళకుండా అందర్నీ తీసుకెళ్తేపోయేది. ఎంత స్వార్థపరుడు పరబ్రహ్మం. పేరుకి రచయిత. మనుషులంతా హాస్యధోరణి పెంచుకుని, చిరునవ్వులు చిందిస్తూ, శాంతిసౌభాగ్యాలతో వర్ధిల్లాలని దిక్కుమాలిన రాతలు రాయడం... తీరా చూస్తే ఇలాంటి దగుల్బాజీ పనులు చెయ్యడం... మనసులోనే అతనిమీద మండిపడ్డాడు గురుదేవ్, కిశోర్‌కుమార్, నాగార్జున.

వివేకానందమాత్రం అలా అనుకోలేదు. తీవ్రవాదులు అతన్ని వెదికి పట్టుకుని తిరిగి తీసుకొస్తే బాగుండునేమో అనుకున్నాడు. లేకపోతే ఏ అడవిజంతువుల బారినన్నా పడొచ్చు. అదో అప్రదిష్ఠ.

''పరబ్రహ్మం పారిపోవడంకాదుగాని మీకిప్పుడు చాలా పెద్ద ఇబ్బంది వచ్చింది'' అన్నాడు పులకేశి.

''ఏమిటది?'' అడిగాడు గురుదేవ్.

''మనం ఇక్కడినుంచి వెంటనే మకాం మార్చెయ్యాలి''

''ఇక్కడ బాగానే ఉందికదా'' అన్నాడు కిశోర్‌కుమార్ నీరసంగా. ఏదో ఒకచోట కదలకుండా ఉంటే బాగుండునని ఉంది అతనికి.

''బాగానే ఉందిగాని పరబ్రహ్మం పోలీసుల కంట పడకమానడు. వాళ్ళతనిని నానా ప్రశ్నలు వేసి, తీవ్రవాదుల స్థావరం ఎక్కడో చూపించమని అతన్ని జీపులో ఎక్కించుకుని తీసుకొస్తారు. అందుకని మనం వెంటనే మకాం మార్చెయ్యాలి.. గెట్‌రెడీ''

అంతే... నడక ప్రారంభమైంది.

ఇక్కడ ఆగుదాం, అక్కడ ఆగుదాం అని రచయితలు ఎన్నిసార్లు అడిగినా పులకేశి ఒప్పుకోలేదు. దాంతో వాళ్ళకి పరబ్రహ్మంమీద మహాకోపం వచ్చింది. అతను తప్పించుకుని తమని ఇన్ని బాధలు పెడుతున్నందుకు సిటీకి వెళ్ళాక పరబ్రహ్మానికి గట్టిగా బుద్ధి చెప్పాలని ఎవరికివాళ్ళే మనసులో ఘోరమైన శపథాలు చేసుకున్నారు.

మధ్యలో వంట, భోజనం...





కొద్దిసేపు విరామం.

మళ్ళీ నడక...

అడవి రానురాను మరీ చిక్కబడుతోందనీ, కొన్నిచోట్ల అసలు సూర్యకిరణాలే లోపలికి ప్రవేశించడంలేదని రచయితలు గ్రహించారు.

అలా నడిచి, నడిచి ఒకచోట ఆగాడు పులకేశి.

"గమ్యం చేరుకున్నాం... ఇక మీరు విశ్రమించవచ్చు" ప్రకటించాడతను.

రచయితలు చుట్టూ చూశారు.

ఆ ప్రదేశం కొంచెం ఎత్తుగా ఉంది. చుట్టూ బండరాళ్ళు... మధ్యలో చదునుగా, నలుచదరంగా ఉంది. పేర్లు తెలీని ఏవో చెట్లు రంగు రంగుల పూలతో ఉన్నాయి. దూరంగా ఓ కొండ.

వివేకానంద టైమ్ చూశాడు.

సాయంత్రం 4.35 అయింది.

★ ★ ★

టైమ్ చూశాడు కాళీప్రసాద్...

సరిగ్గా 4.35 అయింది.

రెండురోజులక్రితం జరిగిన ఆ సంఘటన ఆయన మరిచిపోలేకుండా ఉన్నాడు. ఛాయ అలా తిడుతుందని ఊహించాడుగాని కేవలం ఒక ఆడది తనని చెప్పుతీసుకుని కొడుతుందని అనుకోలేదు.

ఒక్కక్షణం... ఆశ్చర్యం... దిగ్భ్రాంతి...

జరిగింది జీర్ణం చేసుకోవడానికి రెండునిమిషాలు పట్టింది. అదృష్టం... ఆ సంఘటన ఎవరూ చూడలేదు.

అవమానింపబడిన దుర్యోధన సార్వభౌముడిలా విలవిల్లాడిపోయాడు కాళీప్రసాద్. అహంకారం లోపల బుసలుకొట్టింది. గాయపడిన ఆత్మాభిమానం అదుపుతప్పి రంకెవేసింది.

ఇంతకింత చెయ్యకపోతే ఛాయమీద ప్రతీకారం తీర్చుకోకపోతే తను బతికి లాభంలేదు. ఈ సంగతి నలుగురికీ తెలిస్తే తనంటే గడగడవణికేవాళ్ళు, భయంతో బిగుసుకుపోయేవాళ్ళు ఇక తననేం లెక్కచేస్తారు? రేపు ఐదేళ్ళ కుర్రాడు కూడా ఎదురుతిరుగుతాడు. అసలే హక్కులు, పోరాటాలు అంటున్న దళితులు ఇదే అవకాశమని తనమీద ఎదురు తిరిగినా తిరగొచ్చు. ఇప్పటిదాకా గ్రామం అంతా తను చెప్పినట్టే వింటోంది. తను చెప్పిందే వేదం... చేసిందే శాసనం...

తనకాళ్ళకింద భూమిని ఎవరో లాగేస్తున్నట్టు, తనని అథఃపాతాళానికి తొక్కేయడానికి కుట్ర చేస్తున్నట్టు, తనని నామరూపాలు లేకుండా, ధ్వంసంచేయడానికి కలసికట్టుగా పథకం రూపొందిస్తున్నట్టు ఫీలయ్యాడు కాళీప్రసాద్.

ఛాయ తనని చెప్పు తీసుకు కొట్టిందని ఆడాళ్ళకి తెలిస్తే ఇంకా ప్రమాదం... వాళ్ళు మొహంమీదే నవ్వుతారు. తను వీధిలోకి వస్తే కనుచూపుమేరలో కనిపించడానికి జంకే ఆడాళ్ళు ఛీత్కరిస్తారు.

ఈ ఆలోచనలతోపాటు అప్పుడెప్పుడో తను చేసిన వీరోచిత కార్యక్రమాలన్నీ గుర్తొచ్చాయి కాళీప్రసాద్‌కి. ఒకసారి ఊళ్ళో ఇద్దరు రైతులమధ్య భూమితగాదా వస్తే దాన్ని పరిష్కరించడానికి ఎమ్మార్వో వచ్చాడు. తను ఆయన్ని పదిమందిముందు నిలదీసి, అవమానకరంగా మాట్లాడి వెనక్కి పంపించేశాడు. తన గ్రామంలో వచ్చే తగాదాలు పరిష్కరించడానికి తనుంటే నువ్వెవడివి జోక్యం చేసుకోవడానికని నానా తిట్లూ తిట్టి పంపించేశాడు. ఆ ఎమ్మార్వో వెనక్కి వెళ్ళి పోలీస్‌కేసు పెట్టడం, వాళ్ళు రావడం, తను నాలుగు డబ్బులిచ్చి సర్దిచెప్పి పంపించడం... అన్నీ సినిమాదృశ్యాల్లాగా కాళీప్రసాద్ కళ్ళముందు కనిపించాయి. ఎమ్మార్వో, పోలీసులే ఏంచేయలేనప్పుడు ఆఫ్టరాల్ ఒక ఆడపిల్ల... తనని అవమానించడం ఏమిటి?

మొన్న తన పశువులకొట్టం తగలెట్టినవాణ్ణి

పోలీసులు లోపల పడేసి చితక్కొట్టారు. వాడు రెండేళ్ళు జైల్లోనే ఉండాలి. థాంక్స్‌టు యస్.ఐ. రవిరాజా. ఛాయ స్నేహితురాలు భవానిని వదిలేసినట్టు చెప్పాడు యస్.ఐ. అసలు దాన్ని కూడా ముక్కలు విరగ్గొట్టించి కనీసం ఒక్క ఆరునెలలైనా జైలుకి పంపించి ఉంటే బాగుండేది. పోనీలే ఆడదని తను సిఫార్సు చేయలేదు. కాని ఛాయమీదమాత్రం దయాదాక్షిణ్యాలు చూపించకూడదు.

ఆమధ్య కూలీరేట్లు పెంచమని దళితులు గొడవచేస్తే తను రాత్రికి రాత్రి హరిజనవాడ వెళ్ళి నలుగుర్ని చితక్కొట్టి దారికి తీసుకొచ్చాడు. ఒక్కడూ కిక్కురుమనలేదు. కొంతమంది దళిత కుర్రాళ్ళు కొంచెం కాలరెగరెయ్యబోతే తను పోలీసుల్ని ఉసిగొలిపి వాళ్ళని భయపెట్టేసి నొక్కేశాడు. దాంతో వాళ్ళంతా చచ్చినట్టు పాతరేట్లకే నాట్లేశారు. కుప్పలేశారు. నూర్పిళ్ళకొచ్చారు. పంచాయితీ సభ్యుల్లో ఎవరూ తనమాటకి ఎదురు చెప్పరు. రామచంద్రాపురం అనే ఈ ఊరు తన కాలికింద చెప్పులా అణగిమణిగి పడుంటే ఇంతకాలానికి ఒక ఆడపిల్ల తనని చెప్పుతో కొట్టడం ఏమిటి? ఇంతకింత ప్రతీకారం తీర్చుకోకపోతే ఇక తనెందుకు? ఉన్నా పోయినా ఒక్కటే... అందుకని ఛాయని క్షమించే ప్రశ్నేలేదు.

అసలు తన స్టేటస్ ఏమిటి? తనేమిటి? పట్నంలో రెండు ఖాతాలున్నాయి. ఊళ్ళో రెండున్నాయి. తనకి ఎవరెవరితో సంబంధాలున్నాయో అందరికీ తెలుసుగాని వాళ్ళలో ఎవడికీ తనని నిలదీసే ధైర్యంలేదు. ఒకవేళ అలా ధైర్యంచేస్తే ఊరుకుంటాడా తను? పాతెయ్యడూ!

అసలు తనన్నదాంట్లో తప్పేముంది? ఒసే పిల్లా! నువ్వు చాలా అందంగా ఉన్నావు. నీమీద మోజుపడుతున్నాను. పట్నంలో ఇల్లు కట్టిస్తాను. ఉద్యోగం ఇప్పిస్తాను. హాయిగా




పడుండవే అని చెబితే వినిచచ్చిందా? ఒకవేళ దాని అమ్మ పెళ్ళిచేసినా ఏ గుమస్తావెధవకో కట్టబెట్టాల్సిందే. వాడితో రెండుగదుల అద్దె కొంపలో ఏడుస్తూ, ఏ సౌకర్యాలు, విలాసాలు, షికార్లు లేకుండా రేడియో లలితసంగీతం పాటలు వింటూ దిక్కుమాలిన కుక్కబతుకు బతకడంకంటె తన సామ్రాజ్యంలో ఉంపుడుకత్తెగా ఉంటేనేం? హాయిగా సుఖంగా ప్రశాంతంగా బతకమంటే వినిచచ్చిందా? ఎదురు తిరిగి పోరాటం ప్రారంభించి సాధించి చచ్చిందేముంది? అనవసరంగా తండ్రిని పోగొట్టుకోవడం తప్ప... అయినా ఇంకా పులుపు చావలేదు. తనని చెప్పుతీసుకుని కొట్టింది.

అయితే ఆ ఛాయకి తగినశాస్తి ఎలా చెయ్యాలి? ఏంచేస్తే దానికి బుద్ధి వచ్చి మెదలకుండా దాలిగుంటలో కుక్కలాగ పడుంటుంది? రఘురాంని సలహా అడిగితే? అనవసరం... వాడసలే తాగుబోతు వెధవ. ఛాయ తనని అవమానించిందన్న సంగతి ఈక్షణంవరకు తనకి తప్ప ఎవరికీ తెలీదు. ఇప్పుడు వీడితో చెబితే ఊరంతా తెలిసిపోతుంది.

ఐడియా... నలుగురు మనుషుల్ని పంపించి మానభంగం చేయిస్తే... లేకపోతే దాన్ని నరికించేస్తే? లాభంలేదు... ఆ రెండుపనులవల్ల తన కసి తీరదు. వాళ్ళెవరో ఏదో చేస్తే తనకేం ఒరుగుతుంది? దానిమీద తనే ప్రతీకారం తీర్చుకోవాలి.

దానికేం చెయ్యాలి?

ఒక్కటే మార్గం...

ఇల్లూ, పొలం అమ్మేసి పట్నం వెళ్ళిపోవడానికి ప్రయత్నం చేస్తున్నారట... బేరం కూడా కుదిరిందటగాని ఇంకా బయానా ఇవ్వలేదుట. వాళ్ళు పట్నం వెళ్ళినా తనకా అవకాశం వస్తుందిగాని ఇక్కడే... ఈ ఊళ్ళోనే దాన్ని

అవమానించాలి. అప్పుడుగాని తన పగ చల్లారదు. దీంతో ఊళ్ళో తన పరపతీ పెరుగుతుంది, భయం కూడా ఉంటుంది. వినయవిధేయతలు పెరుగుతాయి.

టైమ్ చూశాడు కాళీప్రసాద్.

నాలుగూ నలభై అయింది.

ఐదూపదికి పట్నం వెళ్ళే బస్సొస్తుంది. ఛాయ, దాని తల్లి ఈ బస్సుకి పట్నం వెళ్తారని తెలిసింది, కాబట్టి ఇదే మంచి అవకాశం...

ఇంట్లోంచి వచ్చి జీపెక్కి స్టార్ట్ చేసి, నాలుగు నిమిషాల్లో బస్‌స్టాండ్‌కి వచ్చి, ఓపక్క ఆపి దిగాడు. నిజానికి అక్కడ బస్‌స్టాండు అంటూ ఏమీలేదు. ఊళ్ళో పెద్దాళ్ళు ముఖ్యంగా కాళీప్రసాద్ అక్కడ బస్సాపమని చెప్పాడు. కచేరీసావట్లో పదిపన్నెండుమంది ఉన్నారు. పనీపాటాలేని కుర్రాళ్ళు నలుగురు ఓమూల పేకాట ఆడుకుంటున్నారు. మిగతావాళ్ళు పేపర్లు చదువుతూ రాజకీయాల గురించి చర్చించుకుంటున్నారు. ఐదారుగురు బస్సుకోసం ఎదురుచూస్తున్నారు. పక్కనున్న తాటాకుల గుడిసెముందు ఇద్దరు పకోడీలు తింటున్నారు. బీడీకొట్టు దగ్గర ఎవరూలేరు. మాలపల్లినుంచి వచ్చినవాళ్ళుమాత్రం కచేరీ సావట్లోకి వెళ్ళకుండా బైటే నిలబడిపోయారు.

మంచినీళ్ళ బావికి నీళ్ళకి వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు. కాలవలో బట్టలు ఉతుక్కుని వచ్చేవాళ్ళు వస్తున్నారు. పొలాలనుంచి వచ్చేవాళ్ళు మధ్యలో ఆగి, కచేరీ సావట్లోకి వెళ్ళి పేపర్లలోకి తొంగిచూస్తున్నారు.

కాళీప్రసాద్ జీపుదగ్గరే సిగరెట్టు కాలుస్తూ నిలబడ్డాడు చుట్టూ చూస్తూ. ఆయనకి సంతృప్తిగా ఉంది, ఇంతమందిముందు ఛాయని అవమానిస్తే తన కసి తీరుతుంది.

బస్సొచ్చే టైమైంది.

ఒకవేళ వాళ్ళు ఈ బస్సుకి వెళ్ళరేమో! అనుమానం వచ్చి మళ్ళీ రోడ్డువైపు చూశాడు కాళీప్రసాద్. దూరంగా ఏదో మాట్లాడుకుంటూ వస్తున్న ఛాయ, ఆమె తల్లి కనిపించారు.

ఛాయ దగ్గరదాకా వచ్చాక ఆయన్ని చూసి తల తిప్పేసుకుంది.

ఇదే సరైన సమయం.

"ఏం ఛాయా బాగున్నావా?" అడిగాడు కాళీప్రసాద్.

ఛాయ, ఆమె తల్లి ఆగారు.

"మీరు బాగున్నారా?"

"ఏదో నీదయవల్ల. అయినా ఇంటికొచ్చిన వాణ్ణి అవమానించేసి, ఇల్లూ, పొలం అమ్ముకుని పట్నం వెళ్దామనుకుంటే కుదర్దు..."

"ఎందుకు కుదర్దు... మీరేమన్నా ఆపుతారా, అడ్డం పడతారా?"

"నేను ఏదైనా చెయ్యగలను. నన్ను అవమానించినందుకు ఇప్పుడే, ఈక్షణంలోనే నిన్ను ఘోరంగా అవమానించబోతున్నాను. ఆపుతావా, అడ్డంపడతావా అన్నావుగదా! ఇప్పుడు ఎవడొచ్చి ఆపుతాడో, అడ్డంపడతాడో నేనూ చూస్తాను'' అంటూ ఛాయ కొంగుపట్టుకుని లాగాడు కాళీప్రసాద్.

ఆమె తల్లికి ఏం జరుగుతోందో రెండుక్షణాలు అర్థంకాలేదు. అర్థమైన వెంటనే ముందుకొచ్చి అడ్డుపడబోయిందిగాని కాళీప్రసాద్ ఆమెని బలంగా వెనక్కి నెట్టాడు. ఆవిడ వెళ్ళి రోడ్డుమీద పడిపోయింది. ఛాయ స్థాణువులా చూస్తూండిపోయింది. కాళీప్రసాద్ పైశాచికంగా నవ్వుతూ ఆమె గుండెలమీద చెయ్యేసి రవిక లాగేసి, ఇంకో చెయ్యి బలంగా మీదవేసి బలంగా గుంజాడు. అది జారిపోయింది.

కాళీప్రసాద్ ఇంత దారుణానికి దిగుతాడని ఆమె కలలో కూడా ఊహించలేదు.

ఛాయ నీళ్ళునిండిన కళ్ళతో చుట్టూ చూసింది రొమ్ములమీద చేతులు అడ్డుపెట్టుకుని.

అలనాడు కౌరవసభలో, ఇప్పుడు నల్గొండలో, అమరావతిలో ఇంకా ఎన్నోచోట్ల స్త్రీని నగ్నంగా చేసి పైశాచికంగా, వికృతంగా ఆనందించినా చూస్తూ ఊరుకోవడం మినహా




ఎవరూ ఏం చెయ్యలేదు. ఇప్పుడూ అదే పునరావృతమైంది.

ఎవరూ దగ్గరికి రాలేదు. కొంతమంది తలలు వంచుకున్నారు. ఎక్కువ మంది ఆబగా, ఆత్రంగా వెకిలిగా చూస్తూ ఉండిపోయారు.

తన కాళ్ళకింద భూమి నిలువునా చీలిపోయి లోపలికి వెళ్ళిపోతే బాగుండునని పించింది ఛాయకి.

కాని అలా జరగలేదు.

ఆకాశాన్ని కిందికి లాగి మీద కప్పుకుందామా అనిపించింది.

అది సాధ్యం కాలేదు.

కాళీప్రసాద్ జీపెక్కి వెళ్ళిపోయాడు ఆనందంగా.

ఛాయ అలా నిశ్చేతనంగా నిలబడిపోయింది... నడిరోడ్డుమీద నగ్నంగా.

★ ★ ★

పోలీస్ జీపు ఆగింది.

తెలుగు సీమ రిపోర్టర్ రామాంజనేయులు మోటారుసైకిల్‌ని టక్కున ఆపాడు. డి.యస్.పి. అతన్ని చూసి విశాలంగా నవ్వి అన్నాడు,

"హలో... ఎక్కడినించి?"

"సంతకెళ్ళి వస్తున్నాను సార్..."

"ఏం కొనలేదేవిటి?" పోలీసు ప్రశ్న అడిగాడాయన.

"రేట్లు బాగా ఎక్కువగా ఉన్నయ్ సార్"

"కిలో మూడు రూపాయలకి చింతపండు, ఆర్రూపాయలకీ మిర్చి కొందామనా? దళారీ గాళ్ళు వాళ్ళనెటూ దోచేస్తున్నారు. దోపిడీ గురించి పేజీలకి పేజీలు రాసే నీలాంటి నిజాయితీ పరులైన రిపోర్టర్లు కూడా వాళ్ళని దోచుకుంటే ఎలా?" అడిగాడాయన నవ్వుతూ. దాంతో మిగతా కానిస్టేబుళ్ళు కూడా నవ్వారు.

"మీరూ సంతకేనా సార్"

"అవును... అన్నలు కనిపిస్తారేమోనని గాలిస్తున్నాం. మొన్న మందుపాతరపెట్టి మావాళ్ళు తొమ్మిది మందిని లేపేశారు గదా. వాళ్ళు దొరికితే ఏకంగా ఓ ఇరవైమందిని లేపేద్దామని చూస్తున్నాం"

"వాళ్ళంత తేలిగ్గా దొరుకుతారా సార్?"

"దొరక్కపోతే ఇన్ని ఎన్‌కౌంటర్లు ఎట్లా చేసేవాళ్ళం? రాష్ట్రంలో నక్సలైట్ అనేవాడు లేకుండా చేయడమే మా లక్ష్యం"

"నిషేధాలు విధిస్తే అన్నలు లేకుండా పోతారా మీ భ్రమ తప్ప" అన్నాడు రామాంజనేయులు నవ్వుతూ. వెంటనే అలా అనటం తప్పనిపించింది. పోలీసులతో ఏది ఎంతవరకు మాట్లాడాలో అంతవరకే మాట్లాడాలని, చనువుకొద్దీ ఒక్క మాటకూడా ఎక్కువ మాట్లాడకూడదని రామాంజనేయులికి చాలాసార్లు అనుభవంలోకి వచ్చింది.

ఈమధ్య ఒక గ్రామంలో రెండువర్గాల మధ్య ఘర్షణలు జరిగినప్పుడు పోలీసులు రంగంలోకి దిగి లాఠీలతో వీర విహారం చేస్తుంటే 'అందరూ మనకి తెలిసిన పోలీసులే గదా' అనే ధీమాతో ఒక విలేఖరి ఫోటోలు తియ్యబోతుంటే అక్కడి సి.ఐ. కెమేరా లాక్కుని, ఫిలిం రీల్ లాగేసి నానా బీభత్సం చేశాడు. ఇంకోసారి ఒక రేప్‌కేసులో నిందితుడు ఎవరో తెలిసినా పోలీసులు పట్టించుకోవడం లేదని ఇంకో విలేఖరి రాస్తే ఈ డియస్పీయే అతన్ని పిలిచి నానా చీవాట్లు వేసి కలాన్ని కొంచెం హద్దుల్లో ఉంచుకో... లేకపోతే ఎన్‌కౌంటర్‌లో ఎగిరిపోతావ్ అని తీవ్రస్వరంతో మండిపడుతూ హెచ్చరించాడు. అలాంటి చేదు అనుభవాలు ఎదురైన విలేఖరులు ఎంతో మంది ఉన్నా తనకింకా బుద్ధి రాలేదు. తననితనే తిట్టుకున్నాడు రామాంజనేయులు.

"ఏం నీక్కూడా విప్లవజ్వరం అంటుకుందా? అన్నల్ని సమర్ధిస్తున్నావు?"

"నేనేం అన్నాను సార్...?" అడిగాడు రామాంజనేయులు గాభరాగా.

"నిషేధాలు విధిస్తే అన్నలు లేకుండా

పోతారా అన్నావుగా... వాళ్ళకి ఆశ్రయం ఇస్తున్నావా ఏమిటి?"

"నాకంత ధైర్యమే... ఏదో మీలాంటివాళ్ళ దయాదాక్షిణ్యాలమీద బతకడం తప్ప..."

"అదీ సరైనమాట... అలా మంచిగా ఒబీడియెంట్‌గా ఉండు''

"విలేఖరిని రెండుక్షణాల్లో ఎలా లొంగదీశానో చూశారా అన్నట్టు కానిస్టేబుల్స్ వైపు చూసి విజయగర్వంతో నవ్వాడు డి.యస్‌పి. దాంతో కానిస్టేబుళ్ళందరూ ఎందుకోగాని హెూరున నవ్వేశారు.

"యస్సర్... ఇక మేం వెళ్తాం" అన్నాడు రామాంజనేయులు, డియస్‌పి చూపు పరబ్రహ్మంమీద పడనందుకు, ఆరాలు తీయనందుకు సంతోషిస్తూ. పరబ్రహ్మం ఏం మాట్లాడనందుకు, నేనే పరబ్రహ్మాన్ని... హాస్యరచయితని, నక్సలైట్ల బారినించి తప్పించుకుని పారిపోయొచ్చానని ప్రకటించనందుకు సంతృప్తిపడ్డాడతను.

"ఆగాగు... తొందరపడితే ఎలా? ఇతనెవరు?"

అడిగాడు డియస్‌పి పరబ్రహ్మంవైపు గుచ్చిగుచ్చి చూస్తూ.

రామాంజనేయులు ఇరకాటంలో పడిపోయాడు. నిజం చెప్పాలావద్దా... నిజం చెబితే పరబ్రహ్మాన్ని ఇట్నించి ఇటే తీసుకెళ్తారు. నానా ప్రశ్నలేసి బాధపెట్టి అన్నల ఆచూకీ తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారు. చెప్పకపోతే ఇవాళకాకపోతే రేపైనా తెలుస్తుంది. కిడ్నాప్ చేయబడిన రచయితల్లో ఒకడు తప్పించుకుని నీ దగ్గరకొస్తే ఆ సంగతి చెప్పకుండా దాచిపెడతావా? నువ్వు నక్సలైట్లంటే పక్షపాతంతో వ్యవహరిస్తున్నావు. నీ సంగతి చూస్తాం అని హెచ్చరించరూ... ఏం చెయ్యాలేం చెయ్యాలేం చెయ్యాలి?

"నమస్తే సార్... నా పేరు పరబ్రహ్మం... హాస్యరచయితని''

"ఇక్కడేం చేస్తున్నావ్? ఆ గడ్డం, మాసిపోయిన బట్టలేవిటి? గిరిజన ప్రాంతాల్లో తిరిగి హాస్య నవల రాసేద్దావనా?"

"కాదు సార్... నన్ను, ఇంకో నలుగురు రచయితల్ని నక్సలైట్లు కిడ్నాప్‌చేశారు సార్... నేను తప్పించుకు పారిపోయొచ్చాను''

ఆ మాటతో డియస్పీ జీపు దిగాడు. ఆయన దిగిన వెంటనే వెనకసీట్లలో కూర్చున్న కానిస్టేబుళ్ళు కూడా దిగిపోయారు.

"నక్సలైట్లు కిడ్నాప్‌చేసిన ఐదుగురు రచయితల్లో నువ్వొకడివా?"

"యస్సర్..." అన్నాడు పరబ్రహ్మం. వీళ్ళు త్వరగా వదిలేస్తే బాగుండు. పట్నంవెళ్ళి శుభ్రంగా భోంచేసి రెండు గంటలు విశ్రాంతి తీసుకుందామనే ఆలోచనలో ఉన్నాడతను... అయితే అది జరిగేటట్టు కనిపించడంలేదు.

"తప్పించుకొచ్చావా?"

"యస్సర్..."

"నేనడిగేదాకా ఆ సంగతి చెప్పలేదేం?"

"పట్నం వెళ్ళి కాసేపు విశ్రాంతి తీసుకుని పోలీస్‌స్టేషన్‌కి వద్దామనుకుంటున్నాను..."

"ఇక్కడ మేం కనిపిస్తే ఆ సంగతి వెంటనే చెప్పాలా లేకపోతే తర్వాత తీరిగ్గా పోలీస్‌స్టేషన్‌కొచ్చి చెబుతావా? ఏవోయ్ రామాంజనేయులూ, ఇతను పరబ్రహ్మం అని నీకు తెలుసా లేదా?

"తెలుసు సార్'

"తెలిస్తే ఆ సంగతి ఇంతసేపు ఎందుకు చెప్పలేదు?"

"అతను ఉదయంనించి నడిచి నడిచి చాలా అలసిపోయాడు సార్... అందుకని మొదట భోజనం పెట్టించి..."

"షటప్... పోలీసులతో ఆటలాడుకు... ఇతనెవరో నీకు తెలుసు. ఎక్కడినించి వచ్చాడో తెలుసు. అతను కనిపించగానే వెంటబెట్టుకుని పోలీస్‌స్టేషన్‌కి రావాలి. దారిలో మేం కనిపించాం... వెంటనే ఆ సంగతి చెప్పాలా! లేకపోతే తర్వాత తీరిగ్గా చెబుతావా?"




"అసలు..."

"కీప్‌క్వయిట్... ఇన్‌ఫర్మేషన్ దాచిపెట్టావనే నేరం కింద నిన్ను అరెస్టు చెయ్యొచ్చు తెలుసా? ఇతని ఫోటో తీసి, ఇంటర్వ్యూచేసి పేపర్లో పెద్దక్షరాల్లో అచ్చేయించుకుని పేరు సంపాదిద్దామనుకున్నావా! టేక్కేర్... దిస్ ఈజ్‌ది ఫస్టండ్ లాస్ట్ వార్నింగ్... ఈసారి నీకు తెలిసిన సమాచారం దాచిపెట్టావని తెలిస్తే మాత్రం సహించను. నువ్వూ, మీ జర్నలిస్టుల యూనియన్, మీ ఎడిటర్ ఏం చేస్తారో చూస్తాను"

"జాడ తెలీని మనిషిగా మిగిలిపోతాడు సార్" అన్నాడో కానిస్టేబుల్ నవ్వుతూ. విలేఖరి రామాంజనేయులికి 'మిస్సింగ్' సినిమా గుర్తొచ్చింది.

"సారీ సర్..." అన్నాడతను మెల్లిగా.

"పోలీసులు సారీలు, గీరీలు వినరు. ఒక వేళ ఎవరు చెప్పినా అంత తేలిగ్గా క్షమించరు. అట్లా క్షమించేటట్లయితే మమ్మల్ని పోలీసులని ఎందుకంటారు? చూడు రామాంజనేయులూ... ఏదో మాకు తెలిసినవాడివని ఈసారికి వదిలేస్తున్నాం... ఇంకెప్పుడూ వెర్రి వేషాలు వెయ్యకు"

"యస్సర్..."

"పరబ్రహ్మంగారూ... మీరు జీపెక్కండి..."

"నేను పొద్దుటినించి చాలా దూరం నడిచి సంతకి చేరుకున్నాను సార్... ఆకలి మండిపోతోంది. కాళ్ళూ చేతులూ నా స్వాధీనంలో లేవు... ఒకటే నీరసం... అలసట"

"అన్నీ మేం పోగొడతాం... డోన్ట్‌వర్రీ... జీపెక్కండి"

పరబ్రహ్మం ఇంకేం ప్రశ్నించకుండా జీపెక్కాడు. రామాంజనేయులు మోటారు సైకిల్ స్టార్ట్ చేసి చెయ్యి ఊపాడు, వీడ్కోలు చెబుతున్నట్టు.

జీపు వెనక్కి తిరిగి మళ్ళీ పట్నంవైపు దూసుకుపోసాగింది. పరబ్రహ్మం చుట్టూ కూర్చుని ఉన్న పోలీసులవైపు, వెనక్కి వెళ్తున్న రోడ్డు, చెట్లవైపు చూస్తూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

డియస్పీ ఆలోచిస్తున్నాడు. పరబ్రహ్మాన్ని ప్రశ్నించి, కిడ్నాప్ చేసిన నక్సలైట్ల చెరనించి ఆ రచయితల్ని విడిపించగలిగితే తనకి యస్పీగా ప్రమోషన్ గారంటీ... నక్సలైట్లమీద అదో ఘనవిజయం సాధించినట్టవుతుంది. పైగా పబ్లిక్‌లో పేరు ప్రఖ్యాతులు మార్మోగిపోతాయి. ఆ ఆలోచనతో ఆయన పెదాలమీద విజయ దరహాసం మెరిసింది. దాంతో హుషారుగా సిగరెట్ ముట్టించాడు.

గంట తర్వాత జీపు పట్నంలో ప్రవేశించింది.

వారం రోజుల అనంతరం మనుషుల్ని, పట్నం హడావిడిని, ఇళ్ళని, వాహనాలని, భవనాలను, సినిమాపోస్టర్లని, హోర్డింగ్‌ల్ని చూసి చాలా ఆనందించాడు పరబ్రహ్మం. పోలీసు జీపు వెళ్ళి ఓ పెద్ద ఏసీ హోటల్ ముందు ఆగింది. అందరూ దిగి లోపలికి వెళ్ళారు.

పరబ్రహ్మం వాష్‌బేసిన్ దగ్గరకెళ్లి వారంరోజుల తర్వాత తన మొహాన్ని మొదటిసారి అద్దంలో పరిశీలనగా, ఆప్యాయంగా చూసుకుని శుభ్రంగా చేతులు కడుక్కుని భోజనశాలలోకి వెళ్ళాడు.

డి.యస్.పి, మిగతా కానిస్టేబుళ్ళు భోంచేయకుండా టీ తాగుతూ కూర్చున్నారు. పరబ్రహ్మం నిర్మొహమాటంగా కడుపునిండా తినేసి చెయ్యి కడుక్కున్నాడు.అందరూ బైటికి వచ్చారు. ఒక కానిస్టేబుల్ అతనికో కిళ్ళీ, సిగరెట్‌పెట్టె అందించాడు. పరబ్రహ్మం మహదానందంగా పాన్ వేసుకుని సిగరెట్ ముట్టించాడు. జీపు మళ్ళీ బైల్దేరింది.

పోలీస్‌స్టేషన్‌లో పరబ్రహ్మంకి కుర్చీ చూపించి, తనో కుర్చీలో కూర్చుని అడిగాడు డియస్పి.

"మీరు సంతకి ఎన్ని గంటలకి వచ్చారు?"

"కొంచెం అటూ ఇటూగా ఒంటిగంట అయ్యుండొచ్చు''

"నక్సలైట్లు మిమ్మల్ని దాచిపెట్టిన ప్రదేశంనించి సంతకి చేరడానికి ఎన్నిగంటలు పట్టింది?"

"సుమారు ఏడు గంటలు''

"మీరు నడిచొచ్చిన దారిని మీరు గుర్తుపట్టగలరా?"

"పట్టగలను''

"వెరీగుడ్... మిమ్మల్ని దాచిపెట్టిన ప్రదేశానికి దగ్గర్లో అంటే అడవికి దగ్గర్లో ఏ ఊళ్ళున్నయ్?"

"రెండుమూడు గూడేలున్నయ్‌గాని వాటి పేర్లు నాకు తెలీదు''

"నక్సలైట్లు మాట్లాడుకునే మాటల్నిబట్టి తెలీలేదూ?"

"వాళ్ళు గూడెం, గూడెం అనడం తప్ప పేర్లెప్పుడూ వాడలేదు''

"సరే... మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి... మళ్ళీ మాట్లాడుకుందాం"

పరబ్రహ్మం ఆనందంగా ఒక మూల ఉన్న బల్లని సరిగ్గా ఫ్యాన్ కిందికి లాక్కుని విశ్రమించాడు. పోలీసుల బూట్ల చప్పుళ్ళని, వైర్‌లెస్ బీప్ బీప్ శబ్దాల్ని, ముందురోడ్డుమీద వాహనాల హడావుడిని మరిచిపోయి. అలసట వల్ల అతనికి వెంటనే నిద్ర పట్టేసింది గాఢంగా.

అయితే అది తాత్కాలికమే. అతనలా నిద్రపోయాడో లేదో యస్.పి. వచ్చాడు. కానిస్టేబుల్ పరబ్రహ్మంని లేపాడు. అతను మత్తు కళ్ళతో యస్.పి.వైపు చూశాడు. పరబ్రహ్మం పరిస్థితి గమనించి యస్.పి. టీ తెప్పించాడు.

మళ్ళీ అదే కుర్చీలో కూర్చుని, అవే ప్రశ్నలకి, అవే సమాధానాలు చెప్పాడు పరబ్రహ్మం... ఇంటర్వ్యూ ముగిసింది.

"నేను కాసేపు నిద్రపోతాను''

"ఇంకేం నిద్ర... బయల్దేరండి''

"ఎక్కడికి సార్?"

"ఆ నక్సలైట్లు ఎక్కడున్నారో చూపించడానికి''

"వాళ్ళు బహుశా అక్కడ ఉండకపోవచ్చు''

"ఉండరని మాకూ తెలుసు... పొద్దుటినుంచి మహా అయితే ఐదారుమైళ్ళు నడిచి ఉంటారు. సరిగ్గా గాలిస్తే తేలిగ్గా దొరుకుతారు. ఇన్ని రోజులూ పోలీసులతో గేమ్ ఆడినందుకు గుణపాఠం చెబుతాం.

"యూమీన్ ఎన్‌కౌంటర్?"

"ఎగ్జాక్ట్లీ"

ఈ లోపు డియస్పీ అన్ని దినపత్రికల విలేఖరుల్ని పిలిపించాడు. వాళ్ళొచ్చి పరబ్రహ్మాన్ని రకరకాల ప్రశ్నలు వేశారు. అక్కడి జీవితం ఎలా ఉంది? భోజనం సరిగ్గా పెట్టారా? వాళ్ళ దగ్గర ఎన్ని తుపాకులున్నయ్? మందుగుండు సామగ్రి ఎంత ఉంది? మిమ్మల్ని విప్లవసాహిత్యం చదవమన్నారా? బాంబులు, గ్రెనేడ్లు, డిటనేటర్లు కనిపించాయా అంటూ?"

అన్నింటికీ ఓపిగ్గా జవాబులు చెప్పాడు పరబ్రహ్మం, విలేఖరులకంటే పోలీసులే నయమనిపించిందతనికి.

విలేఖరులు ఇంటర్వ్యూ ముగించి, పరబ్రహ్మం ఫోటోలు తీసుకుని థాంక్స్ చెప్పి వెళ్ళిపోయారు. ఒక పోలీస్ వ్యాను, రెండు జీపులు బయల్దేరాయి. ఒకదాంట్లో యస్పీ, ఇంకోదాంట్లో డియస్‌పి, సి.ఐ కూర్చున్నారు. వ్యాను నిండా పోలీసులు...

పరబ్రహ్మం యస్.పి. పక్కన కూర్చున్నాడు మౌనంగా. తార్రోడ్డు ఎర్రమట్టిరోడ్డు బళ్ళబాటల మీదుగా పోలీసువాహనాలు పరిగెడుతున్నయ్...

ఎన్‌కౌంటర్... ఉలిక్కిపడ్డాడు పరబ్రహ్మం.

రచయితల్ని కిడ్నాప్‌చేసిన నక్సలైట్లు ఎక్కడున్నారో వీళ్లు కనిపెడతారు. అన్నివైపుల నించి గాలింపు ప్రారంభించి కాల్పులు జరుపు





తారు. నక్సలైట్లమీద తనకేం ద్వేషభావంలేదు. అలాగే మిగతా రచయితలకి కూడా.

కాని పోలీసులు కాల్పులు ప్రారంభిస్తే నక్సలైట్లు ఊరుకోరు... వాళ్ళూ కాల్పులు జరుపుతారు.

ఈ క్రాస్ ఫైర్‌లో రచయితలకెవరికన్నా గాయలు తగలొచ్చు... తీరా గుళ్ళు సూటిగా దూసుకుపోతే చనిపోవచ్చు.

ఛీ...ఛీ... తను చాలా తప్పుడుపని చేశాడు. దిద్దుకోడానికి వీల్లేనంత తప్పు చేశాడు. ఎంతసేపూ తప్పించుకోవాలనే అనుకున్నాడు తప్ప ఇలాంటి ప్రమాదం జరిగే అవకాశం ఉందని ఊహించలేదు. ఏవైనా పొరపాటు జరిగి రచయితలు గాయపడటమో, చనిపోవడమో జరిగితే దానికి తనే బాధ్యత వహించాలి. అపరాధి తనే... తనే... తనే

ఛీ... ఛీ... తనకసలు బుర్రలేదు. ఉన్నా అది కథలు నవలలు రాసుకోవడానికి తప్ప దేనికీ ఉపయోగపడ్డంలేదు. తనంత పనికిమాలిన వెధవ ఎక్కడా లేడు. నక్సలైట్లు తననేం బాధపెట్టలేదు. బెదిరించలేదు, వేధించలేదు... తనెందుకు పారిపోయి వచ్చినట్టు? కేవలం ఎడ్వంచర్... తన ఎడ్వంచర్ ఇప్పుడు దారుణమైన ఫలితాలు ఇవ్వబోతోంది.

ఐయామె పర్‌ఫెక్ట్ రోగ్... మూర్ఖంగా తను చేసిన పనికి ఇప్పుడు ఫలితం అనుభవించాల్సిందే... తప్పించుకుని ఇంటికి వెళ్తే ప్రాణానికి హాయిగా, సుఖంగా ఉంటుందనుకోవడం భ్రమని తేలిపోయింది.

ఇప్పుడేం చెయ్యాలి?

ఏం లేదు... పోలీసులు దయతలిచి వదిలిపెట్టేవరకు ఇలా మౌనంగా బాధపడటం తప్ప చేయగలిగిందేమీ లేదు. దీనిమూలాన తీవ్రవాదులక్కూడా తను ఇబ్బంది తెచ్చిపెడుతున్నాడు. అనవసరంగా ఎన్‌కౌంటర్... కాల్పులు.

ఐయామ్ సారీ అన్నలూ, ఇయామ్ టెరిబ్లీ సారీ... అనుకున్నాడు పరబ్రహ్మం.

రెండు జీపులు, వ్యాను అలా ప్రయాణం చేసిచేసి బాగా చీకటిపడ్డాక ఒక గూడెం దగ్గరికి వెళ్లి ఆగాయి. అందరూ దిగి ఒక స్కూల్లోకి వెళ్ళారు. ఆ రాత్రి విశ్రాంతి కోసం.

మర్రాడు అన్ని దినపత్రికల్లో 'తప్పించుకున్న పరబ్రహ్మం' అనే వార్త వచ్చింది. అందులో పరబ్రహ్మం తప్పించుకుని సంతకి వచ్చినట్టు, అతన్ని డియస్పీయే చూసి కాపాడినట్టు వివరణాత్మకంగా ఉంది.

చివర్లో ఇది పోలీసులు సాధించిన ఘనవిజయం అని కూడా ఉంది.



ఎవరైనా వస్తారేమో, వచ్చి ఆదుకుంటారేమో, నడివీధిలో నగ్నంగా కూలబడ్డ కూతురిమీద తుండుగుడ్డో కండువాయో వేస్తారేమో అని ఆశగా ఎదురుచూసింది ఛాయ తల్లి.

అలాంటిదేం జరగలేదు.

ఎవరికి వాళ్ళు నిత్యనైమిత్తికంగా, నిర్లిప్తంగా, నిస్తేజంగా శిలావిగ్రహాల్లా ఉండిపోయారు! ఛాయ తల్లి మెల్లిగా లేచింది. జీవితంలో తను తిన్న ఎదురు దెబ్బలు, అనుభవించిన కష్టనష్టాలు, దుఃఖం, బాధ అన్నీ కూడా ఆవిడకి ఎందుకో ఒక్కసారి గుర్తొచ్చాయి.

వాటిలో ఇదొకటి... అంతే...

తను ఎన్నిసార్లు హితబోధచేసినా, నీతులు, సూక్తులు వినిపించినా వెనకడుగు వెయ్య

కుండా, పిరికితనం ప్రదర్శించకుండా, రాజీపడకుండా, అలా నడిసంద్రంలో తెరచాప ఎత్తిన పడవలా వెళ్తున్న కూతురిమీద ఆవిడకి ఒక్కసారిగా ప్రేమ ముంచుకొచ్చింది. ఆప్యాయత, గౌరవం ఆకాశమంత ఎత్తు పెరిగాయి.

నిరాశా నిస్పృహలు, నిస్సహాయతనుంచి ఒక్కోసారి మొండిధైర్యం ఆవరిస్తుంది మనిషిని. ఇక ఏది ఏమైనా, భూమ్యాకాశాలు తల్లకిందులైనా వెనక్కి తిరిగేది లేదని... ఎన్ని అపజయాలు కష్టనిష్ఠూరాలు ఎదురైనా ముందుకు మున్ముందుకే సాగిపోవాలనే కఠోర నిర్ణయాలు పుడతాయి.

ఛాయ తల్లికి కూడా హఠాత్తుగా ఆ మొండిధైర్యం వచ్చింది. కఠోర నిర్ణయానికి వచ్చింది. పిరికిపందల్లా పారిపోయి బతకడంకంటే ఇక్కడే ఉండి కాశీప్రసాద్‌మీద తిరుగుబాటు చెయ్యడమే మంచిదని అనిపించింది. తను ఇన్నాళ్ళు అణిగిమణిగి ఉండి, వినయ విధేయతలతో బతికి సాధించిందేవుంది? ఏం లేదు... అందువల్ల తిరుగుబాటు బాహుటా ఎగరేయడమే మంచిది.

ఉన్న ఊళ్ళో తమకి ఇన్ని రకాల అవమానాలు, వేధింపులు జరిగినా ఆదుకోవడానికి ఎవరూ రాలేదు. అయినా వాళ్ళని తిట్టుకోవడం అనవసరం... రావాల్సిన అవసరం వాళ్ళకి లేదు... తనూ తన కూతురే సొంతంగా, స్వతంత్రంగా నిలబడాలి... వడగళ్ళ వానలకు, వడగాల్పులకు భయపడకుండా.

నడివీధిలో వస్త్రాపహరణం జరిగితే ఎవరో ఒకరు అలనాడు శ్రీకృష్ణుడిలా వచ్చి ఆదుకుంటారనుకోవడం వట్టి భ్రమని తేలిపోయింది. ఆవిడకి తను అప్పుడప్పుడూ రేడియోలో వినే పాట గుర్తొచ్చింది. 'ఎవరో వస్తారని, ఏదో చేస్తారని, ఎదురు చూసి మోసపోకుమా' !

ఛాయ తల్లి తన చీరె సగం చించి కూతురి దగ్గరకెళ్లి మీద కప్పి ఆమెని నడిపించుకుంటూ ఇంటికి తీసుకెళ్ళింది.

ఇరుగుపొరుగు వాళ్ళెవరూ తొంగిచూడలేదు. వాళ్ళతో మాట్లాడితే ఏదో మహాప్రమాదం ముంచుకొస్తుందని ఇళ్ళలోనే ఉండిపోయారు.

లాంతరు వెలిగించి, గడపమీద పెట్టి ఇద్దరూ చెరో గోడకి ఆనుకుని అలాగే నిద్రలోకి జారిపోయారు.

ఆ రాత్రి గడిచింది.

మర్నాడు ఉదయాన్నే ఛాయతల్లి ఇస్త్రీ చేసిన చీరెకట్టుకుని, గుండ్రటి బొట్టుపెట్టుకుని, కొప్పువేసుకుని బైల్దేరింది. ఆవిడ మొహంలో కనిపిస్తున్న కాంతిని, ఆత్మవిశ్వాసాన్ని సంభ్రమాశ్చర్యాలతో చూస్తుండిపోయింది ఛాయ.

"ఎక్కడికి బైల్దేరావు?"

"పట్నం భవాని దగ్గరికి వెళ్తున్నాను''

"అడ్రసు తెలుసా?"

"అప్పుడెప్పుడో చెప్పావుగా... గుర్తుంది''

"సరే వెళ్ళిరా..." అంది ఛాయ...

"నువ్వు నారయ్య దగ్గరికెళ్ళి ఇల్లూ, పొలం అమ్మమని చెప్పిరా... అన్ని రకాల బాధలు, అవమానాలు అనుభవించాం... ఇంకా అనుభవించాల్సింది ఏం లేదు... ఉన్నా ఇక్కడుండే తేల్చుకుందాం... భయపడి పారిపోవడం అనవసరం... అన్నం వండాను తిను''

ఛాయ నవ్వింది ఆనందంగా... తల్లిలో ఇంతమార్పు హఠాత్తుగా ఎలా వచ్చిందో, ఎందుకు వచ్చిందో ఆమెకి అర్థంకాలేదుగాని, అలాంటి మార్పు వచ్చినందుకు మాత్రం మనసారా సంతోషించింది.

మధ్యాహ్నానికి భవాని, ప్రగతిశీల మహిళా మండలి సభ్యులు కొందరు నలుగురు పత్రికా విలేఖరులు వచ్చారు.

ఛాయని చూడగానే భవానికి దుఃఖం ముంచుకొచ్చింది. ఇద్దరూ ఒకరినొకరు పొదివి పట్టుకుని చాలా సేపు అలా ఉండిపోయారు కళ్ళంట నీళ్ళు రాలుస్తూ. ఆవిషాదంనుంచి ఛాయే ముందు తెప్పరిల్లింది.





"పశువుల కొట్టం దగ్ధం కేసులో నిన్ను అరెస్టు చేశారట" అంది ఛాయ

"చేశారు... అండర్ టేకింగ్ తీసుకుని వదిలేశారు. చెప్పింది భవాని

"తప్పుచేసింది వాడు. శిక్షలు అనుభవిస్తోంది మనం"

"డోన్ట్‌వర్రీ డియర్... మనకంటె ఇంకా బాధలు పడుతున్న వాళ్ళు చాలా మంది ఉన్నారు. ఈ ప్రజాస్వామ్యం వికృతస్వరూపం చూస్తున్నాం... వికార చేష్టల్ని అనుభవిస్తున్నాం"

"కాశీప్రసాద్‌ని ఎలా అడ్డగించాలో అర్థంకావడంలేదు''

"ఆలోచిద్దాం... నువ్వేం బాధపడకు'' భుజంమీద చెయ్యేసి అనునయంగా అంది భవాని.

ఛాయ పేలవంగా నవ్వింది.

"బాధలేమిటే భవానీ... ఒకరకమైన నిరామయ నిర్వికల్ప స్థితి సాధించేశాను''

"దానికోసమేనట... అప్పుడెప్పుడో శ్రీకృష్ణుడు గోపెమ్మల బట్టలు దాచేశాడని ఇప్పుడు మనవాళ్ళు భాష్యాలు చెబుతున్నారు''

అంత బాధలోనూ ఇద్దరికీ నవ్వొచ్చింది. ఆ మాటలు విని మహిళామండలి సభ్యురాళ్ళు కూడా నవ్వారు.

ఛాయని రకరకాల ప్రశ్నలు అడిగారు విలేకరులు. అన్నింటికీ ఓపిగ్గా జవాబులు చెప్పిందామె. విలేకరులు అన్నీ నోట్‌చేసుకుని రైటింగ్‌పాడ్స్ మూసేశారు.

"ఇపుడేం చేద్దామనుకుంటున్నారు?"

"కాశీప్రసాద్‌ని అరెస్టు చేయాలని డిమాండ్ చేస్తాం..." చెప్పిందో మహిళామండలి సభ్యురాలు.

"అదే... దానికోసం ఏంచేస్తారు?"

"రేపు పట్నంలో గాంధీబొమ్మదగ్గర్నించి ఎమ్మార్వో ఆఫీసువరకు ఊరేగింపు జరుపుతాం. కాశీప్రసాద్‌ని అరెస్టుచేసేవరకు ఊరుకోం"

"అలాగే చెయ్యండి. ఆల్‌ది బెస్ట్''

వెళ్ళిపోయారు విలేకరులు. ఆ రాత్రి భోజనాలు చేసి, ఇంటిముందు మంచాలు వేసుకుని కూర్చున్నారు ప్రగతిశీల మహిళామండలి సభ్యులు.

"వస్త్రాపహరణం జరిగినప్పుడు ఎంత మంది ఉన్నారక్కడ" అడిగింది ఒక సభ్యురాలు.

"చాలామంది ఉన్నారు'' చెప్పింది ఛాయ తల్లి.

"ఎక్కువమంది ఉన్నప్పుడు అవమానించడానికే ఆ టైమ్‌లో చేశాడు కాశీప్రసాద్'' అంది ఛాయ.

"వాళ్ళలో కోర్టుకొచ్చి సాక్ష్యం చెప్పేవాళ్ళు కావాలి''

"వాడంటే అసలే భయం. ఎవరూ రాకపోవచ్చు''

"లెట్స్ ట్రై..." అంది ఒకావిడ.

ముగ్గురు సభ్యులు, ఛాయ తల్లి కలిసి ఒకళ్ళింటికి వెళ్ళారు. వస్త్రాపహరణం జరిగినప్పుడు తాము అక్కడే ఉన్నామని అతి కష్టంమీద ఒప్పుకున్నారు వాళ్ళు.

"అయినా మేం కోర్టుకొచ్చి సాచ్చీకం చెప్పలేం... ఆడికి యెతిరేకంగా సాచ్చీకం చెబితే బతకనివ్వడు. ఏదో కలో గంజో తాగి సుఖంగా బతుకుతున్నాం. సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకోవడం ఎందుకు?"

"అదికాదండి... ఒక ఆడదానికి అన్యాయం జరిగిందికదా... మీరామాత్రం ఆదుకోలేరా?"

"ఎందుకూ లేనిపోని పెద్దమాటలు... ఆడూ మేమూ ఓక్కూళ్ళో ఉండేవాళ్ళం. ఈడనే ఉండాలికూడా. ఇవాళ తగుదునమ్మా అని ఆడిమీదికి ఎళ్తే ఠే పెట్టా... అయినా ఆడపిల్లలున్నోళ్ళం. మీరింకెవర్నయినా సూసుకోండి. మావల్ల కాదంటే కాదు'' అని వాళ్ళు నిష్కర్ష

గా, నిర్మొహమాటంగా చెప్పేశారు.

మహిళామండలి సభ్యులు ఏం అధైర్యపడ లేదు. వాళ్ళు ఇలాంటి సంఘటనలు చాలా చూశారు. చాలామంది ఇళ్ళకు వెళ్ళి మేం మీపక్కనే ఉంటాం భయపడకండని హామీ ఇచ్చి, మంచిగా మాట్లాడి నలుగుర్ని ఒప్పించ గలిగారు. అయితే వాళ్ళు చివరిదాకా అదేమా టమీద ఉంటారో లేదోననే అనుమానం ఒక వైపు పీకుతూనేఉన్నా, తమ పరిధిలో తమకు చేతనైనంతవరకకు చేయగలిగినందుకు సంతృప్తిగా ఇంటికి తిరిగొచ్చారు వాళ్ళు.

మర్నాడు అన్ని దినపత్రికల్లో ఆ సంఘటన గురించి వార్తలు వచ్చాయి.

'నడివీధిలో... నగ్నంగా...'

'బస్‌స్టాండ్‌లో వస్త్రాపహరణం...'

'రామచంద్రాపురంలో దుశ్శాసనప ర్వం...'

'పుడమితల్లి సిగ్గుపడుతోంది...'

ఇలా రకరకాల శీర్షికలతో ఛాయ ఫొటోలతో బాక్స్ వార్తలు వచ్చాయి. ఉదయం పదింటికి గాంధీబొమ్మ దగ్గర్నించి మహిళా ఊరేగింపు ప్రారంభమైంది. ఎమ్మార్వో మహిళామండలి ప్రతినిధులిచ్చిన వినతిపత్రం చదివి యస్.ఐ. రవిరాజాకి ఫోన్‌చేశాడు.

ఆ మర్నాడు అన్ని దినపత్రికల్లో కాళీప్ర సాద్ అరెస్టువార్త ప్రముఖంగా వచ్చింది. అలా దినపత్రికల్లో వచ్చిన తర్వాత కాళీప్రసాద్‌ని అరెస్టుచేయడం, తర్వాత మున్సిఫ్ మెజిస్ట్రేట్ కోర్టువారు బెయిల్ ఇవ్వడం జరిగిపోయాయి.

ఆయన జీపులో మహదానందంగా రామ చంద్రాపురం వచ్చి నేరుగా ఛాయ ఇంటి ముందు దిగాడు.

ఛాయ తల్లి బియ్యంలో రాళ్ళేరుతోంది. ఛాయ పుస్తకం చదువుతోంది. మధ్యాహ్నం ఎండ ఇంటివరండాలో ఎర్రగా పడుతోంది. ఆ వీధి నిర్మానుష్యంగా ఉంది. పక్కింట్లో రేడి యోలోంచి లలితగీతాలు వినిపిస్తున్నాయి.

కాళీప్రసాద్ గుమ్మంలోకి వచ్చాడు.

ఛాయ, ఆమె తల్లి లేచి ఇవతలికి వచ్చారు. ఆయన వాళ్ళిద్దరి మొహాల్లోకి పరిశీలనగా చూశాడుగాని భయంగాని, బెదురుగాని ఏమీ కనపించలేదు.

"ఏం ఛాయా... బాగున్నావా?"

ఆమె మాట్లాడలేదు, మళ్ళీ తనే అన్నాడు.

"ఆడాళ్ళని తీసుకొచ్చి హడావుడి చేశావు... బాగుంది... నన్ను, నా అంతటివాణ్ణి అరెస్టుచే యించావు. బాగుంది... కాని నువ్వు సాధించిందేంలేదు. నేను బెయిల్‌మీద విడుద లై వచ్చాను''

"మీరొస్తారని మేం ముందే ఊహించాంలెండి''

"భేష్... బాగుంది... ఇంకో రెండు నెల్లకో, మూడునెల్లకో ఈ వస్త్రాపరహణం కేసు కో ర్టులో విచారణకొస్తుంది. సాక్షులెవరూ ఉండ రు. మొదటి హియరింగ్‌లోనే కొట్టేస్తారు''

"అన్నీ మీరనుకున్నంత తేలిగ్గా జరగవు''

జరుగుతాయో లేదో నువ్వే చూడు. అవు నూ, కోర్టులో సాక్ష్యం చెప్పడానికి నలుగుర్ని ఒప్పించారుట. వాళ్ళు కోర్టుకి రారు. భ్రమల్లో ఉండకు ఛాయా... వాస్తవంలోకి రా..."

"ఏమిటా వాస్తవం?"

"నేను వాస్తవం... నువ్వు వాస్తవం... నీమీద నాకు మోజుందనే మాట వాస్తవం... దానికి ఒప్పుకుంటే నిన్ను అందలాలెక్కిస్తాన నే మాట వాస్తవం"

"నాకు మీ అందలాలు అక్కర్లేదు, ఆనందా లు అక్కర్లేదు''

"ఏదో పోనీలే అని వస్త్రాపహరణంతోనే సరిపెట్టాను. ఇంకా గొడవచేస్తే మానభంగమే. అన్నట్టు చెప్పడం మరిచాను. నాకు రివాల్వర్ లైసెన్సు ఉంది. ఈసారి ఏదన్నా జరిగితే సహించను, ఇద్దర్నీ లేపేస్తాను''

"మమ్మల్ని కాల్చేస్తారా?" అడిగింది ఛాయ తల్లి.




"అనుమానంగా ఉందా నీకు? ఇదుగో రివాల్వర్" అని జేబులోంచి సర్రున రివాల్వర్ తీసి ఛాయ ఛాతీవైపు గురిపెట్టి వికృతంగా నవ్వాడు కాళీప్రసాద్.

"ఏదీ చంపండి చూద్దాం" అంది ఛాయ కొంచెం ముందుకొచ్చి.

"అప్పుడే చంపేస్తే ఎలా? ఇంకొంచెం పనుంది"

"ఏమిటా పని?"

"నీ చేత నా కాళ్ళు పట్టించుకోవాలి. తర్వాత పడగ్గదిలోకి తీసుకెళ్ళాలి" అని ఆపి, నవ్వి "జాగర్తగా ఉండండి... వస్తాను" వెళ్ళిపోయాడు కాళీప్రసాద్.

మర్నాడు ఛాయవెళ్ళి ఈ విషయం భవానికి చెప్పింది. మళ్ళీ ఇద్దరూ మహిళామండలి కార్యాలయానికి వెళ్ళారు. వాళ్ళు విలేకరుల్ని పిలిచి కాళీప్రసాద్ గురించి చెప్పారు. ఆ మర్నాడు అన్ని దినపత్రికల్లో ఆ వార్త వచ్చింది.

దాంతోపాటు...

కాళీప్రసాద్ విషయంలో పోలీసులు పక్షపాత దృష్టితో వ్యవహరిస్తున్నారని, ముఖ్యంగా యస్.ఐ.రవిరాజా ఆయన్ని చూసీచూడనట్టు వదిలేస్తున్నాడని, బెయిల్‌మీద విడుదల చేయడంవల్ల కాళీప్రసాద్ సాక్ష్యాల్ని మాఫీ చేసే అవకాశం ఉందని, పశువులకొట్టం దగ్ధంకేసులో అరెస్టుచేసిన నరసింహాన్ని ఇప్పటికీ కోర్టులో హాజరుపరచలేదని పూసగుచ్చినట్టు రాశాయి.

దాంతో అధికార యంత్రాంగంలో కదలిక వచ్చింది. నరసింహాన్ని ఆరోజే పోలీసులు కోర్టులో హాజరుపరిచారు.

యస్.ఐ. రవిరాజాకి బదిలీ ఉత్తర్వు వచ్చింది, ఏజెన్సీ ఏరియాకి.

★ ★ ★

పోలీస్ వ్యాను, జీపులు ఆ చుట్టుపక్కల గూడేల్లో మూడురోజులు 'అన్నల'కోసం గాలించి చివరికి ఒక చిన్న గూడెం చేరుకున్నాయి.

అందులోంచి దిగిన పోలీసుల్ని చూడగానే గూడెంలోని ప్రజలందరూ ఇళ్ళల్లోకి వెళ్ళి తలుపులు వేసుకున్నారు. పోలీసు బీభత్సాలకు, దౌర్జన్యాలకు, జులుంకి, స్వైరవిహారానికి అలవాటుపడిన ప్రజలు వాళ్ళు కనిపించగానే దాక్కోవడం నేర్చుకున్నారు.

పదిమంది పోలీసులు ధాటీగా, ధీమాగా వెళ్ళి కనిపించినవాళ్ళనల్లా లాక్కొచ్చి దగ్గర్లో ఉన్న స్కూలు గదుల్లోకి నెట్టారు. మళ్ళీ వ్యాను, జీపులు బైల్దేరాయి. ఆ పక్కనున్న మూడు గూడేల్లో జనాన్ని కూడా అలాగే లాక్కొచ్చి గదుల్లో కుక్కారు.

చీకటిపడింది.

స్కూలు గదుల్లో లైట్లు వెలిగాయి.

అందర్నీ పదివరసల్లో నిలబెట్టి ముందు 'ఇంటరాగేట్' చేసి తర్వాత అడిగారు ప్రశ్నలు... వాళ్ళలో ఎవరూ ఏమీ చెప్పలేదు. నిశ్శబ్దంగా దెబ్బలు భరించడం, బూతులు సహించడం, నొప్పులకు తాళలేక అరవడం తప్ప.

చివరికో వృద్ధుడు అన్నాడు మెల్లిగా "అన్నలొచ్చిన్రు..."

"ఎప్పుడొచ్చిర్రా?"

"నాలుగు దినాలకిందట... సయ్యంకాలంపూట"

"వాళ్ళతోపాటు ఎవరన్నా ఉన్నారా?"

"ఉంద్రు... పట్నంవోళ్ళు... పాయింట్లు, జుబ్బాలు ఏస్కున్నరు"

"తర్వాత ఎక్కడికెళ్ళారు?"

"ఏడికెళ్తారు? జంగల్లోకి"

"ఎటువైపు వెళ్ళారు"

"ఎవనికి తెల్సుందొరా... మేం సూడలే"

ఇంకో ఇద్దరు కూడా సరిగ్గా అలాగే చెప్పడంతో పోలీసులు వాళ్ళని వదిలేశారు, మామూలుగానే 'లేపేస్తాం... దొంగలంజాకొడుకుల్లారా...' అని హెచ్చరికలు చేసి, పౌరధర్మా

లు, విధులు, బాధ్యతల గురించి వివరంగా చెప్పి...

పరబ్రహ్మం మౌనంగా ఆ హింసాకాండ అంతా చూశాడు. మూడు ముక్కల సమాచారంకోసం అంతమందిని తీసుకురావడం ఎందుకో, అలా బాదడం ఎందుకో, చిత్రహింసలు పెట్టడం ఎందుకో అతనికేం అర్ధంకాలేదు. ఈ అన్యాయంగురించి ప్రశ్నిద్దామనుకున్నాడుగాని తను అన్యాయమైపోతానేమోననే భయంతో ఆగిపోయాడు.

ఆరాత్రి భోజనాలు వచ్చాయి.

పోలీసు అధికారులు, పోలీసులు భోంచేసి ఆరుబైట విశ్రమించారు. పరబ్రహ్మం తనకి పెట్టింది తిని, వరండాలో ఓ మూల పడుకున్నాడుగాని ఈగలు దోమల రొదవల్ల నిద్రపట్టలేదు. పైగా మెదడులో ఆలోచనల విస్ఫోటనం... అతను గతంలో ఎన్నడూ జీవితాన్ని, జీవన పరిస్థితుల్ని అంత దగ్గరగా ఎప్పుడూ చూడలేదు. హాస్యం, బూతుజోకులు రాసుకోవడం, చీకటిపడీపడగానే మందుకొట్టడం మినహా జీవితంగురించి ఏమీ తెలీదు ఇప్పటివరకు.

సమాజంలో నిస్సహాయస్థితిలో ఉన్నవాళ్ళు చాలామంది ఉన్నారని, వాళ్ళకి ఎవరూ ఎప్పుడూ ఏ సహాయం అందించరని, ఆదుకోరని, ప్రభుత్వాలు, అధికారులు వాళ్ళని పట్టించుకోరని, అణగారిన ఆర్తుల హాహాకారాలు, జీవితంలోని, జీవనంలోని వ్యధను, దుఃఖాన్ని మౌనంగా భరిస్తూ రోజులు గడిపే వాళ్ళు ఎంతోమంది ఉన్నారని పరబ్రహ్మంకి అర్ధమైంది. దాంతో తను, తన జీవిత విధానం, తన రాతలమీద అతనికి అంతులేని అసంతృప్తి పుట్టింది.

తను చేసిన తప్పువల్లే ఇప్పుడు వీళ్ళందరూ అనవసరంగా చిత్రహింసలపాలయ్యారు. కాని ఆ సంగతి వాళ్ళకి తెలీదు.

తనంత నీచుడు, ధూర్తుడు ఎక్కడా ఉండడు.

తన పాపానికి నిష్కృతిలేదు.

రాత్రి షైమెంతైందోగాని పోలీసులు లేచారు. డ్రస్సులు సరిచేసుకున్నారు. తుపాకులు అందుకున్నారు. వ్యాను, జీపులు బయల్దేరాయి. ఒక్క యస్పీ, నలుగురు కానిస్టేబుళ్ళుమాత్రం మిగిలిపోయారు. పరబ్రహ్మం వాళ్లని చూశాడుగాని లేవలేదు. కళ్ళు తెరుచుకుని అలాగే ఉండిపోయాడు.

ఈశ్వరా, పరాత్పరా, భగవంతుడా, ఆపన్నరక్షకా! అడవుల్లో ఉన్న రచయితలకి, తీవ్రవాదులకి ఏ ఆపదారాకుండా కాపాడు స్వామీ కాపాడు... అనుకున్నాడు మనసులో.

దాంతో పరబ్రహ్మం కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

★ ★ ★

ఊరిమీద చీకటి దుప్పటి పరచివుంది.

ఊరంతా స్తబ్దంగా, నిశ్శబ్దంగా ఎవరో చిత్రకారుడు గీసిన పెయింటింగ్‌లా ఉంది.

చల్లని గాలి వీస్తోంది, మెల్లిగా.

వాళ్ళిద్దరూ నడుస్తున్నారు, ఉత్సాహంగా, తృప్తిగా.

ఒక ఇంటిముందాగి అటూ ఇటూ చూశారు. తర్వాత మెల్లిగా ముందుకెళ్ళి తలుపుతట్టారు.

"ఎవరు?" బిగ్గరగా అడిగింది ఛాయ.

వాళ్ళు జవాబు చెప్పకుండా మళ్ళీ తలుపు తట్టారు.

"ఎవరు?" మళ్ళీ అడిగింది.

వాళ్ళు మళ్ళీ తలుపు తట్టి ఊరుకున్నారు.

ఆమె మెల్లిగా, అనుమానంగా ఓరగా తలుపుతీసి చూసింది.

"ఎవరు మీరు?"

"అన్నలం..."

దాంతో ఛాయ పూర్తిగా తలుపు తీసింది. వాళ్ళు లోపలికి రాగానే వెంటనే వేసేసింది.

"జరిగిందేదో జరిగిపోయింది. మీరు నిశ్శబ్దంగా వెళ్ళిపోండి"





"ఎందుకూ వెళ్ళడం?"

"పశువుల కొట్టం దగ్గంకేసులో నరసింహా న్ని మొన్నీమధ్యనే కోర్టులో హాజరుపరిచారు. నాకోసం అతనన్ని చిత్రహింసలు భరించడం బాగాలేదు''

"అదిసరే... రోడ్డుమీద బట్టలూడదీసిన కాళీప్రసాద్‌ని కూడా క్షమిస్తున్నావా?"

"ప్రజాఉద్యమం నిర్మించి వాణ్ణి అరెస్టు చేయిస్తాను''

వాళ్ళు పెద్దగా నవ్వారు.

"దానికి చాలా టైం పడుతుంది. ఒకవేళ ఉద్యమం నిర్మించి కాళీప్రసాద్‌ని అరెస్టు చేయించినా మళ్ళీ బైటికి వస్తాడు. ఈసారి నిన్ను మానభంగం చేసి హత్యచేస్తాడు''

"ఒకవేళ అలా జరిగితే అప్పుడాలోచిద్దాం"

వాళ్ళు మళ్ళీ నవ్వారు.

"చచ్చిపోయాక ఇంకేం ఆలోచిస్తవ్?"

"అప్పటిసంగతి అప్పుడు చూసుకుందాం. జరగబోయేదాని గురించి ఊహించుకోవడం ఎందుకు?"

"పిచ్చిపిల్లా! జరగబోయే అన్యాయం జరక్కుండా చూసుకోవడమే ఉత్తమమార్గం. కాళీప్రసాద్‌ని నువ్వు, పోలీసులు, కోర్టులు ఆపలేరు. వాణ్ణి ఆపాలంటే ఒక్కటేమార్గం"

"ఖతంచర్యా?"

"అవును''

"దానివల్ల సమస్య పరిష్కారమవుతుందా?" అడిగింది ఛాయ.

"పోనీ క్షమిస్తే పరిష్కారమవుతుందా?"

"కాదు..."

"అందుకనే ఆణ్ణి ఏసేసినం అక్కా..."

"అంటే, అంటే..."

"నీకర్థమయ్యే భాషలో చెప్పాలంటే చంపేసినం. ఇప్పుడే... రివాల్వర్‌తో మూడుతూటాలు దూసుకుపోయినై. కిందపడి ఇక లేవలేదు బిడ్డ... అన్నట్టు నీకు రివాల్వర్ చూపించి బెదిరించాడుగదా... అందుకని... అదే రివాల్వర్‌తో లేపేసినం"

"తప్పు... అనవసరం"

వాళ్ళు మళ్ళీ పెద్దగా నవ్వారు.

"తప్పుగాదు... అనవసరంగాదు. రాముణ్ణి, కృష్ణుణ్ణి ఇవ్వాళ్టికి కూడా ఎందుకు పూజిస్తరో చెప్పక్కా''

"వాళ్ళు దేవుళ్ళు. రాముడు ఒక ఆదర్శంకోసం నిలబడ్డాడు. కృష్ణుడు దుష్టశిక్షణ చేయించాడు''

"కాదు... ఇద్దరూ స్త్రీ గౌరవం నిలబెట్టారు. రాముడు రావణుణ్ణి సంహరించి భార్యని తెచ్చుకున్నాడు. కృష్ణుడు నిండుసభలో వస్త్రాపహరణం జరుగుతావుంటే ద్రౌపదిని కాపాడిండు''

"అయినా... నాకెందుకో"

"ఇంకేం మాట్లాడద్దక్కా... అప్పుడా అన్న వచ్చిండు. ఇప్పుడీ అన్నలొచ్చిన్రు... ఏవంటవ్?"

"కాని..."

"వద్దు... ఇప్పుడు పోలీసులు నిన్ను హత్యకేసులో ఇరికిస్తరు. కనీసం ఐదేళ్ళు జైలుకి పంపిస్తరు. అందుకని ఆ ఘోరమైన యాతనకంటె మాతో వచ్చేయటం మంచిది''

"అజ్ఞాతంలోకా?" ఆశ్చర్యంగా అడిగింది ఛాయ.

"అవును... అదితప్ప మార్గంలేదు. ఇదుగో కాగితం... ఇందులో అడ్రసుంది. అక్కడికెళ్తే అన్నలొచ్చి తీసుకెళ్తారు''

"అడవుల్లోకా?"

"అవును''

"కాని..."

"నీ ధర్మసందేహాలు తీర్చడానికి ఇది సమయంకాదు, వ్యవధీ లేదు. బయల్దేరు అక్కా''

ఆమె ఆశ్చర్యంగా చూస్తూ ఏదో చెప్పబోయేంతలోనే వాళ్ళు తలుపు తీసుకుని బైటికి వెళ్ళిపోయారు.

ఛాయ సందేహాన్ని, సంశయాన్ని మనసు లోంచి తుడిచేసి, డబ్బు తీసుకుని, తన సంచీలో బట్టలు పెట్టుకుని, తల్లికాళ్ళకి నమస్కారంచేసి బైటికి వచ్చి చీకట్లో కలిసిపోయింది.

ఇంకా తెల్లారలేదు.

★ ★ ★

కానిస్టేబుళ్ళు స్కూలు వరండాలో నిలబడ్డారు స్తంభాల్లా కదలకుండా. లోపల యస్పీ ఒక కుర్చీని కిటికీ దగ్గరగా లాక్కుని కాళ్ళు గోడకి తన్నిపెట్టి చల్లని గాలి ఆస్వాదిస్తూ సిగరెట్టు ముట్టించుకున్నాడు. ఆయనకి నలభై అయిదేళ్ళు ఉండొచ్చు. తెల్లగా, పొడుగ్గా వున్నాడు. నేరాలు, రాజకీయాలు చూసి విసుగెత్తిపోయినవాడిలా ఉన్నాడు. అందుకే అప్పుడప్పుడూ క్లబ్బులు, సాంస్కృతిక సంఘాలు ఏర్పాటుచేసే సభలకి వెళ్ళి ఉపన్యాసాలు ఇస్తుంటాడు, ముఖ్యంగా యువతరంలో పెడ ధోరణులమీద...

ఏం మాట్లాడకుండా బొమ్మలా కూర్చుని తనని పరిశీలిస్తున్న పరబ్రహ్మంవైపు చూసి చిరునవ్వు నవ్వాడాయన.

"యువతీయువకులు తీవ్రవాదంలోకి వెళ్ళడానికి కారణం ఏమిటంటారు?" అడిగాడు యస్పీ.

పరబ్రహ్మం ఆయనవైపు చూశాడు తప్ప మాట్లాడలేదు.

"మిమ్మల్నే అడుగుతున్నాను"

"నాకీ విషయాలేం తెలీవుసార్. నేనాలోచించను. నేనో హాస్యరచయితని. కామెడీలు రాసుకోవడం మినహా ఇలాంటి పెద్దవ్యవహారాలజోలికి పోను"

"మీరు హాస్యరచయితే కావచ్చు. కామెడీలే రాసుకోవచ్చు. నాకేం అభ్యంతరంలేదు. కాని ఇలాంటి వ్యవహారాలేం తెలీవంటేమాత్రం నేను నమ్మను. కమాన్... చెప్పండి. ఏం భయపపడనక్కర్లేదు..." అన్నాడాయన.

యస్పీకి ఏదో ఒకటి మాట్లాడాలనే కోరిక ఉందని, తన వాదన ముఖ్యంగా పోలీసుల వైఖరి సమర్థించుకోవాలనే తపన ఉందని పరబ్రహ్మం గ్రహించాడు. దాంతో జాగర్తగా ఆచి తూచి మాట్లాడాలనే నిర్ణయానికి వచ్చాడు.

"చదువుకున్నా ఉద్యోగాలొస్తాయో, రావోననే భయం, ఆర్థిక ఇబ్బందులు..."

"అంటే... భవిష్యత్‌భయం... అభద్రతాభావం"

"యస్సార్... యుఆర్ రైట్" అన్నాడు పరబ్రహ్మం, ఆయనే అందుకున్నందుకు ఆనందంగా.

"అయితే అవన్నీ వ్యక్తిగత సమస్యలుగదా... దానికోసం ఆయుధం పట్టడం ఎందుకు?"

"అనవసరం సార్... అనవసరం... నేనసలు ఒప్పుకోను. ఈ విషయంలో నేను పోలీసుల్నే సమర్థిస్తాను"

"థాంక్స్‌ఎలాట్... అయితే మీరు నేను చెప్పేవన్నీ సమర్థించక్కర్లేదు. మీ అభిప్రాయాల్ని నిర్భయంగా చెప్పొచ్చు పరబ్రహ్మంగారూ"

"నాకు వేరే అభిప్రాయాలేం లేవుసార్. నాకు మార్క్సిజం తెలీదు, మావో రచనలూ తెలీదు"

"మీ మిత్రుల్లో మార్క్సిస్టులు ఎవరూ లేరా?"

"ఎవరూ లేరుసార్. నగరపక్షులు... అందరూ హాపీగోలకీగాళ్ళే"

"లేకపోయినా నక్సలిజంమీద, సాయుధ పోరాటంమీద మీకో అభిప్రాయం అంటూ ఉండాలికదా!"

"నాకేం అభిప్రాయాలు లేవు సార్... నన్ను నమ్మండి"

"ఉండాలి... ఉంటాయికూడా... నన్ను ఊరికే నమ్మమంటే ఎందుకు నమ్ముతాను...




కమాన్ మాన్, స్పీకవుట్ యువర్సెల్ఫ్''

పరబ్రహ్మం ఇబ్బందిగా కదిలాడు. తన అభిప్రాయం ఏం చెప్పకుండా అన్నింటికీ తందానతాన అంటే గొడవ వుండదు అనుకున్నాడుగాని పరిస్థితి అలా కనిపించడంలేదు. తన అభిప్రాయం చెప్పినా ముప్పే. చెప్పకపోయినా ముప్పులాగానే ఉంది.

"ఒక ముఖ్యమైన మిత్రుడున్నాడుసార్ నాకు. అతను వామపక్షవాది. అతను అప్పుడప్పుడు చెప్పే మాటలు, సూక్తులు చెప్పమంటే చెబుతాను''

"ఓకే... చెప్పండి''

"అయితే ఇవన్నీ అతని అభిప్రాయాలే... నావికాదు''

"చెప్పండి''

"ఐ రిపీట్ సర్... ఇవన్నీ నా అభిప్రాయాలు కాదు''

"అబ్బా చంపకండి గురూగారూ... కేవలం విప్లవాభిప్రాయాలున్నంతమాత్రాన మనుషుల్ని శిక్షించడం సాధ్యంకాదని సుప్రీంకోర్టు న్యాయమూర్తి ఒకాయన తీర్పుచెప్పాడు. అయినా మిమ్మల్నేం లాకప్లోకి తొయ్యం. జైల్లోకి నెట్టం. చెప్పండి సార్... ఏం మాట్లాడుకోకపోతే ఏంతోస్తుంది... చెప్పండి... ఉద్యోగం రాకపోవడం, ఆర్థిక ఇబ్బందులవల్లనే ఆయుధాలు పట్టారని అన్నారు. వాటి పరిష్కారానికి ఆయుధంపట్టి ఉపయోగం ఏమిటి?"

"మా మార్క్సిస్ట్ మిత్రుడు ఏంచెప్పాడంటేసార్, సమస్యల్లో వ్యక్తిగతమైనవి ఏమీ లేవు... అన్నీ సామాజికమైనవేనని''

"పోనీ, సామాజిక సమస్యే అనుకుందాం... ఆయుధాలు పట్టుకుని అడవుల్లోకి వెళ్తే పరిష్కారం అవుతుందా?"

"మరేం చెయ్యాలి?"

"శాంతియుతంగా, అహింసాత్మకంగా ఉద్యమాలు ప్రారంభించడమే. అదే సరైన పరిష్కారం"

"నిరాహార దీక్షలు, పికెటింగ్లు, ధర్నాలు, ఘెరావ్లు, రాస్తారోకోలవల్ల సమస్యలు పరిష్కారం కావడం లేదు సార్... అందుకే ఆయుధం పట్టారని మా మిత్రుడు చెప్పాడు''

"ఆయుధంతో ఏ సమస్య పరిష్కరించారు?" అడిగాడు యస్పీ ఉత్సాహంగా.

"ఏం లేదు''

"దేర్ యు ఆర్ పరబ్రహ్మంగారూ... అందువల్ల సాయుధపోరాటంవల్ల ఏం ఉపయోగం లేదని తేలిపోయింది. అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోవడంవల్ల ప్రయోజనం ఏవుంది. సమస్యకి పది రోజుల్లో పరిష్కారం దొరికినా పదేళ్ళ తర్వాత దొరికినా శాంతి మార్గమే సరైన పంథా''

"యస్సర్... ఐ అగ్రీ విత్ యూ..."

"నాకూ అదే కావాల్సింది... అదీగాక పరబ్రహ్మంగారూ... ప్రతిమనిషీ ఆధ్యాత్మిక చింతన అలవాటు చేసుకోవాలి''

"యస్సర్... నేను రోజూ పూజ చేస్తాను. గుళ్ళూ, గోపురాల కెళ్తాను. ఆంధ్రదేశంలో అన్ని పుణ్యక్షేత్రాలు తిరిగాను'' అన్నాడు పరబ్రహ్మం తను నిరపాయకరమైన జీవినని చెబుతూ.

"మీరీసోది కాదు చెప్పాల్సింది... అందరూ ఆధ్యాత్మిక జీవులు కావడం అనేది అసాధ్యమని చెప్పాలి'' అన్నాడు యస్పీ విసుగ్గా.

"యస్సర్... యు ఆర్ రైట్''

"అందరూ పరలోక చింతన పెంచుకుని స్వార్థం వదిలేస్తే ఇన్ని గొడవలు, ఘోరాలు ఎందుకు జరుగుతాయి?"

"యస్సర్... మనిషిలో స్వార్థంపోదు... పూర్తిగా పోవాల్సిన అవసరం కూడా లేదు. అదో ఇన్స్టింక్ట్''

"స్వార్థం మూలానే ఈ సమస్యలన్నీ

పుట్టాయ్. మనిషి స్వార్థాన్ని జయించాలి. ఆయుధాలు పట్టుకుని బెదిరిస్తే స్వార్థం నశించదు''

"యస్సర్... మనిషిని మంచి మాటలతో సంస్కరించాలి''

"ఇప్పుడు నక్సలైట్లున్నారనుకోండి. ఈ సంస్కరణలు, ఆధ్యాత్మిక చింతనలు వదిలేసి ఆయుధాలు పట్టుకుని సమాజాన్ని బాగుచేస్తామని బయల్దేరారు గాని వాళ్ళు సాధించిన విజయం అంటూ ఏమీ లేదు''

"యస్సర్..." అన్నాడు పరబ్రహ్మం.

యస్.పి. మాటలకు అడ్డు తగలకూడదనే దృఢనిర్ణయంవల్ల అలా ఊరుకున్నాడుగాని ఆయనతో మాట్లాడుతుంటే అతని మెదడులో చిన్నసైజు తుఫాను బయల్దేరింది.

మనుషులందర్నీ సంస్కరించడం కుదరదని, స్వార్థపరులు తమ స్వార్థం విడనాడి పరుల గురించి ఎట్టి పరిస్థితుల్లోనూ ఆలోచించరని చెబుదామనుకున్నాడు. మంచి మాటలవల్ల ఇంతవరకు ఒక్కడు కూడా మారలేదని, ఆధ్యాత్మిక చింతన, ప్రార్థనలు, పూజలవల్ల క్షణకాలం పవిత్ర భావన తప్ప అవి జీవన గమనాన్ని, మనస్తత్వాన్ని మార్చలేవని, శాసించలేవని చెబుదామనుకున్నాడు. తనకిన్ని మంచి మంచి ఆలోచనలు వచ్చినందుకు తనలోతనే ఆశ్చర్యపడ్డాడు పరబ్రహ్మం.

ఆసమయంలోనే...

అక్కడ... అడవుల్లో...

మారుమూల ఒకచోట 'ధన్'మంటూ తుపాకీ పేలింది.

దాంతో పక్షులు గోలగోలగా అరిచాయి.

కోతులు కిచకిచలాడుతూ ఆ చెట్టుమీంచి ఈ చెట్టుమీదికి, ఈ చెట్టుమీంచి ఆ చెట్టు మీదికి దూకాయి.

చిన్న జంతువులు అటూ ఇటూ పరిగెత్తాయి.





దానికి జవాబుగా సెంట్రీ డ్యూటీలో ఉన్న విప్లవకారుడు తను కూడా తుపాకీ పేల్చాడు.

ఈసారి మూడు పోలీసు తుపాకులు మూడువైపులనుంచి భయంకరమైన శబ్దంతో పేలాయి.

రచయితలు భయంతో బిగుసుకుపోయారు. వాళ్ళకి ఏం చెయ్యాలో తోచలేదు. పులకేశి క్షణాల్లో పరిస్థితి అంచనా వేశాడు. మూడువైపులనుంచి తుపాకులు పేలాయంటే పోలీసులు ఎక్కువ మంది ఉన్నారని అర్థమవుతూనే ఉంది. వాళ్ళ లక్ష్యం కిడ్నాప్ చేయబడిన రచయితల్ని విడిపించుకువెళ్ళడమేనని కూడా అర్థమవుతోంది. ఇప్పటివరకు ఎప్పుడూ పోలీసులు అలా విడిపించుకువెళ్ళలేదు కాబట్టి ఇప్పుడు చేయగలిగితే వాళ్లకో కీర్తికిరీటం అవుతుంది.

అందుకని కాల్పులు మానేసి తాము తప్పించుకుపోతే రచయితల్ని వాళ్ళే తీసుకుపోతారు. అదీగాక తమ సంఖ్యా బలం, ఆయుధబలం తక్కువగా ఉన్నప్పుడు కాల్పులు జరపడం అనవసరం, మూర్ఖత్వం అవుతుంది.

మూడువైపులా అడవి సమతలంగా ఉన్నా నాలుగోవైపు లోయ ఉంది. అది కీకారణ్యం... తాము అటువైపు వెళ్ళిపోతేనే క్షేమం. రచయితల్ని నేలమీద పడుకోమని చేత్తో ఆదేశించి తన వాళ్ళకి సైగచేశాడు, వెళ్ళి పోదాం పదమన్నట్టు. మెల్లిగా నలుగురూ రిట్రీట్ పొజిషన్‌లో కొచ్చారు.

అప్పుడు మళ్ళీ పోలీసు తుపాకులు గర్జించాయి, ఈసారి మరింత దగ్గరగా... కిడ్నాప్ చెరనుంచి బైటపడాలంటే ఇదే సువర్ణావకాశం... అనుకున్నాడు కిశోర్‌కుమార్... పోలీసులు కాల్పులు జరుపుతున్నారు, తీవ్రవాదులు తక్కువ సంఖ్యలో ఉన్నారు. తనూ మిగతా రచయితలు శవాల్లాగా నేలమీద పడుంటే చాలు... కాల్పులు ముగిశాక పోలీసులొచ్చి తీసుకెళ్తారు... గుడ్ బైటు అరణ్యవాసం...

నాగార్జున, గురుదేవ్ కూడా సరిగ్గా అదే ఆలోచనలో ఉన్నారు.

కిశోర్‌కుమార్ నేలమీద అలా పడుకునే మెల్లిగా అన్నాడు...

"మెదలకుండా పడుకోండి... పోలీసులు అడ్వాన్స్ అవుతారు. మనల్ని విడిపించుకువెళ్తారు''

అతనికి దగ్గర్లో బోర్లా పడుకున్న గురుదేవ్, నాగార్జున తలలూపారు. వివేకానంద కొంచెం దూరంలో ఉన్నాడు, చెట్లచాటున. దాంతో నాగార్జున మెల్లిగా లేచి మోకాళ్ళమీద వెళ్ళి అతని పక్కనే పడుకుని చెప్పాడు...

"వివేకానందగారూ... ఇదే మంచి ఛాన్సు... తీవ్రవాదులు పారిపోతారు. మనం హాయిగా పోలీసులతో వెళ్ళిపోవచ్చు''

వినేకానంద నవ్వాడు.

"ఏవిటీ నవ్వుతారు?"

"ఏం లేదు''

"గిరిజన జీవితాలు పరిశీలించినంతవరకు చాలు... ఈ తుపాకుల మోతలు ఎన్‌కౌంటర్ల మధ్య ప్రాణాలు బిగబట్టుకుని కూర్చోలేం... బతికుంటే బలుసాకు తినొచ్చు... ఏవంటారు?"

"ఏవంటాను, నిజమేనంటాను''

"సో... గెట్ రెడీ..."

"ఓకే'

ఇంతలో పులకేశి మెల్లిగా లేచి చెట్లచాటు నుంచి లోయవైపు కదలడం ప్రారంభించాడు. మిగతా ముగ్గురూ తుపాకులు పేలుస్తూ అటువైపు కదిలారు.

వివేకానంద లేచి తను కూడా లోయవైపు నడిచాడు.

నాగార్జున అతనివైపు ఆశ్చర్యంగా నమ్మలేనట్టు చూశాడు. "వివేకానందగారూ''

వివేకానంద ఒక్కక్షణం ఆగి, తలతిప్పి అతనివైపు చూసి నవ్వి లోయలోకి వెళ్ళిపోయాడు వడివడిగా.

పోలీసుల తుపాకులు మళ్ళీ పేలాయి.

ఈసారి తీవ్రవాదులవైపునుంచి జవాబురాలేదు. దాంతో పోలీసులు మెల్లిగా అడ్వాన్స్ అయ్యారు. వాళ్ళు దగ్గరకొచ్చేదాకా రచయితలు అలాగే నేలమీద బోర్లా పడుకుని ఉండిపోయారు.

పోలీసుల్ని చూడటంతో గురుదేవ్‌కి ఉత్సాహం, ఆనందం పొంగుకొచ్చాయి. అతను లేచి బట్టలకు అంటుకున్న మట్టి దులుపుకుని డియస్పీకి విష్‌చేశాడు. మిగతా ఇద్దరు కూడా లేచారు.

"మీ ముగ్గురూ రచయితలేనా?" అనుమానంగా అడిగాడు డియస్పీ రివాల్వర్ గురిపెట్టి... వాళ్ళ ముగ్గురి గుండెలు భయంతో గుబగుబలాడాయి. పోలీసులు ఏదో ఘనంగా ఆహ్వానించి, సాదరంగా తీసుకెళ్తారనుకుంటే ఇదేమిటి?

"యస్సర్... మేం రచయితలమే. వాళ్ళు మమ్మల్ని వదిలేసి పారిపోయారు''

"ఐసీ... ఒక్కోసారి నక్సలైట్లు ఇలా నమ్మించి మమ్మల్ని దగ్గరికి రప్పించి కాల్చేస్తారు. అందుకని అనుమానించాను. అవునూ, మొత్తం ఐదుగురు రచయితల్ని కదూ కిడ్నాప్ చేసింది''

"యస్సర్'

"పరబ్రహ్మం తప్పించుకొచ్చాడు. ఇంకా నలుగురుండాలి కదా... ముగ్గురే ఉన్నారేవిటి?"

"వివేకానంద వాళ్ళతో వెళ్ళిపోయాడు సార్..." అన్నాడు గురుదేవ్, మేం ముగ్గురం ఎంతో మంచి వాళ్ళం... అతనే దుర్మార్గుడన్నట్టు.

"ఐసీ..." అన్నాడు డియస్పీ సాలోచనగా...

చుట్టూ పోలీసులమధ్య ముగ్గురు రచయితలు అక్కడికి రెండు మైళ్ళదూరంలో రోడ్డు మీద ఉన్న వాహనాలవైపు నడవడం ప్రా

రంభించారు.

"థాంక్స్ ఎలాట్ సార్... వి ఆర్ గ్రేట్‌ఫుల్ టుయూ'' అన్నాడు గురుదేవ్ హుషారుగా. పోలీసులు రావడం, తమని విడిపించడం అతనికి ఎంతగానో నచ్చాయి. విప్లవకారులు ఒకపట్టాన తమని విడిచిపెట్టరనీ కనీసం ఓ ఏడాది అలాగే గిరిజన గ్రామాలు తిప్పి చూపించి, వాళ్ళు తినే తిండి తినిపించి మా పరిస్థితులు అర్థంచేసుకోండంటూ నానా బాధలు పెట్టేస్తారనీ ఊహించుకుని భయపడ్డాడు.

"దిసీజ్ అవర్ డ్యూటీ' అన్నాడు డియస్పీ!

"మేం ఇలా జరుగుతుందని అనుకోలేదు సార్... ఇక్కడే అణగారిపోవాల్సివస్తుందని భయపడ్డాం... యూనో సర్...వి అర్ నాట్ నక్సలైట్ సింపతైజర్స్''

"వెరీగుడ్'

"అసలు వాళ్ళెందుకు మమ్మల్ని కిడ్నాప్ చేశారో అర్థంకాలేదు సార్... అన్ని గ్రామాలూ తిప్పారు. మేం ఏం చెయ్యలేక, ఎదురు మాట్లాడితే కాల్చేస్తారనీ భయంతో ఊరుకున్నాం సార్'

"ఐసీ''

"మీరూ, నక్సలైట్లు అలా నాలుగైదు గంటలపాటు కాల్పులు జరుపుకుంటారు. మాకు తూటాలు తగిలి గారంటీగా చచ్చిపోతామని తెగ భయపడ్డాం సార్... కాని మీరు అద్భుతంగా టాకిల్ చేశారు''

"మరేమనుకున్నారు? మాతో వాళ్ళు ఫైటేం చేస్తారు, పారిపోవడం తప్ప..."

"యస్సర్... మా ప్రాణాలు కాపాడారు కాబట్టి మీకు రచయితల మీద చాలా గౌరవం ఉన్నట్టు అర్థమవుతోంది సార్'

"అఫ్‌కోర్స్... ఐ హావ్ గ్రేట్ రెస్పెక్ట్ ఫర్ దెమ్.

"నేను డిటెక్టివ్ నవలలు రాస్తుంటాను సార్... నా డిటెక్టివ్ పేరు మిస్టర్ మిసైల్... ఇక నించి వాణ్ణి తీసేసి మీ పేరు పెడతాను సార్... నా డిటెక్టివ్‌కి... యుహావ్ 'ఇన్‌స్పైర్డ్ మి ఎలాట్ సర్'

"థాంక్స్... ఇహ మాట్లాడకుండా నడవండి'' అన్నాడు డియస్పీ చిరాకుగా

★ ★ ★

అక్కడ...

ఏటవాలుగా ఉన్న లోయలో అడవి పలచబడింది. పరుగులాంటి నడకతో వెళ్తున్న పులకేశి ఫైరింగ్ రేంజ్‌నించి బైటపడ్డామని గ్రహించి, ఆగి, వెనక్కి చూశాడు.

మిగతా ముగ్గురూ వస్తున్నారు... వాళ్ళొచ్చేదాకా అక్కడే నిలబడి వాళ్ళతో కలిసి మళ్ళీ ముందుకు కదిలాడతను. అంతలో వెనకనించి ఓ పెద్ద కేక వినిపించింది.

"పులకేశిగారూ..."

నలుగురూ ఆగారు, అడవికి అడ్డంపడి పరిగెత్తుకు వస్తున్న వివేకానంద కనిపించాడు. వాళ్ళు అతనివైపు చూశారు ఆశ్చర్యంగా.

వివేకానంద దగ్గరకొచ్చి ఆయాసం, రొప్పు తగ్గేదాకా ఆగి, జేబులోంచి కర్చీఫ్ తీసి మొహం తుడుచుకుని అన్నాడు...

"నేనొచ్చేశాను''

"ఎందుకొచ్చారు? పోలీసులతో వెళ్తే హాయిగా మీ ఇంటిదగ్గర దించేవాళ్ళు కదా''

"మీతో కొంచెం పనుంది''

"ఏం పని?"

"ఇప్పుడు చెప్పను... పదండి వెళ్దాం"

మళ్ళీ ఐదుగురూ నడక ప్రారంభించారు అడవిలో...

★ ★ ★

రాత్రి రెండున్నర గంటలవేళ అన్నలిచ్చిన చీటి చేత్తో పట్టుకుని, భుజానికి ఓ గుడ్డ సంచీ వేసుకుని... రోడ్డుమీదికి వచ్చింది ఛాయ... ఓ లారీ దొరికింది అరగంట తర్వాత.

"యాడకెళ్ళాలి?" అడిగాడు క్లీనర్.

"పట్నానికి''

"ఎక్కు''




వాడు అమితానందంతో చెయ్యి అందించ బోయాడుగాని ఛాయ ఆసరా లేకుండానే ఎక్కే సింది. లారీ కదిలింది.

"ఇంత రాత్రేళ ప్రయాణం ఏమిటి?" అడిగాడు డ్రైవర్.

"అర్జెంట్ మానాన్నకి వంట్లో బాగాలేదు. పట్నం. ఆస్పత్రిలో చేర్పించాం"

లారీ కదిలింది. ఇరవై నిమిషాల తర్వాత ఛాయ చూపించిన ఆస్పత్రిముందు ఆపాడు డ్రైవర్. అబద్ధం చెప్పినందుకు అనుభవించాల్సిందే అనుకుంటూ దిగింది ఛాయ. సంచీలోంచి ఐదురూపాయలు తీసి ఇవ్వబోయింది గాని డ్రైవర్ తీసుకోలేదు.

"తీసుకోండి"

"వద్దులేమ్మా. ఉంచు"

ఛాయ నవ్వింది. డ్రైవర్ కూడా ఆనందంగా నవ్వి లాగించేశాడు. ఆమె చకచకా బస్‌స్టాండ్‌కి వెళ్లింది. ఐదున్నరకి ఫస్ట్ బస్ ఉంది. అక్కడే సిమెంట్ బెంచీమీద కూర్చుని, కాలక్షేపంచేసి ఆ బస్సు రాగానే ఎక్కేసింది. అందులో నూటఇరవై కిలోమీటర్లు ప్రయాణంచేసి ఇంకో బస్సుమారి ఈ మారుమూలపల్లె చేరుకుంది.

ఇంటి యజమాని పేరు పద్దయ్య. పొడుగ్గా, నల్లగా నెరిసిన గడ్డంతో ఉన్నాడు. ఆయన భార్య చీపురుపుల్లలా సన్నగా, పొట్టిగా ఉంది. చేతులకి మట్టిగాజులు, మెళ్లో రంగుమారిన పసుపుతాడు, అక్కడక్కడా కంతలుపడిన నూలుచీరె.

వాళ్ళు ఛాయని ఆప్యాయంగా ఆహ్వానించారు. పద్దయ్య ఆమె ఇచ్చిన కాగితాన్ని కళ్ళకి దగ్గరగా పెట్టుకుని చదివాడు.

ఛాయ స్నానం చేసొచ్చి బట్టలు మార్చుకుంది. ఈలోగా ఆవిడ మట్టిపొయ్యిమీద అన్నం వండింది. ఏదో పచ్చడి, నీళ్ళపులుసు, పల్చటి మజ్జిగతో భోంచేయడం పూర్తయింది.

"ఏం బిడ్డా, కడుపునిండినాదా?" అడిగిందావిడ ప్రేమగా. ఛాయ తలూపింది. ఆమెకి ఎందుకో పల్లెటూళ్లో ఒంటరిగా వదిలేసొచ్చిన తన తల్లి గుర్తొచ్చింది.

ఏం చేస్తుంటుందామె. తనిలా వెళ్లిపోయిన సంగతి ఇరుగుపొరుగు వాళ్ళకి చెప్పి ఏడుస్తుంటుందా? బాధని గుండెల్లోనే దాచుకుని ఊరుకుంటుందా? పట్నంవెళ్ళి భవాని దగ్గర తన గోడు వెళ్ళబోసుకుంటుందా?

"ఏం బిడ్డా మాట్లాడవ్?"

"బాగుంది భోజనం. మా ఇంట్లో మేం తినేది కూడా ఇదే"

"ఊకె గట్లంటవ్‌గని. మీరు జెర్రంత మంచిగనే బతుకుతరు మాకంటె"

"ఏంలేదు. నిజంగా మీలాగే ఉంటాం"

ముసలమ్మ నవ్వింది.

★ ★ ★

"ఏం బిడ్డా ఊకే ఆలోశన జేస్తుండవ్"

"ఏంలేదు"

"ఇదుగో శాయ జేసిన. షక్కర్‌లేదు. నీళ్ళపాలు. ఎట్లుంటదో ఏమో"

"పరవాలేదు" అంది ఛాయ టీ అందుకుంటూ. టీ ఎలా వున్నా ఆ ముసలమ్మ చూపించిన ఆప్యాయత, అనురాగం ముందు అదేం లెక్కలోదిగాదు. ఛాయ టీ తాగింది అమృతంలాగా.

ముసలమ్మ దీపం వెలిగించింది. ఛాయ బైటికి చూసింది. అప్పటిదాకా చీకటిపడినట్లు తను గమనించనందుకు నొచ్చుకుంటూ.

భోజనాలయ్యాయి.

ఛాయ వాళ్ల తెగిన నులకమంచంమీద పడుకుంది. ఒకరాత్రివేళ ముసలమ్మ ఆమెని లేపి గుసగుసగా చెప్పింది చెవిలో

"అన్నలొచ్చిన్రు"

ఛాయ లేచి పద్దయ్యకి, ముసలమ్మకి నమస్కారాలు చేసి అడుగుపెట్టింది, అడవుల్లోకి.

★ ★ ★



"కాళీప్రసాద్ దారుణహత్య"

అన్ని దినపత్రికల్లో ప్రముఖంగా వచ్చింది ఈ వార్త.

తీవ్రవాదులు ఆయన్ని హత్యచేశారని, వాళ్ళకోసం గాలిస్తున్నామని, ఒకవేళ వాళ్ళ ఆచూకీ తెలిస్తే తమకు తెలియచేయాలని పోలీసు అధికారులు విజ్ఞప్తి చేశారు. కాళీప్రసాద్‌కి శాస్త్రోక్తంగా, నిరాడంబరంగా అంత్యక్రియలు జరిగాయి. ఆయన తరపువాళ్లు ఛాయకోసం వెదికారుగాని ఆమె కనిపించకపోవడంతో అవకాశం కోసం ఎదురుచూస్తూ ఊరుకున్నారు. అక్కడ పట్నంలో పోలీసులు భవానిని అరెస్టుచేసి నాలుగ్గంటలు 'ఇంటరాగేట్'చేసి వదిలిపెట్టారు. ఛాయ అజ్ఞాతంలోకి వెళ్ళిందని, మరో మహిళా నక్సలైట్ తయారైందని పోలీసు అధికారులు ఒక నిర్ణయానికి వచ్చేసి ఆ సమాచారాన్ని ఏజెన్సీ ప్రాంతాలకి తెలియచేశారు.

అలాగే అన్ని దినపత్రికల్లో.

"కిడ్నాప్ చెరనుంచి రచయితలకు విముక్తి. పోలీసుల ఘనవిజయం"

"నక్సల్‌కి పోలీసు దెబ్బ"

అనే శీర్షికలతో పోలీస్ ఎన్‌కౌంటర్, ముగ్గురు రచయితల్ని విడిపించడం, డియస్పీ, రచయితల ఫొటోలు, అదేరోజు డియస్పీకి పోలీస్ పతకం ఇస్తామని ముఖ్యమంత్రి ప్రకటన, అన్నీ వచ్చాయి వార్తలుగా.

అదేరోజు సాయంత్రం గురుదేవ్ సిటీక్లబ్బు ఆడిటోరియంలో డియస్పీకి, ఎన్‌కౌంటర్‌లో పాల్గొని తమని కాపాడిన మిగతా పోలీసులకు సన్మానసభ ఏర్పాటుచేశాడు, ఆడిన మాట తప్పకుండా. ఆ సభకి యస్పీ, ఎసిపి కమిషనర్ నగరంలో ప్రముఖులు హాజరయ్యారు. టీవీ తెలుగువార్తల్లో కూడా చూపించారు, ఆ ముఖ్యమైన సంఘటనని

మర్నాడు.

ప్రెస్‌క్లబ్‌లో 'మీట్‌ది ప్రెస్' జరిగింది. నలుగురు రచయితలూ పాల్గొన్నారు.

మామూలుగానే సవాలక్ష ప్రశ్నలు అడిగాక చివరికో విలేఖరి ఈ ప్రశ్న వేశాడు.

"వివేకానంద మీతోపాటు ఎందుకు రాలేదు?"

"నేను రమ్మనే చెప్పానుగాని తర్వాత వస్తానని చెప్పి వాళ్ళతో వెళ్ళిపోయాడు" అన్నాడు నాగార్జున.

"ఎందుకు వెళ్ళాడు వాళ్ళతో?"

"కారణం చెప్పలేదు. నేనడగలేదు. అంత టైంలేదు నాకు"

మర్నాడు అన్ని దినపత్రికల్లో ప్రముఖంగా ఓ వార్త వచ్చింది. దాని శీర్షిక ఇది.

"వివేకానంద ఉద్దేశం ఏమిటి?"

★ ★ ★

"వివేకానందగారూ... మీ ఉద్దేశం ఏమిటి?" అడిగాడు పులకేశి.

ఈ రెండు రోజుల్లోనే అతను తీవ్రవాదులతో కలిసి చాలా దూరం నడిచాడు. అడవులు, గుట్టలు, చిన్న చిన్న గ్రామాలు దాటి మరో దట్టమైన అడవిలోకి ప్రవేశించారు. వివేకానంద వాళ్ళతో నడిచాడు. కాసేపు విశ్రమించి వంటపాత్రలు బైటికి తీశారు మిగతా నక్సలైట్లు. గంటలో వంట పూర్తయింది. భోజనాలయ్యాయి. ఇద్దరు వాటిని శుభ్రం చేయడానికి ఏటిగట్టుకి వెళ్లారు. ఒకతను సెంట్రీ డ్యూటీకి వెళ్ళాడు.

అప్పుడు తీరిగ్గా పులకేశి ఈ ప్రశ్న వేశాడు.

వివేకానంద రెండుక్షణాలు తటపటాయించాడు. దాంతో పులకేశి మళ్ళీ అన్నాడు.

"మీ తోటి రచయితలందరూ వెళ్ళిపోయారు. పోలీసులు మిమ్మల్ని విడిపించడానికే వచ్చారని మేం కూడా పెద్దగా ఎదురుదాడి చేయలేదు. మంచి అవకాశం వచ్చినా మీరెందుకు వెళ్లలేదు? మళ్ళీ మాతోపాటు ఎందుకొచ్చారు?"




"నేను మీ అగ్రనాయకులుతో మాట్లాడాలనుకుంటున్నాను"

"ఏం మాట్లాడతారు?"

"ఈ అజ్ఞాతవాసంవల్ల ఉపయోగంలేదు, బైటికి వచ్చేయండని చెబుదామనుకుంటున్నాను"

"వృధాప్రయాస" అన్నాడు పులకేశి నవ్వుతూ.

"ఎందుకని?"

"మా సిద్ధాంతం మాది, మా ఆచరణ మాది. మేం పొరపాట్లు చేయొచ్చు. తెలిసో, తెలీకనో అన్యాయాలూ చెయ్యొచ్చు. కాని ఈ మార్గంనించి తప్పుకోం. విడిచిపెట్టం. ఎట్టి పరిస్థితుల్లోనూ రాజీపడం"

"కాని నాకోసారి ప్రయత్నం చెయ్యాలని ఉంది"

"అనవసరం. మీరు మిగతా రచయితలతో కలిసి వెళ్ళలేదు కాబట్టి మా మీద సానుభూతి ఉన్నట్టు అర్థమవుతూనే ఉంది. థాంక్స్. దాన్నలాగే ఉంచుకుంటారో, వదిలేస్తారో మీ ఇష్టం"

"వదిలెయ్యను. డిసీజ్, మై వర్డ్ ఆఫ్ ఆనర్"

"థాంక్స్ ఎలాట్. కాని మమ్మల్ని ప్రభుత్వం చెప్పే జాతీయ జీవనస్రవంతిలోకి లాగాలని మాత్రం చూడకండి. దానివల్ల ఏం ఉపయోగం ఉండదు. అసలు జాతీయ జీవన స్రవంతి అంటే ఏవిటో తెలుసా మీకు?"

"చెప్పండి" అన్నాడు వివేకానంద ఆసక్తిగా.

"ఒరే నక్సలైట్ నా కొడకల్లారా! మీరా సాయుధపోరాటం ఆపేసి మేం ఇచ్చే ముష్టి తీసుకుని దేశంలోని మిగతా ఎనభైఎనిమిదికోట్ల మందిలాగానే ఇళ్ళూ, ఆస్తులూ, డబ్బూ పెంచుకునేందుకు తిప్పలు పడండ్రా నాయనలారా, అని చెప్పడం. ఒరీ విప్లవకారులూ... మీరు కూడా మిగతా బడుద్ధాయిల్లాగానే దోపిడీలు చేయండి, చేయించండని ఉద్బోధించడమే సర్కార్‌వారి ఉద్దేశం. ఒరే నక్సలైట్లూ ఆయుధాలు వదిలిపెట్టొచ్చి మా రాకాసినీడల్లో విషపుకోరల కౌగిట్లో, లంచాలు మింగుతూ, ఇస్తూ నిర్నిమిత్తంగా బతికెయ్యండ్రా అని బుజ్జగించడమే సర్కార్ వారి ఉద్దేశం. ఈ పద్ధతి ఇలాగే ఉంటుందిరా వెర్రినా నక్సలైట్లూ. ఈ చట్టాలు ఇలాగే ఉంటాయిరా పిచ్చినా నక్సలైట్లు. ఈ శాసనాలు ఇలాగే ఉంటయ్. ఈ అన్యాయాలు ఇలాగే ఉంటయ్. ఈ అక్రమాలు, ఈ అశ్లీలత, ఈ అసభ్యత, జులుం, శాడిజం, హింసాకాండ స్త్రీలమీద అత్యాచారాలు, మానభంగాలు, లాకప్‌డెత్‌లు, బోఫోర్స్‌లు, రాజకీయకుట్రలు, కుతంత్రాలు, పరమపద సోపాన క్రీడలు, విదేశీకంపెనీల స్వైరవిహారాలు, స్కామ్‌లు, సినిమాలు, పత్రికలు అన్నీ ఇలాగే ఉంటయ్‌రా ఉంటయ్. వీటన్నింటిని నువ్వు ఆమోదించి, మెచ్చుకుని, హృదయపూర్వకంగా కౌగిలించుకుని ఆహా... ఓహో అనుకుంటూ కాలక్షేపం చెయ్యాల్రా వెర్రినా కొడకా అని ధాటీగా చెప్పడమే ఏలినవారి ఉద్దేశం. వివేకానందగారూ ఇందులో దేన్నీ ఇలా అంగీకరించం. ఈ వ్యవస్థను మార్చడానికి, మనిషికీ మనిషికీ మధ్య పెరుగుతున్న గోడల్ని పడగొట్టడానికి; ప్రతి మనిషికీ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, కూడూ, గూడూ కల్పించడానికి ఈ పోరాటం ప్రారంభించాం. ఇది మా తుదిశ్వాస వరకు కొనసాగిస్తాం. ఇందులో రాజీపడే ప్రసక్తి లేదు. మీ రాయబారం అనవసరం"

వివేకానంద చాలాసేపు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు. మళ్ళీ పులకేశే అన్నాడు.

"మీరు కూడా వాళ్ళతో చేరిపోండి. లేనిపోని కష్టాలు కొనితెచ్చుకోకుండా ప్రభుత్వంవైపు చేరిపోతే సన్మానాలు, సత్కారాలు అవార్డులు, రివార్డులు, సినిమాఛాన్సులు, ధన సహాయాలు అందుకోవచ్చు. కాదు కూడదనుకుంటే మీ ఉద్యోగం చేసుకుంటూ, పెళ్ళాం పిల్లల్ని చూసుకుంటూ నిజాయితీగా, నీతిగా ధర్మబద్ధంగా రచనలు చెయ్యండి. మమ్మల్ని

ఏదో మార్చాలని, దారిమళ్లించాలని ప్రయత్నించడంవల్ల ఉపయోగం ఏం ఉండదు. కావాలంటే మిమ్మల్ని ఇవాళే పట్నంలో దించేస్తాం"

"నాకా ఉద్దేశం ఉంటే ఎప్పుడో వెళ్ళిపోయేవాణ్ణి పులకేశిగారు. పోనీ ఒక పనిచెయ్యండి''

"చెప్పండి. వీలుంటే చేస్తాను''

"నన్ను మీ అగ్రనాయకుడి దగ్గరికి తీసుకెళ్లండి. నేనాయనతో మాట్లాడుతాను''

"అగ్రనాయకులు చాలామంది ఉన్నారు. రీజనల్ కమిటీలున్నాయ్. ప్రొవెన్షియల్ కమిటీ ఉంది. జిల్లా కమిటీ నాయకులున్నారు. ఆర్గనైజర్లున్నారు. యాజిటేషన్ అండ్ ప్రాపగాండా కమిటీ ఉంది. సెంట్రల్ కమిటీ ఉంది. వీళ్ళలో ఏ కమిటీ నాయకుణ్ణి కలుసుకుంటారు?"

"నాకు ఈ కమిటీల గురించి ఏమీ తెలీదు. అందులో ఒక్కోదాంట్లో ఎంతమంది సభ్యులుంటారో తెలీదు. మీ సెంట్రల్ కమిటీ ప్రధాన కార్యదర్శిని కలుసుకోవాలి. ఆయనేకదా మీ అగ్రనాయకుడు''

"మీరాయన్ని కలుసుకోవడం అసాధ్యం"

"సాధ్యాసాధ్యాల గురించి ఆలోచించకుండా ఇన్నేళ్లనించి పోరాటం చేస్తున్న మీరు అసాధ్యం అనడం విచిత్రంగా ఉంది. మీ నిఘంటువులో ఆమాట లేదనుకుంటాను''

పులకేశి జవాబు చెప్పకుండా నవ్వాడు.

"ఏవిటీ మీ అనుమానం. నేను పోలీస్ ఏజెంట్ననా?"

"కాదు''

"ప్రయాసకు ఓర్చుకోలేనా?"

"కాదు''

"ఇంకేవిటి మీ అభ్యంతరం?"

"మీ రాయబారం అనవసరమని''

"అవసరమో, అనవసరమో తర్వాత తేలుతుంది. మీరు ముందే అనవసరమని తీర్మానించడం ఎందుకు?"

"ఎందుకోగాని మిమ్మల్ని ఆయన దగ్గరకి తీసుకెళ్ళడం నా కిష్టం లేదు''

"అయితే మీరు తీసుకెళ్ళేవరకు నేను భోంచెయ్యను''

"అంటే నిరాహారదీక్షా?"

"అవును''

"నక్సలైట్ల ముందు నిరాహారదీక్ష బాగుంది. భేషుగ్గా ఉంది''

"నిజంగానే చేస్తాను. పచ్చి మంచినీళ్ళు తప్ప ముట్టుకోను''

"సరే... చెయ్యండి. చూద్దాం"

ఆ రాత్రి నక్సలైట్లు వంటచేశారుగాని వివేకానంద భోంచేయలేదు. మర్నాడు ఉదయం అంతే. రాత్రికీ అంతే. అలాగే చెట్టుకింద పడుకుని ఉండిపోయాడు మౌనంగా. మూడోరోజు ఉదయం అడిగాడు పులకేశి.

"మీరు భోంచేయకపోవడం ఏం బాగాలేదు. కనీసం ఇవాళైనా తినండి''

"నేను తినను. ప్రభుత్వం మిమ్మల్ని బుజ్జగిస్తున్నట్టు నన్ను బుజ్జగించాలని చూడకండి''

"చూడండి వివేకానందగారూ. మీరు అన్నం తినకపోతే నీరసడిపోతారు. పొరపాటున ఏదన్నా జబ్బుచేస్తే దగ్గర్లో డాక్టర్ కూడా లేడు. అందుకని నా మాటవిని అన్నం తినండి ప్లీజ్"

"నేను తినను''

"ప్లీజ్... అన్నంమీద ప్రేమతో''

"నేను తినను. మీ డిమాండ్లు ఒప్పుకునేదాకా మీరెలా మంకుపట్టు పడతారో నేనూ అంతే''

"అంతేనా? సరే మీ ఇష్టం"

ఆరోజు కూడా నిరాహారంగానే గడిచిపోయింది. మర్నాడు మళ్ళీ అన్నాడు పులకేశి.

"నేనేదో తమాషాగా ఉన్నారనుకున్నాను. నిజంగానే మంకుపట్టు పట్టారు''

"నాక్కూడా చిత్తశుద్ధి ఉంది''

"సరే, మీ డిమాండు ఆమోదిస్తున్నాను.





నేను మిమ్మల్ని మా నాయకుని దగ్గరికి పంపిస్తాను. ఇక అన్నం తినండి''

మూడురోజుల తర్వాత భోంచేస్తూ అడిగాడు వివేకానంద.

"నా డిమాండ్‌కి ఎందుకు ఒప్పుకున్నారు? నేను అన్నం తినకపోతే మీకేం నష్టం లేదుగదా!"

"ఎందుకో బాగుండలేదు''

"యూ ఫెల్ట్ సమ్‌థింగ్ ఆడ్''

"యస్''

"అంటే, అదే మన తోటివాడు అన్నం తినకపోవడం ఏవిటీ అని మీకనిపించింది''

"అవును''

"గాంధీగారు నిరాహారదీక్ష చేస్తే దేశంలో కొన్ని లక్షలమంది భోంచేయ్యడం మానేసేవాళ్లుట. అంటే నిరాహారదీక్షవల్ల కూడా ఉపయోగం ఉందని తెలీడంలేదూ''

"ఏమో''అన్నాడు పులకేశి.

వివేకానంద కొంచెం గర్వంగా నవ్వాడు.

"పులకేశిగారూ! అంతరంగం అట్టడుగున అంతమందిమీ మానవులమే మరి అన్నాడు శ్రీశ్రీ. అంటే ప్రతి మనిషిలోనూ మానవతా సంబంధమైన తంత్రులుంటయ్. వాటిని సరిగ్గా శ్రుతి చేయగలిగితే చాలు ప్రతి మనిషీ ఒక ఆయుధమే. వేరే ఆయుధాలతో పనిలేదు.

"ఉట్టి ట్రాష్ మాట్లాడతున్నారు''

"కాదు ఇది వాస్తవం. యధార్థం. నేను నిరాహారదీక్ష చేస్తుంటే మీరు కూడా కొద్దో గొప్పో కరిగారు, బాధపడ్డారు. చివరికి నా డిమాండ్ అంగీకరించారు''

"అందుకని అన్ని సమస్యలూ నిరాహారదీక్షలతో పరిష్కరించొచ్చని చెబుతున్నారా? మీరు మా సానుభూతిపరులే గనుక మేం బాధపడ్డాం అందరూ అలా ఫీలవరు''

"ఈ శాంతియుత పద్ధతులన్నీ వదిలేసి ముందుగానే ఆయుధం పట్టడంవల్ల అవన్నీ మరుగునపడిపోతున్నయ్''

"స్వార్థం ఘనీభవించి తలకెక్కి వికృతనృత్యం చేస్తున్న కాలం ఇది. నీతులు లేవు, విలువలు లేవు. హిపోక్రసీ, ద్వంద్వనీతి రాజ్యమేలుతున్నకాలం. దోపిడీ దొంగల రాజ్యం. అందువల్ల ఇలాంటి పరిస్థితుల్లో మామూలు శాంతి పద్ధతులేం పనిచెయ్యవు. ఆయుధమే శరణ్యం. అదే ఏకైక మార్గం"

"మా మిత్రుడొకడు మార్క్సిజంవల్ల నెగిటివ్ థింకింగ్ పెరుగుతుందన్నాడు. ఆ థింకింగ్ పెరిగిపోవడంవల్లనే ఆయుధాలు పట్టుకుని సమాజాన్ని మార్చిపారేస్తామని అంటున్నారని అన్నాడు''

"మార్క్సిజంలో ఓనమాలు తెలీనివాళ్లు మాట్లాడే తప్పుడు మాటలవి. వాటిని మీలాంటి మేధావులు నమ్మి ప్రచారం చేస్తుంటారు. మార్క్సిజం అంటే సజీవ చైతన్య సిద్ధాంతమే. మహోత్కృష్టమైన మానవీయ వ్యవస్థను సృష్టించడానికి ఉపకరించే సాధనం. దానివల్ల నెగిటివ్ థింకింగ్ పెరగదు. మన ఆలోచనా పరిధి విస్తృతమవుతుంది. మనుషుల్ని, సమాజాన్ని ఈ వ్యవస్థని సరిగ్గా శాస్త్రీయంగా అర్థం చేసుకుంటాం. మీరలా తప్పుడు సూత్రీకరణలు నమ్మద్దు. మీరు స్వయంగా చదివి, ఆలోచించండి''

"కాని నిరాహారదీక్షలు..." అర్థోక్తిలో ఆపేశాడు వివేకానంద. పులకేశి పెద్దగా నవ్వాడు.

"ఇప్పుడు వాదన ఎందుగ్గాని మనం రేపు ఉదయాన్నే బయల్దేరుదాం... బీ హాపీ..." అన్నాడు పులకేశి చర్చను ముగిస్తూ.

వివేకానందకి శుభ్రంగా భోంచేసినా నీరసం ముంచుకొచ్చింది. పులకేశిలాంటి చిన్నదళ నాయకుణ్ణే తను ఒప్పించలేకపోతున్నాడు, ఇక కాకలుతీరిన వాళ్ళ నాయకుడిని తనేం ఒప్పిస్తాడు.

తనకి వాదనాపటిమ లేదా? లేక తన అభిప్రాయాన్ని గట్టిగా చెప్పలేకపోతున్నాడా?

లేకపోతే అంతరాంతరాల్లో ఎక్కడో సాయుధమార్గమే మంచిదని తనూ నమ్ముతున్నాడా?

చివరికి తన ప్రయత్నం కంఠశోషగానే మిగిలిపోతుందా?

ఏది ఎలా అయినాసరే, తన ప్రయత్నం మానకూడదు. వచ్చిన అవకాశం వీలైనంతవరకు సద్వినియోగం చేసుకోవాలి... అంతే...

మర్నాడు ఉదయం వాళ్ళు బయల్దేరారు.

★ ★ ★

పులకేశి కొంతదూరం వచ్చి వివేకానందని వేరేదళానికి అప్పగించి, చెప్పాల్సిన నాలుగు మాటలు చెప్పి అరుణాభివాదం చేసి వెళ్ళిపోయాడు. వివేకానంద, మిగతా ఇద్దరు విప్లవకారుల నడక మళ్ళీ మొదలైంది. తర్వాత కొంతదూరం లారీలో, ట్రాక్టర్‌లో, చివరికి ఎడ్లబండిమీద...

ఆ రాత్రి ఒక గ్రామం చేరుకున్నారు వాళ్ళు...

ఒకతను కొన్ని ఇళ్ళకు వెళ్ళి అన్నం, కూర, పులుసు తెచ్చాడు. భోజనాలయ్యాయి. అందరూ విశ్రమించారు. మర్నాడు ఉదయాన్నే లేచి కాలకృత్యాలు తీర్చుకుని మళ్ళీ బయల్దేరారు. అడవిలో ప్రవేశించాక అడిగాడు వివేకానంద

"ఇంకా ఎంతదూరం వెళ్ళాలి?"

"దగ్గరకొచ్చినం... నాలుగు మైళ్ళు ఎళ్తే చాలు'' అన్నాడొకతను.

"ఈ నడక... అడవుల్లో ప్రయాణం బోరుకొట్టిందా? మిమ్మల్ని కావాలంటే వెనక్కి పంపించేస్తాం... హాయిగా ఇంటికెళ్ళొచ్చు..."

"అబ్బే అదేంలేదు... పదండి... ఇంత దూరం వచ్చాక వెనక్కి వెళ్ళే ప్రసక్తిలేదు'' అన్నాడు వివేకానంద. వాళ్ళిద్దరూ అతని మొహంలో ప్రతిఫలిస్తున్న పట్టుదల చూసి చిరునవ్వు నవ్వారు.

మధ్యాహ్నం ఎండపెరిగింది.

నాలుక తడారిపోతోంది.

శరీరం అంతా చెమటలు... అలసట... నీరసం...

ఓ చెట్టుకింద విశ్రమించారు వాళ్ళు. దూరంగా ఎక్కడినుంచో ఓ పులి గాండ్రింపు వినిపించింది.

అంతలో...

"లాల్‌సలామ్'' అని వినిపించింది దగ్గరగా. వివేకానంద, మిగతా ఇద్దరు విప్లవకారులు లేచారు. వాళ్ళ మొహాలు వికసించాయి.

"లాల్‌సలాం"

చెట్లచాటునుంచి వేరేదళానికి చెందిన పన్నెండుమంది విప్లవకారులు ఇవతలికి వచ్చారు. చేతుల్లో తుపాకులు, భుజాలకు కిట్లు వేలాడుతున్నాయి. వారిలో ఇద్దరు ఆడవాళ్ళు... అందరూ డ్రస్‌లో వున్నారు.

"ఏందీ, ఇసేసాలు?" ఆ దళకమాండర్ అడిగాడు.

"అంతా మంచిగనే ఉన్నాది. నక్సలైట్లు లొంగిపోతే నిషేధం ఎత్తేస్తడంట హెూంమంత్రి... ఇన్నవా?"

"గాయన పగటికల కంటున్నడుగాని ఈసారెవురు?"

"వివేకానంద... రచయిత... కతల్, పుస్తకాల్ రాస్తడు''

దళకమాండర్ కొంచెం ముందుకొచ్చి కుడి చెయ్యి అందించాడు.

"ఏడికెళ్తున్నవ్‌భయ్?"

"మీ నాయకుడితో మాట్లాడటానికి..."

"ఏం మాట్లాడ్తవ్?"

"సిద్ధాంతపరంగా కొన్ని సందేహాలున్నయ్... వాటిగురించి మాట్లాడుత"

"బహుత్ అచ్ఛాకామ్‌హై... ఇగోసారూ... ఈళ్ళంతా మా దళంల సభ్యులు'' అని వాళ్ళందర్నీ పరిచయం చేసి చివరిగా "ఈ అక్క పేరు ఛాయ... కొత్తగ వచ్చినాది. మైదానంనించి'' చెప్పాడతను.

దళ సభ్యులందరూ చెట్లకింద విశ్రమించారు. అతనుకూడా వెళ్ళి ఓచోట కూర్చున్నాడు.

"హలో..."





"హలో..."

"మీ కథలు, నవలలు చదివాను. చాలా బాగా రాస్తారు. కిడ్నాప్ అయిన రచయితల్లో మీరూ ఒకరుకదూ!"

"అవును... అన్నట్టు మీరీమధ్యనేనా దళంలో చేరింది?"

"అవును''

"హౌఆర్యూ ఫీలింగ్ హియర్?" అడిగాడు వివేకానంద.

"ఫైన్..."

"మీరెందుకొచ్చారు... మీ సమస్యలే మిటి?"

ఛాయ టూకీగా చెప్పింది. వివేకానంద ఆమె చెప్పిందంతా శ్రద్ధగా విని అన్నాడు

"మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి''

"ఏమిటవి?"

"తర్వాత చెబుతాను''

"మళ్ళీ మనం కలుసుకోం వివేకానందగారూ! మేం గిరిజన గ్రామాలకు వెళ్తున్నాం. తునికాకు పోరాటానికి జనాన్ని సమాయత్తం చెయ్యడానికి. ఇక ఇప్పట్లో మనం కలుసుకోం... గుడ్‌బై''

"నో గుడ్‌బై సిస్టర్... మిమ్మల్ని నాతో తీసుకెళ్దామనుకుంటున్నాను. అఫ్‌కోర్స్ విత్ ది పర్మిషన్ ఆఫ్ యువర్ కమాండర్'

"ఏంది సారూ నాగురించి మాట్లాడుకుంటన్నరు?" అడిగాడు కమాండర్ దగ్గరికి వస్తూ.

"ఈమెని నాతోపాటు పంపిస్తారా?"

"దేనికి?"

"కొన్ని సంగతులు మాట్లాడాలి''

"ఏంటవి?"

"మార్క్సిస్ట్ తత్వశాస్త్రంమీద కొన్ని సందేహాలున్నాయ్. వాటిగురించి మాట్లాడాలి''

"ఆమాత్రందానికి అక్క రావటం ఎందుకు? ఈడే కూసోని మాట్లాడుకుంటే పోదూ?"

"కాదు... ఆమెని నాతో పంపండి... మేం రేపు ఉదయం మీ నాయకుడు సూర్యంగారిదగ్గరకెళ్తాం. ఛాయ రేపు, ఎల్లుండి నాతోపాటు ఉండి మీదగ్గరికి వచ్చేస్తుంది. దిసీజ్ ఎ ప్రామిస్''

"ఏం అక్కా ఎళ్తావా?"

"మీరు పంపిస్తానంటే వెళ్తా.."

"ఎళ్ళు..."

"కాసేపు విశ్రాంతి తీసుకుని వెళ్దాం... ఏమంటారు?" అడిగాడు వివేకానంద.

"ఓకే' అంది ఛాయ.

వాళ్ళు కూడా చెట్లకిందికి చేరారు. నలుగురు తీవ్రవాదులు పొయ్యిపెట్టి మంటరాజేసి వంట ప్రారంభించారు. మిగతావాళ్ళు పోరాటాలు, కాంపెయిన్లు, పోలీస్ కాంపులు, అణచివేత, ఎన్‌కౌంటర్ల గురించి మాట్లాడారు. వంట పూర్తయింది. అందరూ ఆవురావురంటూ తినేసి, పాత్రలు శుభ్రంచేసుకుని తుపాకులు, కిట్లు పట్టుకున్నారు.

"వస్తాం కామ్రేడ్స్... వస్తాం అక్కా'' దళ కమాండర్ చెప్పాడు. అందరూ లాల్‌సలామ్‌లు చెప్పుకుని విడిపోయారు.

ఆ రాత్రి ఒక కీకారణ్యంలో విశ్రమించిన తర్వాత వివేకానంద అడిగాడు, మెల్లిగా...

"కాశీప్రసాద్ హత్యకేసు మీమీద పడుతుందనే భయంతో దళంలో చేరారా?"

"అవును''

"అక్కడే ఉంటే ఏమయ్యేది?"

"నన్ను అరెస్టు చేసి జైలుకి పంపేవాళ్ళు. ఆ బాధ భరించలేం. అందుకే వచ్చేశాను''

"దీనివల్ల నీ సమస్య పరిష్కారమైందా?"

"అయిందనీ చెప్పలేను, కాలేదనీ చెప్పలేను. ఇదొక్కటే మంచిమార్గంలా కనిపించింది. అందుకే ఇంకేం ఆలోచించకుండా వచ్చేశాను. నేను తప్పుచేశానంటారా?"

"హండ్రెడ్‌పర్సెంట్...!"

"ఎలాగ?"

"సమస్యనుంచి తప్పించుకోడానికి ఇక్కడి కొచ్చారు. ఇది ఎస్కేపిజం"

"ఇంకేంచేస్తాను వివేకానందగారూ... వేరే మార్గం కనిపించలేదు''

"అక్కడే ఉండాలి. కాళీప్రసాద్ హత్యతో మీకు సంబంధం ఉన్నట్టు రుజువులేం లేవు. సాక్ష్యాధారాలన్నీ సమగ్రంగా నిర్దిష్టంగా ఉంటే తప్ప కోర్టు ఒప్పుకోదు. మీరు నిర్దోషిగా తేలిగ్గా బైటపడేవాళ్ళు''

"అవన్నీ బాగా డబ్బుండి ఖరీదైన లాయర్లను పెట్టుకోగలవారికే పరిమితం"

"వివేకానంద పెద్దగా నవ్వాడు.

"ఈ పంథా తప్పు ఛాయగారూ... దీనివల్ల మనం కోరుకున్న లక్ష్యాన్ని సాధించలేం. గమ్యాన్ని చేరుకోలేం. అసలు దీనిగురించి చర్చించడానికే నేను సూర్యంగారి దగ్గరికి వెళ్తున్నాను''

"సరే... ఇప్పుడు మనమధ్య చర్చ ఎందుకు? రేపు అక్కడే చర్చిద్దాం"

"ఓ.కే... గుడ్‌నైట్"

తెలతెల్లని ఆకాశంమీద చుక్కలు మిణుకు మిణుకుమంటున్నాయి. చెట్లు నిలబడే నిద్రపోతున్నాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది.

ఎవరో చెయ్యితిరిగిన చిత్రకారుడు గీస్తున్నట్టుగా ఆకాశంలో రంగులు చకచకా మారాయి.

తూర్పుదిక్కు తెల్లబడింది.

సూర్యబింబం పైకి రాసాగింది, మెల్లిగా...

★ ★ ★

చిన్న కుటీరంలాంటి ఇల్లు...

చుట్టూ పూలమొక్కలు, బోరింగ్ పంపు, అల్లంతదూరాన చెట్లు, కొండలు. ఒకవైపు కూరగాయల మొక్కలు. ఇంట్లో పేడతో అలికిన నేల... ఒక మంచం... నాలుగైదు దుప్పట్లు, రెండు చెక్కబీరువాలనిండా పుస్తకాలు...

అందులో సూర్యం ఉంటున్నాడు. విప్లవ సినిమాల్లో హీరోలాగా ఆయనకి గిరిజాల జుట్టూ, మిడిగుడ్లూ లేవు. సాదాసీదాగా మధ్య తరగతి గృహస్థులా ఉన్నాడు.

వివేకానందని, ఛాయని తీసుకొచ్చిన తీవ్ర వాదుల్ని చూసి ఆయన కుడిచెయ్యి పిడికిలి బిగించి ఎత్తి అరుణాభివాదం చెప్పాడు. ఆ ఇద్దరు తీవ్రవాదులు కొద్దిసేపు ఉండి వెళ్ళిపోయారు.

"ఈ పూటకి విశ్రాంతి తీసుకోండి. రేపు మాట్లాడుకుందాం" అన్నాడాయన.

సూర్యం స్వయంపాకం చేసుకుంటున్నాడని ఛాయ వెంటనే గ్రహించింది. వంటింట్లోకి వెళ్ళి చీరెకొంగు నడుంచుట్టూ బిగించి వంట పూర్తిచేసింది. ఆ ఇంట్లో ఏ ఆయుధాలూ కనిపించలేదు వివేకానందకి. దళ సభ్యుల దగ్గర తప్ప నాయకుల దగ్గర ఆయుధాలుండవని అనుకున్నాడు.

భోజనాలు అయ్యాక నేలమీద చాప పరుచుకుని పడుకుని మర్నాడు సూర్యంతో చర్చించాల్సిన అంశాల గురించి మననం చేసుకున్నాడు. అలా ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయాడు.



మర్నాడు ఉదయం సూర్యం అడిగాడు "మీరు నన్ను కలుసుకోవాలని ఎందుకనుకున్నారు?"

"మీతో కొన్ని విషయాల గురించి చర్చించాలి?"





"ఏంటా విషయాలు?"

సుదీర్ఘమైన చర్చ ప్రారంభంకాబోతోందని గ్రహించి ఛాయ వాళ్ళదగ్గరికి వచ్చి గోడకి ఆనుకుని కూర్చుంది.

"ఇన్నేళ్ళ సాయుధపోరాటంద్వారా మీరు సాధించిందేముంది?" అడిగాడు వివేకానంద.

"ఏం సాధించాలి?"

"అధికారం"

"మెల్లిగా సాధిస్తాం... 'బీ ప్రిపేర్డ్ ఫర్ ఎ థౌజండ్ ఇయర్స్ ఆఫ్ లా' అన్నాడు మావో. కొన్ని దశాబ్దాలపాటు పోరాటం నడిపితేగాని రాజ్యాధికారం రాదు''

"కొన్ని దశాబ్దాలపాటు కాదు సూర్యంగారూ! కొన్ని వేల సంవత్సరాలు నడిపినా ఈ భారతదేశంలో రాదు''

"రాకపోవచ్చునేమోగానీ పోరాటంమాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ ఆగదు'' అన్నాడు సూర్యం దృఢంగా.

"రాజ్యాధికారం సాధించడమే మీ లక్ష్యం... గమ్యం. దానికి సాయుధపోరాటం అవసరంలేదు. మీ గ్రూపుని రాజకీయ పార్టీగా మార్చండి. తమ్ముళ్ళని కలుపుకోండి. ఎన్నికల్లో గెలవండి. రాజ్యాధికారం మీదే''

"మేం ఎన్నికలకు వ్యతిరేకులం. ఈ సంగతి మీకు తెలియందికాదు. దొంగవోట్లతో, పోలింగ్ బూతుల స్వాధీనంతో, రిగ్గింగ్‌తో, డబ్బుతో, సారాతో నిర్వహించే ఈ ఎన్నికల మీద మాకు నమ్మకంలేదు, గౌరవంలేదు''

"ఎన్నికల నిర్వహణ సరిగ్గా లేదు సూర్యంగారూ! కాని ఎన్నికలే తప్పంటే ఎలా?"

"మేం తప్పే అంటున్నాం. ఆ మాటకే కట్టుబడి ఉన్నాం. ఆ కంపులో అడుగుపెట్టడం మాకిష్టంలేదు''

"అది కంపే... అది మురికి గుంటే. చాలా దుర్భరంగా ఉంది. ఒప్పుకుంటున్నాను. కాని ఇలా ప్రతివాళ్ళూ ఎన్నికల వ్యవస్థకి దూరమైపోతే అది అలాగే ఉంటుంది. దాన్ని మనం సంస్కరించుకోవాలి. అది తప్ప వేరేమార్గం లేదు''

"అవన్నీ ఉట్టిమాటలు! శేషన్ ఏదో సంస్కరించేద్దామని ఉబలాటపడుతున్నాడుగాని అదేం జరగదు. ఎన్నికల్లో గెలవాలంటే డబ్బు, సారా, రిగ్గింగ్ ఉండాల్సిందే. ఆయన ఐడెంటిటీ కార్డులు ఇద్దామని ప్రయత్నిస్తున్నాడుగాని ఈ దగుల్బాజీ రాజకీయ పార్టీలన్నింటికీ ఆ మూడూ కావాలి. ఆయన్ని త్వరలోనే ఇంటికి పంపిస్తారు... ఆ మురికి కూపాన్ని శుభ్రంచేయడం ఎవరివల్లా కాదు''

"అయితే మీరు ఇన్నేళ్ళనుంచి చెబుతున్నా గిరిజనులు వోటింగ్‌లో పాల్గొంటూనే ఉన్నారు. మీరు కూడా చూసీ చూడనట్టు పోతున్నారు''

"వాళ్ళ భ్రమలు పూర్తిగా పోలేదు. ఇదివరకు గ్రామాల్లోకి ఎమ్మెల్యేలు రాకుండా చేశాం. ఇప్పుడు ఆ నిబంధన సడలించాం"

"మరి అలాంటప్పుడు మీరే స్వయంగా ఎందుకు ఎన్నికల్లో పాల్గొనకూడదు''

"అది మా సిద్ధాంతానికి విరుద్ధం"

"పోనీ సాయుధపోరాటంద్వారా మీరు సాధించిందేముంది?"

"మళ్ళీ మొదటికొచ్చారు. తునికాకు సేకరణ ధర పెంచాం. ఎన్నో గ్రామాల్లో సంఘాలు పెట్టాం. అవినీతిని, అన్యాయాన్ని, అక్రమాల్ని, దౌర్జన్యాల్ని చాలావరకు అరికట్టాం... ఇది చాలదూ?"

"చేశారు నిజమే... కాని మీరు అధికారంలోకి వస్తే ఇలాంటివన్నీ అరగంటలో చెయ్యొచ్చు''

"అధికారంలోకి రావాలనే ఉద్దేశంతో మా తమ్ముళ్ళు నలభైఏళ్ళక్రితమే ఎన్నికల రంగంలోకి దిగారు. వాళ్ళు సాధించిందేముంది?"

"వాళ్ళు రెండురాష్ట్రాల్లో అధికారంలో ఉన్నారు. ఆ రాష్ట్రాల్ని స్వర్గంగా మార్చారని

నేను చెప్పనుగాని కొంతవరకు అభివృద్ధి చేశారు. ఏం చెయ్యకపోతే ఇన్నేళ్ళనుంచి అధికారంలో ఉండరు''

"పైపైన తప్పు మౌలికంగా వాళ్ళేం చెయ్య లేకపోతున్నారు వివేకానందగారూ! మేం మౌలికమైన మార్పుని కోరుతున్నవాళ్ళం. ఈ వ్యవస్థని కూకటివేళ్ళతో పెళ్ళగించి కొత్త వ్యవస్థని సృష్టించడమే మా లక్ష్యం. దీనికి ఐదేళ్ళు పట్టినా, యాభై సంవత్సరాలు పట్టినా వెనుకాడం. దీనికోసమే సాయుధపోరాటం నడుపుతున్నాం''

"కాని చాలామంది ప్రభుత్వానికి లొంగిపోతున్నారు, ప్రశాంత జీవితంలోకి అడుగు పెడుతున్నారు. పైగా సాయుధపోరాటం అనవసరమని పత్రికల్లో ప్రకటనలిస్తున్నారు. శాంతి, సహనశీలత, సామరస్యమే గొప్పవని చెబుతున్నారు''

సూర్యం పెద్దగా నవ్వాడు ఒక్కసారి. చాలా సేపు ఆలోచించి చివరికి ఇలా అన్నాడు

"ఇదో రైలుప్రయాణంలాంటిది వివేకానంద గారూ! ఎక్కేవాళ్ళు ఎక్కుతుంటారు. దిగేవాళ్ళు దిగుతుంటారు. దానిగురించి బాధపడటం దేనికి?"

ఈసారి వివేకానంద పెద్దగా నవ్వాడు.

"పోలిక బాగానేవుంది. రైలు ఎక్కడ బయలుదేరిందో తెలుసుగాని దీని గమ్యం ఏమిటో అర్థంకావడంలేదు. ఎక్కేవాళ్ళకంటే దిగేవాళ్ళు ఎక్కువవుతున్నారు. దీనికేం చెబుతారు?"

"దీని గమ్యం రాజ్యాధికారం. అదీ పోరాట మార్గంద్వారా. ఎవరు వెళ్ళినా, ఎన్నిరకాలుగా పత్రికా ప్రకటనలు ఇచ్చినా మాకేం నష్టంలేదు. విప్లవోద్యమం కొనసాగుతుంది. దానికోసం రక్తం ధారపోస్తాం''

"విప్లవం, విప్లవమని అంటున్నారుగాని విప్లవం ఎప్పుడో వచ్చేసింది'' అన్నాడు వివేకానంద నవ్వుతూ.

"ఎప్పుడొచ్చింది...'' అడిగాడు సూర్యం ఎగతాళిగా.

"పద్దెనిమిదొందల యాభైఏడునుంచి పందొమ్మిదివందల నలభై ఏడుదాకా సాగింది విప్లవోద్యమమే. దాని ఫలితంగానే స్వాతంత్ర్యం సిద్ధించింది. ఇప్పుడు మనం చెయ్యాల్సింది సంస్కరణే. విప్లవోద్యమం నడపడం కాదు''

"అది కేవలం అధికార మార్పిడీ. తెల్లదొరలు పోయి నల్లదొరలొచ్చారు. అంతే... అదే వ్యవస్థ, అదే పీడన, అదే దోపిడీ''

"ఇదే మంచి వ్యవస్థ సార్... దేశాన్ని కొన్ని నియోజకవర్గాలుగా విభజించి ఎన్నికలు నిర్వహిస్తారు. ప్రజాప్రతినిధులు ఎన్నికవుతారు. వాళ్ళు పరిపాలన సాగిస్తారు. ఇందులో అసంబద్ధత ఏమీలేదు''

"ఈ అసెంబ్లీలూ, ఈ పార్లమెంట్లూనా! ఆహా ఎంత భ్రమల్లో ఉన్నారు మీరు?"

"ఆ ప్రజాప్రతినిధులచేత మనం పనిచేయించాలి. ఎన్నికల్ని సంస్కరించుకోవాలి. అంతే! ఇదే మంచిపద్ధతి''

"సంస్కరణ మాకు నచ్చదు. ఈ వ్యవస్థను కూలదోయడమే మా లక్ష్యం''

"మీ లక్ష్యం నెరవేరదు. మీరా గమ్యం చేరుకోలేరు. నాలుగువేలమంది తీవ్రవాదులు వేలాదిమంది పోలీసులతో, లక్షలాదిమంది సైనికులతో ఏం పోరాడుతారు?"

"అయితే సాయుధపోరాటం తప్పంటారా?"

"తప్పో ఒప్పో అని చెప్పడానికి నేనెవణ్ణి? మీ పోరాటలక్ష్యం ప్రభుత్వాధికారమే. కాని అది ఆ మార్గంలో దక్కదు. హైదరాబాద్ వెళ్ళడానికి పదిదారులున్నాయి. అందులో ఏదో ఒకటే మంచిదని చెప్పడం మూర్ఖత్వం తప్ప మరేంకాదు. తుపాకీ గొట్టంద్వారానే రాజ్యాధికారం సాధించాలనే రూలేంలేదు. అది సాధించడానికి ఏమార్గం అనుసరించినా తప్పులేదు''

"అలా చూసినా మేం ఒకమార్గం ఎన్నుకు




న్నాం... తప్పేముంది?"

"ఇది తప్పుమార్గం. ఇది ఎక్కడికీ వెళ్ళదు. భూవిముక్తినుంచి ఏనాడో దారితప్పిపోయారు మీరు. మీరు పోలీసుల్ని చంపడం, వాళ్ళు మిమ్మల్ని చంపడంతోనే సరిపోతోంది. ఈ మందుపాతరలు తుపాకులవల్ల అసలు సమస్యలు మరుగున పడిపోతున్నాయ్. పోటీతత్వం పెరిగిపోతోంది. ఎవరు ఎంతమందిని చంపారనేదే ముఖ్యమైపోతోంది. అంతకన్నా నామాట విని సాయుధపోరాటానికి స్వస్తిచెప్పండి''

"అది సాధ్యంకాదు''

"అంటే విధ్వంసమే మీకిష్టమా?"

"విధ్వంసమా?"

"విధ్వంసం కాక మరేమిటి? రేపు సోషలిస్ట్ వ్యవస్థ వచ్చినా రైళ్ళూ, బస్సులూ కావాలి, మైక్రోవేవ్ స్టేషన్లూ కావాలి. బాంకులూ కావాలి. వాటిని తగలబెట్టుకుని ఉపయోగం ఏమిటి?"

"అవి ఒప్పుకుంటున్నాను. కొన్ని రిజర్వేషన్స్‌తో..."

"థాంక్యూ! అలాగే కిడ్నాప్‌లు తప్పు. భూస్వాముల్ని చంపడం తప్పు. మీరు చేస్తున్నవన్నీ ఇవేగా''

"భూస్వాముల్ని చంపడంలో తప్పేముంది?"

"వాళ్ళని చంపడంవల్ల వాళ్ళ భూములు పేదవాళ్ళకి దక్కుతున్నయ్యా?"

"లేదు''

"అందుకే అది తప్పు''

"దీనికేం చెయ్యాలి''

"ఎన్నికల రంగంలోకి దిగాలి. అధికారంలోకి వస్తే భూసంస్కరణలు అమలు చెయ్యొచ్చు. నా మాట విని జనజీవనంలోకి రండి''

"మీ రాయబారం వృథాప్రయాస... వివేకానందగారూ''

"సోషలిస్ట్ వ్యవస్థకావాలిగదూ మీకు?"

"అవును, ముమ్మాటికీ''

"అది కేవలం ఆదర్శం మాత్రమే. అంత సమున్నతమైన, ఉదాత్తమైన వ్యవస్థని మానవుడు సృష్టించుకోలేడు. దీనికి్కారణం మనిషిలోని అల్పత్వం"

"అల్పత్వాన్ని సంస్కరించుకోవచ్చు''

"అది అసాధ్యమని సోషలిస్ట్ దేశాల్లో రుజువైపోయింది. మానవ స్వభావాన్ని మీరు సరిగా అంచనా వేయడంలేదు. విశ్లేషించడంలేదు. మనుషులు మట్టిముద్దలు, ప్లాస్టిక్ బొమ్మలు కాదు సూర్యంగారూ, జీవశక్తి ఉన్న చైతన్యవంతులు. మీరు మనుషులందర్నీ పప్పుసుద్దల్లా పరిగణిస్తున్నారు''

"సమాజంమీద ప్రయోగం చేస్తాం తప్పేం ఉంది?"

"ప్రయోగాలు చెయ్యడానికి ఇదేం లేబరేటరీ కాదు సార్... సమాజం... మనుషులందరూ నిజమైన సాధువులు, సన్యాసులు అయితే తప్ప సోషలిస్ట్ వ్యవస్థ నిలవదు. అదీగాక మార్క్సిస్టులు మూడు ముఖ్యమైన కీలకాంశాల్ని పరిగణనలోకి తీసుకోవడంలేదు''

"ఏమిటవి?"

"మొదటిది... ప్రతి మనిషికీ సెన్స్ ఆఫ్ ఎఛీవ్‌మెంట్ ఉంటుంది. అంటే తను సొంతంగా ఏదో ఒకటి సాధించాలనే తపన. ఇది సహజత్వం, ఇన్‌స్టింక్ట్. కవులు, రచయితలు, కళాకారులు, శాస్త్రవేత్తలు తమ రంగాల్లో ఏదో కళాసృష్టి చేసి, కొత్త విషయాలు కనుక్కొని తృప్తిపడతారు. కాని మిగతా కోట్లాది మంది మాటేమిటి? వాళ్ళకీ రూపాయని పది రూపాయలు చేసుకోవాలనే ఉంటుంది. ఇళ్ళూ, భవనాలు కట్టుకోవాలనే ఉంటుంది. ఆస్తులు పెంచుకోవాలనే ఉంటుంది. ఇది ప్రతి మనిషిలోనూ ఉండే ప్రగాఢమైన వాంఛ... దీన్ని మార్క్సిజం అసలు పట్టించుకోలేదు''

"రెండోది ఏవిటి?"

"రెండోది... ప్రతి మనిషికీ విడివిడిగా గుర్తింపు కావాలి. ఐడెంటిటీ క్రైసిస్. వీధి రౌడీ కూడా తనంటే రెండు మూడు వీధుల్లో జనం భయపడుతున్నారని ఆనందిస్తాడు. మార్క్సిజం దీన్ని గుర్తించలేదు. మనుషులందర్నీ మట్టిముద్దల్లాగానే చూస్తుంది''

"సరే! మూడోది''

"ఇల్లు ఇచ్చాం... ఉద్యోగం ఇచ్చాం... సౌకర్యాలు సమకూర్చాం... ఇక హాయిగా కదలకుండా కూర్చోండి అంటే మనుషులు అలా ఉండరు. విధ్వంసమో, అభివృద్ధో తను స్వయంగా చేసుకోవాలనే ప్రగాఢవాంఛ ఉంటుంది వారికి. అందుకని ఆస్తి హక్కు రద్దు తప్పు''

"అది రద్దుచెయ్యకపోతే అసమానత్వం పెరిగిపోదూ''

"అసమానత్వాన్ని పూర్తిగా తొలగించలేం సూర్యంగారూ! అది కేవలం ఓ మహోదాత్తమైన ఆదర్శం మాత్రమే. ఆచరణలో అది సాధ్యంకాదు. దానిక్కారణం ఇందాకే చెప్పాను. మనిషిలో జన్మతో వచ్చే అల్పత్వం''

"బాగుంది మీ ఫిలాసఫీ... ఇంకేం చెప్పదల్చుకున్నారు?"

"తూర్పు యూరప్‌లో, రష్యాలో, చైనాలో ఉన్నవి సోషలిస్ట్ వ్యవస్థలే గదా... అవి ఎందుకు పతనమయ్యాయో చెప్పండి''

"రష్యాలో నాయకులు తప్పు చేస్తున్నారని మేం ముప్ఫై ఏళ్ళక్రితమే చెప్పాం... అదే ఇప్పుడు రుజువైంది''

"కాదు, మానవస్వభావంవల్ల అతనిలోని అల్పత్వంవల్లనే అలా జరిగింది. దీన్ని మార్క్సిస్టులు ఒప్పుకోరనుకోండి. అయినా ఇది నికార్సయిన నిజం. పైగా మనిషిలో చైతన్యస్థాయి ఎప్పుడూ ఒకేరకంగా ఉండదు. విప్లవకాలంలో ఉండే చైతన్యం క్రమేణా తగ్గుతుంది''

"మానవస్వభావం అంటూ విడిగా ఏంలేదు వివేకానందగారూ! సోషలిస్ట్ వ్యవస్థని పటిష్టం చేసుకున్నకొద్దీ ఈ అల్పత్వాలు, క్షుద్రత్వాలు అవే పోతాయి.

"పోవు... అది అసాధ్యమైన విషయం. అందుకని సోషలిస్ట్ వ్యవస్థకోసం కలలు కనడంకంటే ఇప్పుడున్న వ్యవస్థనే సంస్కరించుకోవడం మంచిది''

"మేం మీతో ఏకీభవించం''

"అంటే సాయుధ పోరాటం విరమించమనేగా మీ ఉద్దేశం...?"

"అవును''

"అయితే అజ్ఞాతవాసంలోనే ఉండిపోతారా?"

"అవును... మీ నిజాయితీ, చిత్తశుద్ధి, ఆర్తి నాకు నచ్చాయి వివేకానందగారూ. కాని మీ రాయభారం వృధా''

"అది సరైన పంథా కాదు సూర్యంగారూ... జీవితం ఆనందంకోసం సుఖసంతోషాలకోసం. జీవితం కావాలని కష్టాలు పడటానికి, అనవసరమైన త్యాగాలు చేయడానికి కాదు. అజ్ఞాతవాసంలో ఉంటూ కష్టాలు పడటం అనవసరం. తుపాకీవల్ల ప్రయోజనంలేదు. మనిషే ఆయుధం... వేరే ఆయుధాలెందుకు. అజ్ఞాతంలో తెలీని ఆశలతో, సాధ్యంకాని అశయాలతో బతకడం అనవసరం. భార్యా బిడ్డలకి దూరంగా ఏ సుఖంలేకుండా జీవితం గడిపి ఉపయోగం ఏమిటి? జీవితంలో చాలా ముఖ్యమైన అంశాల్ని మీరసలు పరిగణలోకి తీసుకోవటంలేదు''

"సాయుధ పోరాట మార్గంనించి మేం రాలేం వివేకానందగారూ... మమ్మల్ని క్షమించండి'

"అయితే ఒక పని చెయ్యండి''

"ఏమిటది?"

"నా డిమాండ్‌ని మీ కమిటీలో ఓటింగ్‌కి పెట్టండి... నేను గెలిస్తే మీరు పోరాటం మానేసి ఎన్నికల్లో పోటీ చెయ్యాలి... కనీసం ప్రయోగాత్మకంగా... లేకపోతే నాదారిన నేను




వెళ్తాను''

"సరే ఓ రచయితగా మీమీద ఉన్న గౌరవ భావంతో దీనికి అంగీకరిస్తున్నాను... వచ్చే నెలలో మా ప్లీనరీ సమావేశాలున్నయ్... అందులో మీ డిమాండ్ ప్రవేశపెడతాను. ఏమవుతుందో చూద్దాం"

తర్వాత రెండ్రోజులపాటు వాళ్ళిద్దరిమధ్య తీవ్రస్థాయిలో వాదోపవాదాలు, చర్చలు జరిగాయి. అయితే సారాంశం ఒక్కటే.

ఆ రాత్రి ఆయన దగ్గరికి ఇద్దరు తీవ్రవాదులు వచ్చారు. ఆ మర్నాడు ఉదయాన్నే అన్నాడు సూర్యం.

"మీరీనెల రోజులు ఇక్కడే ఉండాల్సిన అవసరం లేదు. ఇంటికి వెళ్ళండి. మావాళ్ళు తీసుకెళ్తారు''

"నా డిమాండ్ ఏమైందో నాకెలా తెలుస్తుంది?"

"ఉత్తరం రాస్తాను''

"ఓకె... లాల్‌సలాం"

"లాల్‌సలాం"

అడవిలో చాలాదూరం వెళ్ళాక అడిగాడు వివేకానంద, ఛాయని.

"మీరు అజ్ఞాతవాసంలోనే ఉంటారా... నాతోపాటు వచ్చేస్తారా?"

"ఇక్కడే ఉంటాను''

"ఏం"

"మీ వాదన బాగుంది గాని, వాస్తవంగా ఈ ప్రపంచంలో జరుగుతున్నది వేరు. నా అనుభవం వేరు''

"థాంక్స్... కనీసం మిమ్మల్ని కొంతయినా ఒప్పించగలిగాను''

తోడుగా వచ్చిన నక్సలైట్లు వివేకానందని బస్సెక్కించి అరుణాభివాదాలు చేసి వెళ్ళిపోయారు.

★ ★ ★

ఇంటికి క్షేమంగా చేరిన భర్తని చూసి సుమతి పొంగిపోయింది. ఆమె కళ్ళనిండా నీళ్ళే. ఎన్నో అడగాలని, ఏవేవో చెప్పాలని ఉన్నా భర్తని అపురూపంగా చూస్తూ, అతనికి తలంటిపోసి, మంచి విందు భోజనం ఏర్పాటు చేసి, ఆ రాత్రి అతన్ని తన నులివెచ్చని కౌగిలిలో చేర్చుకుంది.

వివేకానంద తను ప్రారంభించిన నవలని మళ్ళీ రాయడం ప్రారంభించాడు. అయితే దాన్ని ఎలా ముగించాలో అర్థం కాలేదు మొదట. దానికోసం రెండురోజులు మెదడంతా చించుకున్నాక ఒక ఆలోచన తట్టింది. దాంతో ఆ నవలని పూర్తి చేశాడు. ఆ ముగింపు వాక్యాలు ఇవి.

"సమాజాన్ని, మనుషుల్ని సంస్కరించాలని ఎంతో కాలంనించి కవులు, రచయితలు, మేధావులు, కళాకారులు, శాస్త్రవేత్తలు చెబుతూ వస్తున్నారు.

కాని సంస్కరించాల్సింది.

సమాజాన్ని, మనుషుల్ని కాదు.

ఈ ప్రభుత్వాన్ని... పాలకుల్ని''

నవల రాయడం పూర్తయింది కాని సూర్యం దగ్గరనించి ఇంకా ఉత్తరం రాలేదు. వివేకానంద ఆశగా, ఆదుర్దాగా, ఆత్రంగా దాని కోసం ఎదురుచూస్తున్నాడు.



## అంకితం

నేను రచయితని కావడానికి కావాల్సిన స్ఫూర్తి ఇచ్చి భుజంతట్టి ప్రోత్సహించిన మిత్రుడు రావూరి జేసుప్రసాద్,ఆప్తుడు సయ్యద్ హనీఫ్ ఈ నవలారచనకు స్ఫూర్తి ఇచ్చిన మిత్రుడు, తాత్వికుడు పాలెపు సుబ్రహ్మణ్యేశ్వరరావులకు అభిమానంతో

-పులిపాక శ్రీరామచంద్రమూర్తి



# చతురకతలు

## ప్రార్థన

ఎక్కడా వానజాడలే అగుపడ్డంలేదు ఆ జిల్లాలో. పొరుగు రాష్ట్రాల్లోనేమో వరదలు. రాష్ట్రంలోని ఇతర జిల్లాల్లో కూడా అక్కడక్కడ చెదురు మదురుగానో, ఓ మోస్తరుగానో వర్షాలు కురుస్తున్నాయి. 'మన ఖర్మమేమిటో వర్షాలు పడకపోవడానికి' అని వాపోతున్నారు ప్రజలు. 'ఫలానా ప్రాజెక్టుకి అనుమతిచ్చివుంటే వర్షాలు కాస్త ఆలస్యమైనా నీటి ఇబ్బంది లేకపోవును' అని కూడా ఆలోచిస్తున్నారు.

ఏమైనా వానలు పడలేదు. దాహంతో పొలాలు బీటలు తీసిపోయాయి. రైతులందరూ ఉసూరుమంటూ వానదేవుడి కరుణకోసం ఎదురుచూస్తున్నారు. ఎవరికివారే వానల కోసం ప్రయత్నాలు మొదలుపెట్టారు. ప్రతి ఊళ్లోనూ ఎక్కడెక్కడి కప్పల్నీ పోగుచేసి పెళ్లిళ్లు చేసి ఊరేగింపులు చేస్తున్నారు. దేవాలయాల్లో అభిషేకాలు, పూజలు నిర్వహిస్తున్నారు. మరికొన్ని ఊళ్లల్లో వరుణజపాలు మొదలుపెట్టారు.

ఆ జిల్లా కేంద్రంలో ఓ స్వామిజీ ఉన్నారు. ఆయన ఆధ్యాత్మిక ప్రవచనాల్లో పేరొందినవారు. ఎంత దూరపుగ్రామాన్నుండి ఆహ్వానించినా, తన అధునాతన సదుపాయాలన్నీ కలిగివున్న 'ధర్మప్రచార రథం'లో వెళ్లి అక్కడ ప్రసంగాలు చేసేవారు. రాష్ట్రంలో కొన్ని ముఖ్య పట్టణాల్లో ఆయనకు ఆశ్రమాలు ఉన్నాయి.

అనావృష్టి పాలబడిన ఆ జిల్లాలోని తన



ఆశ్రమంలో వరుణదేవుని కృపకోసం ఒక యజ్ఞాన్ని ప్రారంభించి పూర్తిచేశారు. ఆఖరురోజున పెద్ద ప్రార్థనా సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఆయనమీద ఉన్న నమ్మకంతో జిల్లా నలుమూలలనుండి ప్రజలు పెద్ద సంఖ్యలో వచ్చారు. అనుకున్న సమయానికి సభ ప్రారంభమయింది. వేదికపై స్వామిజీ, మరి కొందరు పట్టణ ప్రముఖులు ఆశీనులయ్యారు. స్వామిజీ గురించి, వారి గొప్పదనం గురించి వక్తలు ప్రజలకి వివరించారు. స్వామిజీ నిర్వహించే సామూహిక ప్రార్థన ఫలితంగా వర్షం తప్పక కురుస్తుందనే అందరి నమ్మకం.

చివరిగా స్వామిజీ లేచారు. సభికులందరూ ఆయన ఏం చెబుతారా అనే ఉత్కంఠతో నిశ్శబ్దంగా కూర్చున్నారు.

గంభీరంగా విన్పించింది స్వామిజీ కంఠం. "వేలాదిమంది ఈ ప్రార్థనా సమావేశానికి హాజరవడం ముదావహం. ప్రజల మనస్సుల్లో ఉన్న ఆధ్యాత్మికత నాకెంతో ఆనందాన్ని కలిగిస్తోంది. కానీ ఈ ప్రార్థనలవల్ల వర్షం కురుస్తుందనే నమ్మకం ఎవరికీ ఉన్నట్టు లేదు'' అని ఒక్కసారి ఆగి సభనంతా కలయజూశారు స్వామిజీ.

'ఏమిటా ఆ కారణం'... అని అందరూ ఆలోచనలు చేస్తుండగానే స్వామిజీ చెప్పారు నవ్వుతూ-

"ఏ ఒక్కరూ గొడుగు తెచ్చుకున్నట్టు లేదు''

సభలో కలకలం రేగింది!

**-సూరిపండు**

---

## వాc...

ఏడు గంటలు అయితేకానీ మెలకువ రాని నాకు ఆరు గంటలకే మెలకువ వచ్చింది. ఏదో గోల, గందరగోళంగా చెవుల్లో పడటంతో మంచం మీదనించి లేచాను.

ఏమిటా అని ఆందోళనతో వీధి తలుపులు తీసి వాకిట్లో నిలబడ్డాను.

"పాపం శేషుబాబు..." అని విచారపడుతూ కొంతమంది ఆడవాళ్లు శేషుబాబు వాళ్ల ఇంట్లోనించి బయటకు వచ్చి మా ఇంటిమీదు



గా పోతూ అనుకుంటున్నారు.

మాకు మూడు ఇళ్ల అవతలవున్న శేషుబాబు ఇంట్లోనించి ఆ గోల, విషాద స్వరాలు వినబడుతున్నాయి. ఆడవాళ్లతోపాటు కొంత మంది మగవాళ్లూ ఆ గుంపులో వున్నారు.

ఏమైంది శేషుబాబుకి?

పాపం వాళ్ల నాయన, ఆ ముసలాయన పరంధామయ్యకానీ పరలోకానికి పోయాడా?

నిజానికి ఆయన ఏమంత ముసలాడు కూడా కాదు. మంచి మనిషి. మా వీధికి పెద్దతలకాయ ఆయనే. మంచికీ, చెడుకీ సలహాలు ఇస్తుంటాడు.

నిన్న వుదయం నాతో మాట్లాడాడు కూడా. ఆరోగ్యం బాగులేదని చెప్పాడు. బీపీ, షుగరూ, వుబ్బసం గట్రా వున్నాయట.

"ఇంకెంతకాలం బతుకుతాన్లే నాయనా, ఇవాళో రేపో!" అన్నాడు నిన్న మాటల్లో. నిన్ననే కాదు, దాదాపు ఏడాదినుంచీ అదే మాట అంటున్నాడు అప్పుడప్పుడూ.

పాపం, అన్నట్లే పోయాడన్నమాట!

ఆయనకి ఏకైకకొడుకు శేషుబాబు.

శేషుబాబుకి చౌకడిపోవుంది. చక్కెర, బియ్యం, కిరోసిన్ ఏదో నామకార్థం పంపిణీ చేసి ఎక్కువ ధరకి దొంగతనంగా చిల్లరకొట్ల వాళ్లకి అమ్ముకుంటాడు.

ఆయనకి ఇద్దరో ముగ్గురో కూతుళ్లు. ఆయన భార్య ఇప్పుడు ప్రసవించడానికి సిద్ధంగా వుందని నిన్ననే మా ఆవిడ చెప్పింది. ఏదో సందర్భం వస్తే చొక్కావేసుకుని వెళ్లి శేషుబాబుని పలకరించి రావడం మంచిది. రేపు చక్కెరో, కిరోసినో కావాలంటే ఇవ్వొద్దూ?

వాళ్ల ఇంట్లోనించి వస్తున్న వాళ్లు కొంత మంది సానుభూతితో విచారపడుతూ పోతూ వుంటే, కొంతమంది ముసిముసి నవ్వులతో గుసగుసలాడుకుంటూ పోతున్నారు.

ఛీ! లోకం ఎంత దిగజారిపోయింది! వాళ్లు అంత ఆపదలో వుంటే వీళ్లకి నవ్వేలా వస్తుందో!

చొక్కా వేసుకుని శేషుబాబు వాళ్లింటికి వెళ్లాను.

ఇంట్లో నించి శేషుబాబు భార్యా, చెల్లెలూ శేషుబాబు అమ్మా కాబోలు గద్గద స్వరాల్తో ఏదో చెపుతున్నారు.

శేషుబాబు ఒక్కడే విచారవదనంతో బయటకుర్చీలో కూర్చుని వున్నాడు. ముందు శవాన్ని చూసి వచ్చి అతన్ని పరామర్శించటం మంచిదనుకున్నాను.

లోపలకి వెళ్దాం అంటే గుమ్మంలో ఆడవాళ్ల గుంపు!

"ఊరుకో శేషూ... ఊరుకో...ఏం చేస్తాం? కానివ్వు ఎలా జరగాల్సి వుంటే అలా జరుగుతుంది" అన్నాను నేను అతని దగ్గరకి వెళ్లి, సానుభూతిగా.

అతను నా వైపు చూసి తలదించుకున్నాడు బాధగా. అంతలో దూరంగా మోకాళ్లమీద కూర్చుని ఖణేల్‌ఖణేల్ మంటూ దగ్గుతూ ముసలాయన కనిపించాడు.

మరి, ఆయన టిక్కెట్టు పుచ్చుకోలేదా?

ఇంతలో మా ఆవిడ జనాన్ని ఛేదించుకుని బయటకు వచ్చి ఇంటి దారి పట్టింది.

ఆమెను అనుసరించి ఇంటికి వెళ్లిన తరువాత అడిగాను.

"ఎందుకు వాళ్ల ఇంట్లో ఆగోల? ఎవరు పోయారు?"

"పోవటం ఏమిటీ, అశుభం మాటలు, అందరూ నిక్షేపంలా వుంటే! శేషుబాబు భార్య శేషారత్నం ప్రసవించింది. ఆపిల్ పండులాంటి ఆడపిల్లపుట్టింది!"

విస్తుపోయాన్నేను. "అందుకు ఏడుస్తున్నారా?"

-మొలకలపల్లి కోటేశ్వరరావు




# చతుర ప్రపంచం

## కళకి గుర్తింపు

ఆధునిక చిత్రకళ ఇంచుమించు ప్రపంచంలో చాలా దేశాల్లో బాగానే అభివృద్ధి చెందుతోంది. ఇటీవలి కాలంలో వచ్చిన ఎమ్.ఎఫ్. హుస్సేన్ చిత్రం పది లక్షల రూపాయలకి అమ్ముడుపోవడం ఆశ్చర్యకరమైన విషయమేగాక ఆధునిక చిత్రకళకే ప్రతిష్ఠాత్మకమైన విషయం. ప్రఖ్యాత ఇండియన్ చిత్రకారుడు ఫ్రాన్సిస్ న్యూటన్ డిసౌజా తన గురువంటాడు హుస్సేన్.

అరవై అయిదేళ్ల వయసుగల ఫ్రాన్సిస్ జూనియర్ పికాసోగా పేరు తెచ్చుకున్నాడు. ఇంతవయసులో కూడా ఫ్రాన్సిస్ అందర్నీ ఆశ్చర్యపరచే ఆధునిక చిత్రాల నెన్నిటినో గీస్తున్నాడు.

గోవాలో పుట్టిన ఫ్రాన్సిస్ బొంబాయిలోని జె.జె.ఆర్ట్ స్కూల్లో పదహారేళ్ల వయసులో చేరాడు. 21 సంవత్సరాల వరకు అక్కడే చదువు కొనసాగించాడు. కమ్యూనిస్ట్ సిద్ధాంతాలతో ప్రభావితమైన ఫ్రాన్సిస్ బొంబాయిలోని ట్రేడ్ యూనియన్ మూవ్‌మెంట్ మీద అనేక చిత్రాలు గీశాడు. టెక్స్‌టైల్ మిల్ వర్కర్లకు సంబంధించిన స్ట్రైకు చిత్రాలు అతనికెంతో కీర్తిని తెచ్చిపెట్టాయి.

కానీ ప్రస్తుతం మాత్రం అతడు కమ్యూనిజానికి వ్యతిరేకి. కేవలం అమెరికాలాంటి కేపిటలిస్ట్ దేశాలు మాత్రమే తన ఆధునిక చిత్రకళను గుర్తించాయంటాడతను.

అతను జీవితంలో చాలాకాలం ఇంగ్లాండులోనే గడిపాడు. కళయొక్క అత్యుత్తమ రూపం పాశ్చాత్యదేశాల్లోనేకాక ఇండియాలోనూ చూడగలమంటాడు అతను.

నిజానికి ఫ్రాన్సిస్ ఇంగ్లాండులోనే గడపడం వెనుక కారణం వుంది. ఇక్కడ ఉండగా అతడికున్న వస్తువులనన్నిటినీ తనఖా పెట్టి మంచి ఖరీదైన రంగులు, బ్రష్‌లూ కొని ఎన్నో నగ్న చిత్రాలను గీశాడు ఫ్రాన్సిస్. కానీ పోలీసులు దాడి చేసి వాటినన్నిటినీ నాశనం చేశారు. దాంతో కుంగిపోయిన ఫ్రాన్సిస్ స్నేహితుడి దగ్గర అప్పుచేసి ఇంగ్లాండు వెళ్లిపోయాడు.




1958 నాటికి అతడు కీర్తినీ, ధనాన్ని సంపాదించాడు. ప్రపంచంలోని ఐదుగురు ప్రఖ్యాత చిత్రకారుల్లో ఒకడుగా గుర్తింపబడ్డాడు. కుగెన్‌హామ్‌లో బ్రిటిష్ ప్రభుత్వం ఈయన చిత్రాల ఎగ్జిబిషన్‌ని నిర్వహించింది. పారిస్, న్యూయార్క్, స్టాక్‌హామ్, ఫ్రాంక్ ఫర్ట్ వగైరా ఎన్నో ప్రాంతాల్లో ఇతని చిత్రాల ఎగ్జిబిషన్‌లు

ఏర్పాటు చేయబడ్డాయి. తొందర్లోనే ఆయన్ని జూనియర్ పికాసో అంటారని అభిప్రాయపడుతున్నారు కొంతమంది.

లలిత కళా ఎకాడమీలు అనేక ప్రభావాలకి లొంగిపోవడంతో మనదేశంలో నిజమైన కళకి గుర్తింపు దొరకడం లేదంటాడాయన. సరయిన ప్రోత్సాహం, ప్రేరణ లభిస్తే ఇండియన్ ఆర్టిస్టులు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించడంలో ఎవరికీ తీసిపోరని ఈయన అభిప్రాయం.

## బెదిరిన పులి

ఇంటికాపలా కోసం చాలామంది కుక్కల్ని పెంచుతారు. కొంతమంది ముద్దు కోసం పెంచుకుంటారు. పూర్వం దొంగలొచ్చినప్పుడు కుక్క మొరిగితే ఇంటి వాళ్లందరూ లేవడం, దొంగలు పారిపోవడం జరిగేది. కానీ ఇప్పటి దొంగలు గుమ్మంలో సింహాన్ని కాపలా పెట్టినా భయపడటంలేదు. బ్రహ్మాండమైన మారణాయుధాలతో దాడి చేసి కనిపించిన వాళ్లని చంపి పారేసి మరీ దోచుకుపోతున్నారు. ఇంక కుక్కలు లెఖ్ఖలేదు. అయినా కుక్కని పెంచడం మాత్రం చాలామంది మానలేదు. ఆమధ్య మహారాష్ట్రలో మసూర్ అనే ప్రాంతంలో ఓ ఇంట్లో కుటుంబ సభ్యులంతా కలిసి రాత్రి 9.30కి తీరిగ్గా భోంచేస్తుండగా హఠాత్తుగా వాళ్ల పెంపుడు కుక్క వీధిలోంచి పరిగెత్తుకుంటూ ఇంట్లోకొచ్చి దొడ్డి గుమ్మంగుండా మాయమయింది.

ఎవరికీ ఏమీ అర్థంకాక బయట ఏ కొత్త జంతువునైనా చూసిందేమోనని యజమాని లేచి వీధిగుమ్మంలో కెళ్లబోయేంతలో ఓ పులి అత్యంత వేగంతో లోపలికొచ్చి అక్కడున్న మనుషుల్ని కూడా చూడకుండా గదుల్లోకి దూరింది. వెంటనే వాళ్లలో తెలివైన ఆ యజమాని తల్లి అందర్నీ బయటకి పారిపోయి తలుపు బయట గడియపెట్టమంది. తను కూడా దొడ్డిధోవన పరిగెత్తి దొడ్డి తలుపు బయట గడియపెట్టింది. అందరూ కలిసి ఇంటికి కొంచెం దూరంలో ఓ చెట్టుకింద బిక్కుబిక్కుమంటూ కూర్చున్నారు. దానికి తగ్గట్టు హోరున వాన కురవడం ప్రారంభించింది. ఆ వానలోనే తూర్పు దిక్కుకు తిరిగి సూర్యోదయం కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు. తెల్లవారాక చుట్టుపక్కలవాళ్లని కొంతమందిని పిలిచి అందరూ కలిసి ధైర్యంగా ఇంటి తలుపులు తీశారు. ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్న పులి బయటకు ఒక్క దూకుదూకి జనాన్ని చూసి మరింత బెదిరి అక్కడున్న పొలాలగుండా అడవిలోకి పారిపోయింది. అయితే రాత్రంతా మాత్రం దానికేం చెయ్యాలో తోచక వంటింట్లోవున్న పచ్చివి, ఉడికినవి, వేగినవి సమస్త తినుబండారాలన్నీ తినేసింది.




Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

